The Largest Circulated Telugu Monthly

# చతుర

ఆగస్ట్ 1997

రూ. 7/-



INDEPENDENCE 50 Th CELEBRATIONS

## మల్లె పందిరి

— పులిగడ్డ శ్రీరామచంద్రమూర్తి




# స్వర్ణోత్సవ జాతియోద్యమ సాహిత్యం

చిరకాలంగా పరపాలనలో మగ్గుతున్న మాతృదేశానికి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను చేకూర్చడానికి భారతీయులెందరో ఎన్నో వీరోచితమైన, సాహసోపేతమైన కృత్యాల ను గావించారు. తమ సర్వస్వాన్నీ భరతమాత చరణాలకర్పించారు. ప్రాణాలను సహితం గడ్డిపోచగా భావించారు. ధైర్య స్థైర్యాలతో ఆత్మార్పణం చేసి చరితార్థుల య్యారు. ఇదంతా 19వ శతాబ్దిలో జరిగింది. ఆంగ్ల విద్యాభ్యాసం వల్ల మనదేశంలో ఒక వినూత్న శకమారంభమైనదనవచ్చును. భారతజాతినంతా సమైక్యపరచి ఒకే త్రాటిపైన నడిపింది. పాశ్చాత్య సాహిత్య సంస్కృతుల ప్రభావంతో భారతీయుల్లో నవ చైతన్యం కలిగి ఆధునిక భావ పరిణామమేర్పడింది. రూసో భావ స్వాతంత్ర్య విప్లవం మన దేశ సాంస్కృతిక పునరుజ్జీవనానికి ఎంతో ఉపకరించింది. స్వజాతి, స్వదేశం, స్వభాష అనే భావాలు దేశీయుల్లో ప్రబలాయి. విశాల దృక్పథంతో కూడిన బ్రహ్మసమాజం మొదలైనవాటి సిద్ధాంతాల ప్రచారం జాతి సమైక్యతకు దోహదకార

యింది. ప్రగాఢ దేశాభిమానం, స్వాతంత్ర్య కాంక్ష భారతీయుల్లో రగుల్కొన్నాయి.

సాహిత్యం సమాజానికి అద్దం పడుతుంది కనుక నాటి దేశ స్థితిగతులకు తగినట్టుగానే సాహిత్యంలోనూ నాటి సాంఘిక రాజకీయ చైతన్యం ప్రతిబింబించింది. ఆనాటి భారతీయ కవులెందరో దేశభక్తి ప్రపూరితమైన కవితలనాలపించి ప్రజలలో దేశభక్తి బీజాలను నాటారు. ప్రాచీన భారతదేశ వైశిష్ట్య వైభవాలను ఉల్లేఖించి, వర్తమాన దైన్యహైన్యాలను చిత్రించి మాతృదేశోద్ధరణకు నడుంకట్టవలసినదిగా ప్రబోధించారు. నిద్రాణమైన భారతజాతిని మేల్కొల్పి జాతీయోద్యమంలో పాల్గొనేట ట్లు చేసిన కవులనే మనం జాతీయోద్యమ కవులుగా పేర్కొంటున్నాము.

వంగ భాషా సాహిత్యకారులలో బంకించంద్రుని 'వందేమాతరం', రవీంద్రుని 'జనగణమన' గేయాలు జాతీయ గీతాలుగా ఏనాటినుండో భారతీయుల హృదయాల ను ఉత్తేజపరుస్తున్నాయి. అవే ఆనాటి జాతీయోద్యమ నినాదాలై జాతీయతా భావాలకాటపట్టుగా నిలిచాయి. ఇక్బాల్ 'సారేజహాసే అచ్ఛా హిందోస్థా హమారా' గేయం మన దేశ ఔన్నత్యాన్ని తెలిపి ప్రజల్లో దేశాభిమానం పెల్లుబికేట్లు చేసింది.

తిలక్ 'స్వాతంత్ర్యం నా జన్మహక్కు' అన్న సింహగర్జన తెలుగు నాట మార్మోగటంతో కవితారామంలోని కవికోయిలలు అవ్యాహతంగా దేశభక్తి గేయాలనా లపింపసాగాయి. స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో తనదైన ఒక ప్రత్యేక స్థానాన్ని సంతరించుకున్న తెలుగునాడులో జాతీయోద్యమాన్ని గురించి ఇతోధికంగా పాటుప డిన తెలుగు కవులెందరో!

లార్డ్‌కర్జన్ చేసిన వంగ రాష్ట్ర విభజనకు భారతీయులలో ఆగ్రహావేశాలు పెల్లుబికాయి. 'కృష్ణాపత్రిక' సంపాదకులు ముట్నూరి కృష్ణారావుగారి ఆహ్వానంతో ఆంధ్రదేశానికి వచ్చిన బిపిన్‌చంద్రపాల్ ఉపన్యాసం నాటి తెలుగువారి నెందరినో



ఉత్తేజపరిచింది. చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు-

"భరతఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియగట్టి"

-అంటూ ఆంగ్లేయులు మనదేశాన్ని కొల్లగొట్టుతున్న తీరుతెన్నులను చక్కగా చెప్పారు. అప్పుడే తెలుగునాట జాతీయోద్యమ కవిత్వానికి బీజంపడింది.

మహా కవి గురజాడవారి ముత్యాల సరాలలో-

"దేశమును ప్రేమించుమన్నా
మంచియన్నది పెంచుమన్నా" అంటూ వట్టిమాటలను కట్టిపెట్టి గట్టిమేలు తలపెట్టాలనీ, అన్నదమ్ముల్లాగా దేశస్థులందరూ చెట్టపట్టాలేసుకుని ముందుకు సాగాలనీ, దేశమనెడి దొడ్డవృక్షం ప్రేమ యనే పూలనివ్వాలనీ, ఆకులందున అణగి మణగీ కవితకోయిలలు పలకాలనీ, ఆ పలుకులను విని దేశమందభిమానం మొలకెత్తాలంటూ ఉద్బోధించిన దేశభక్తి గేయం సమాజాన్నెంతో ఉత్తేజ పరచింది.

మనస్సు భావ ప్రపూర్ణమై రసార్ద్రమై వెల్లివిరిసినపుడు కవి వాక్కుకు అమోఘమైన శక్తియుక్తులు చేకూరుతాయి. ఆ భావాలన్నీ నిసర్గమనోహరమైన లయాత్మకతతో అక్షరాకృతినొందుతాయి. అవి జాతిని మేల్కొల్పి, దేశభక్తిని ప్రబోధించి ప్రజలను కర్తవ్యోన్ముఖులను చేస్తాయి.

మంగిపూడి వారు,

"మేలుకొనుమీ భరతపుత్రుడ!
మేలుకొనుమీ సుజన మిత్రుడ!
మేలుకొనుమీ సచ్చరిత్రుడ!
మేలుకొనవయ్యా! వత్సా!
వేడుకను జాతీయతయను
వేగుచుక్క పొడిచెనదిగో
కూడి వందేమాతరంబని
కుక్కుట ములరచెన్' అంటూ విజ్ఞానమనే అరుణోదయమై అంతఃకలహమనే చీకటి చెల్లిపోయిందనీ అంతటా నవశక్తి అనే కాంతిపుంజం తేజరిల్లిందనీ, మంతనంతో నూతనోద్యమ మారుతం వీచిందంటారు. ప్రపంచంలో సామ్రాజ్యవాదం క్రింద నలుగుతున్న అన్ని దేశాలలోనూ స్వాతంత్ర్యోద్యమాలు జరుగుతున్నాయనే విషయాన్ని తెల్పుతూ-

"అందరు నీకంటెముందర
నడుగు వేయుచు మెలగుచుండగ
పందవలెనిటు నిద్రపోవగ
పాడి యగునయ్యా' అనీ
"భారతీయుడె సద్గురుడని
పాడుచున్నది వినుము భారతి
ధీరవరుడవు నీ స్వశక్తిని
తెలిసికొనుమయ్యా" అంటూ ఉత్తేజపరుస్తాడు. ఇదేవిధంగా బెల్లంకొండ చంద్రమౌ

శాంతా గ్రైండరువారు మీ కొరకై టిల్టింగ్ గ్రైండర్లను మల్టీ పర్పసుగా అందిస్తున్నారు. ఇడ్లీ పిండి రుబ్బడమేకాక పొడిపిండి, చపాతిపిండి కలపడం, దంచడం, చిలకడం, నూరడం, మెదపడంలాంటివి కూడా చేసుకోవచ్చు పూర్తి స్టెయిన్‌లెస్ స్టీలువిడి భాగాలతో, అరుగుదలే ఎరుగని గ్రానైటు పాత్రాలతో, పిండి తీసేటప్పుడు వంచుకునే వీలుతో అతి తక్కువ కరెంటు ఖర్చుతో, 24 గం॥లు నడువగల్గె దృఢమైన మోటారుతో ముచ్చటైన రంగులలో 4 సైజు (1.1 1/4, 2 & 5 LTR) లలో లభ్యం.




**ALSO WITH 110 VOLTS MOTOR FOR EXPORTS FOR U.S.A, U.K, CANEDA**

santha®

Multi-purpose Tilting Grinder

*వివరములకై సంప్రదించండి:*

| **Head Office:**<br>**H.No : 121, S.B.I. Colony,**<br>**Gandhi Nagar,**<br>**Hyderabad-500 080**<br>**Phone :7533991** | **PH. No : 75330**<br>**D.No : 14-1-25,**<br>**Beside GARAPATI Garriage,**<br>**Samba Murthy Road,**<br>**Near Alankar Theatre, Gandhi Nagar,**<br>**Vijayawada - 520 003.** |
|---|---|

శిశాస్త్రిగారు కూడా-

"ఓ నిద్రమత్తుల్లారా! ఓ భద్రా ప్రమత్తుల్లారా!

ఈ ప్రాభాతిక వేళను మీ ప్రాంగణములు తెరువుడు

మేలుకొనుడు మేలుకొనుడు మేల్మిబంగరు ఉషస్సిది

లెండిక స్వాతంత్ర్యమిక లెండు శ్వాస విడువుడిదె'' అంటూ జాతికి మేలుకొలుపు పాటలు వినిపించారు.

భారతదేశ ఔన్నత్యాన్నీ, పురావిభవాన్నీ కీర్తించి దేశీయులను పులకితగాత్రులను చేసి స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొనేటట్లు చేసిన కవులెందరో!

వారిలో రాయప్రోలు సుబ్బారావుగారి-

"శ్రీలు పొంగిన జీవగడ్డయి

పాలు పారిన భాగ్యసీమయి

వ్రాలినదియీ భరతఖండము

భక్తిపాడర తమ్ముడా!" అంటూ ఏ పూర్వపుణ్యం వలనో ఏ యాగ బలంచేతనో ఈ స్వర్గఖండంలో జన్మించామంటారు.

మరో గేయంలో "ఏ దేశమేగినా ఎందుకాలిడినా యే పీఠమెక్కినా ఎవ్వరెదురైనా పొగడరా నీ తల్లి భూమి భారతిని! నిలుపరా నీజాతి నిండు గౌరవము'' అని ప్రబోధిస్తారు.

చన్నాప్రగడ భానుమూర్తిగారు-

"మతముల జొచ్చినిల్లు జనమాన్య చరిత్రుల పుట్టినిల్లున

ప్రతిమదమశమాది గుణరత్న సమృద్ధికి రోహణాదిశా

శ్వతనిరపాయ మోక్షఫల భాసుర వేదలతాలవాలమై

యతుల విభూతి బొల్తువిలనంబరొ! నీ సరిధన్యలుందురే'

అంటూ భారతమాత ఘనతను సంస్తుతిస్తారు.

గురజాడ రాఘవశర్మగారు-

"హిమాలయోన్నత సమాదర్శిని

తమోదళన విద్యా స్వరూపిణి

ధీరవీరవర నారీ రూపిణి

వైరి వర్గ సంహారిణీ తారిణీ

సార్థక ధర్మ చక్ర పతాకిని

సకల సౌఖ్య రాజ్య ప్రదాయిని'' అంటూ భారత జననికి జయజయ ధ్వానాలు చేస్తారు.

జాషువా కవివరుడు-

"ప్రమథనాథుని నీరు ద్రావింపజాలిన

వజ్రాల కొడుకుల బడసినావు

నరకాధిపతి గుండె గరిగింపజాలిన

వెలది మిన్నలకుగ్గుబెట్టినావు

బ్రహ్మయంతటివాని వణకింపజాలిన

మునుల మూపున నిడి మోసినావు

అంటినంతన పాపమణగింపజాలిన

తీర్థకోటుల మున్గితేలినావు
యుర్వి పుట్టకముందె నీవుంటివేమో
సకలశాస్త్ర పురాణముల్ చదివినావు
గొనబు సిరిగల భాగ్యశాలినివి నీవు
భారతాంబామణీ నమస్కారమమ్మా!"

అంటూ భరతమాత పౌరాణిక ప్రాశస్త్యాన్నుగ్గడిస్తాడు.

గౌతమకోకిల శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రిగారు-

"ఆ ఉషోదేవతా నయనాబ్జ మధువు
లొలుకు నీ శైశిర ప్రభాతోదయమున
గుర్తువట్టి సంతానకోటితోడి
తల్లి నీవెపో! నా విశ్వధాత్రివనుచు'' అంటూ బహిరంతర శాంతి సుధలు స్రవింపగా 'అమ్మా' అని పిలుస్తూ ఆమె చరణాల వద్ద మోకరిల్లానంటారు.

దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు "జయజయజయ ప్రియ భారత జనయిత్రీ దివ్యధాత్రీ'' అనే గేయం ఇక్బాల్, బంకిం, రవీంద్రుల జాతీయ గీతాలకు సరిదీటుగానూ ఒకవిధంగా చూస్తే భావ, పద సౌందర్య దృష్ట్యా వాటిని మించినట్లుగానూ రచించారు. తన ఉదాత్తమైన హృదయాశయాన్ని భరతమాత పాదాలకు పారాణిగా పూశారు. తన మధురగేయం ఆమె సుందర చరణాలను ముద్దిడుకుంటుందనే ఆత్మవిశ్వాసాన్నభివ్యక్తం చేస్తారు.

వానమామలై వరదాచార్యులుగారు- "సకల సంపత్ఖనీ! సస్యనందనవనీ'' అని నుతిస్తారు.

మహాకవి దాశరథి- "యుగయుగమ్ముల పున్నెపు పంటవీవు! నీ పూజకు తెచ్చినాడనిదె పొంగిన గుండియనిండు పద్దెముల్' అని సంస్తుతిస్తాడు. ఈవిధంగానే గరికపాటి మల్లావధాని, బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి, మంగిపూడివెంకటశర్మ, ముట్నూరి వెంకటసుబ్బారావు, బలిజేపల్లి, పైడిపాటి, మల్లాది రామచంద్రశాస్త్రి మొదలైన కవులెందరో భరతమాతను కీర్తించారు.

ఇంతటి మహౌన్నత్యంతో రాజిల్లిన భరతదేశపు వర్తమాన దుస్థితిని కళ్లకు కట్టేటట్టుగా తెలియపరుస్తారు మంగిపూడి, ముట్నూర్లు తమ 'దేశదురవస్థ' అనే కవితలో. రత్నఖనులకు రమణీయ సదనం జీవనధులకు తావలము, శైలములకాటపట్టు, పంచలోహాలకు గృహం, నిఖిల శాస్త్రాలు జన్మించిన నెలవు, చక్రవర్తుల జన్మభూమి, సత్యసంధులకు వాసస్థానము, ధర్మదేవతకాధారం, దానమునకు నిలయము, ధీరశాలులైన శూరాగ్రగణ్యుల స్థానమైన భరత భూమి ఇప్పుడు దుర్భర దారిద్ర్యవస్థలో నున్నదనీ, ప్రపంచ ప్రఖ్యాతిని పొందిన కుటీర పరిశ్రమలు మూలపడ్డాయనీ, కళలు విలుప్తమవుతున్నాయనీ సూది మొదలు అన్ని వస్తువులకు అన్యదేశాలవారినే వేడుకొనవలసి వస్తోందనీ విచారిస్తారు.

వేదుల- 'తెగలు తెగలై చీలివగచే ఆమె సంతతిని తెగని స్నేహాన బంధించి ఏకం చేసి కలుషితాచారాలనూ, కులజాతిమత ద్వేషాలను పోగొట్టి ఆమె సేవచేసే భాగ్యాన్నిచ్చి చెలిమితో జాతీయ బలముతో వైభవోజ్జ్వల జీవనంతో విలసిల్లేటట్టు దీవించి దిక్కులనిండా సత్కీర్తి నిండగా భారతమాత ధ్వజం ఆనియా తలమానికంగా నిలచేటట్టు చేయమ'ని వేడుకుంటారు.

కవికొండల వెంకట్రావు- 'హిమగిరి శిఖరము వింధ్యవనీంద్రము కన్యాకుమారీ పదపిండీరము' అనే జాతీయ గీతాన్నాలపిస్తూ ముప్పైమూడు కోట్ల ముద్దు బిడ్డల జనని భరత భూమేననీ సౌభ్రాతృత్వమూ స్వాతంత్ర్యమూ సత్వరమే సమకూర్చ మంటూ-

"అహర్నిశాదులూ ఒకటేగానము

కలలో అలలో అదే ప్రయాణము

స్వాతంత్ర్యమునకై స్వాతంత్ర్యముకై' అంటూ స్వాతంత్ర్యోద్యమ బాటను సాగే భారతీయుల దృఢసంకల్పాన్ని ప్రకటిస్తారు.

"దేశాభిమానంబు దీపింపజేయుమంత్రంబు, సాహసౌదార్యముల్

సమకూరజేయు మంత్రంబు'' "స్వాతంత్ర్య భాగ్యాన్ని చేతికందిచ్చేదీ, ఐకమత్యాధిక శ్రీశులను చేసే జంత్రము, మన మనోరథాలు తీర్చి మనుచునట్టి బ్రహ్మము "వందేమాతరమే''నంటూ ఉద్బోధిస్తారు

నాటిదే అయిన ఒక చాటువు-

"వందే మాతరమనుచు వింతవార్తపుట్టెనే

బిపిన చంద్రపాలునిచేత విత్తనము నాటించిరే

పిన్నపెద్దలంతా సభావేదిక పరుగెత్తిరే

విద్యార్థులు పాఠశాల విడిచి గుంపు గూడిరే' ఇది ఆనాటి వందేమాతరం తెలుగు జనానీక జిహ్వాగ్రాలమీద తొలి జీవమంత్రంగా ఎట్లా తాండవించిందో తెలియజేస్తోంది.

జాతివర్ణ కుల మతాతీత ధ్యేయానికి ప్రతీకగా నిలుస్తుంది జాతీయజెండా. అజ్ఞానాంధకారంలో గమ్యమెటో తెలియక అలమటించే వారికి కరదీపిక. 1921లో మహాత్మాగాంధీజీ సలహామేరకు బందరు ఆంధ్ర జాతీయ కళాశాల ఉపాధ్యాయుడు పింగళి వెంకటయ్య చేత రూపొందింపబడింది మన మువ్వన్నెల జెండా. అది స్వేచ్ఛగా గరువాన గగనాన యెగిరేటట్టు చేయడానికి స్వాతంత్ర్యయోధులెందరో ఆత్మార్పణ గావించారు. జాతినంతటినీ తమ సర్వస్వాన్నీ జాతీయజండా ప్రతిష్ఠాపనకోసం అర్పించడానికి ఉత్తేజితులను గావించడంలో "ఝుండా ఊంఛారహేహ మారా విజయీ విశ్వతిరంగా ప్యారా'' అనే గేయం శ్యామ్‌లాల్ గుప్త పార్శ్వద్ రచన తెలుగు కవుల కలాలకు ఎనలేని బలాన్నీ చలాన్నీ కలిగించింది.

జాతికి ప్రాణమూ మానమూ జాతీయ జెండాయేనంటూ గురజాడ "జాతీయపతాకాన్ని ఫిరంగుల హజాన్నదుము, దేశదాస్యాన్నీ దీన దరిద్రాన్నీ బాపుతుందనీ, మతాలన్నిటికీ సమ్మతము, భారతజాతీయ వీరరక్తమోడ్చి చేరి నిర్మించు స్వ-రాజ్య సౌధముదాల్చు'' నంటారు.

"జండాయెత్తర జాతికి ముక్తిర!
నిండుగ శక్తిర నిల్పర కీర్తిర!" అన్న పాట నోట మ్రోగుతుండగా కుండుపై జాతీయ పతాక నెగరేసి పోలీసు లాఠీ దెబ్బల కెదురొడ్డి నిల్చిన 'జండావీరుడు' తోట నరసయ్య. అయినంపూడి శ్రీనివాసులను చిరస్మరణీయులుగా చేసినట్టిది. ఈ గీత రచన చేసినవారు గురజాడ రాఘవశర్మగారు.

1921 నుండీ ప్రారంభమైన జాతీయోద్యమ కాలంలో ప్రజలకు నాటి దేశ దుస్థితికి కారణాన్ని తెలియజెప్పే గీత రచనలు సాగాయి. "వాటిలో తెలియుము దేశ చరిత్ర తెలిసి దేశ దాస్యము బాపుమో భరతపుత్రా'' అంటూ తెల్లవారు ఏవిధంగా వర్తక వ్యాపార నిమిత్తం మనదేశానికి వచ్చి తమ కుటిల నీతితో దేశాన్ని కైవశం చేసుకున్నారో తెలియపరుస్తాడు గరిమెళ్ల సత్యనారాయణ.

"మాకొద్దీ తెల్లదొరతనము దేవ
మా ప్రాణాలపై పొంచి మానాలు హరియించె' అనే ప్రసిద్ధ గేయంలో తెల్లవాడి కల్లాకపటం, క్రౌర్యం మొదలైన వాటన్నిటినీ బట్టబయలు చేస్తాడు ధైర్యంగా.

లోకమాన్య బాలగంగాధర తిలక్ అస్తమయం జాతీయ కవులకెంతో పరితాపాన్ని కలిగించింది.

"దేవుడు లేని కోవెలయు దీపములేని గృహమ్ము రమ్యరా
జీవములేని కోనేరును, శీతమయూఖుడు లేనిరేయినై
బావురుమన్నదీ సకల భారతదేశము, నేడు నీవుని
ర్జీవుడవౌట జాతి బుధశేఖర! శ్రీతిలకా! జగత్ప్రభూ!
అంటూ జంధ్యాల శివన్నశాస్త్రి, జగన్నాధదాసు మొదలైనవారు స్మృతికావ్యాల నాలపించారు.

తిలక్ అస్తమయం తర్వాత జాతీయోద్యమం గాంధీజీ నాయకత్వంలో కొనసాగింది. గాంధీగారిమీది భక్తి ప్రపత్తులతోను, గౌరవాభిమానాలతోనూ సంస్తుతి గీతాలనెన్నిటినో రచించారు తెలుగు కవులు. గాంధీజీని వైష్ణవుడుగా పేర్కొంటూ కవి దామోజీ- "ఇతరుల కష్టాల నెరిగినవాడు, సతతేము పరులకు సాయము చేస్తూ

కూడా గతితానేనని గర్వపడని, కపట లోభములు కదలిచి కామక్రోధ శత్రులనారిట గెల్చువాడే వైష్ణవుడు'' అంటూ స్తుతిస్తాడు.

చెళ్ళపిళ్ల వేంకటశాస్త్రిగారు గాంధీని 'బుషి'గా సంస్తుతిస్తూ 'శ్రీగాంధీ స్తవ పంచకము'ను హరినాగభూషణంగారు రచించారు. సత్యాహింసల నాయుధంగా మలచినట్టి మహాత్మాగాంధీని తండ్రిగా సంబోధిస్తారు విశ్వనాధగారు.

కాటూరి 'గాంధీ పలుకు ధర్మగంధ ములుకు'నంటే అడివి బాపిరాజుగారు 'హిమాలయోత్తుంగ శృంగం- నీ బ్రదుకు ఉమాపతీ నృత్యరంగం' అని కీర్తిస్తారు. బసవరాజు అప్పారావు 'ఈశ్వరుడె గాంధీగా అవతరించా'డంటారు. ఆయనే వ్రాసిన 'కొల్లాయి గట్టితేనేమి మా గాంధీ కోమటై పుట్టితేనేమి' అన్న గేయం, 'గాంధీ మహాత్ముడు బయలుదేరగా కలకల నవ్వింది జగత్తు' అన్న గీతమూ నాడు బహుళ ప్రచారాన్నొందాయి.

దామరాజు:

"కత్తులు లేవు శూలమును, గాండీవమున్ మొదలే హుళక్కినో

రెత్తి ప్రచండ వాక్పటిమనేనియు జూటడు వైరిమీద దం

డెత్తగ సేనలేదు, బలహీనము కాయము, కోపతాపముల్

బొత్తిగసున్న, యట్టి వరమూర్తి మహా బలశాలిగాంధిజే

యెత్తి నమస్కరించి స్మరియించుద మెప్పుస్వరాజ్యసిద్ధికై

-అన్న కవిత, 'శ్రీగాంధీ నామం మరువాం మరువాం' అన్న గేయమూ చాలా ప్రసిద్ధి నొందాయి.

గాంధీజీ నాయకత్వంలో జరిగిన సహాయనిరాకరణోద్యమంలో ఆబాలగోపాలం

పాల్గొనేటట్లు చేసిన వారిలో పైన పేర్కొన్న గేయ రచయితలేకాక జాతీయైక్యతను చాటే వీరకావ్యకర్తలు అనేకులున్నారు. వారిలో గడియారం వేంకటశేషశాస్త్రిగారు 'శివభారతాన్ని', రాజశేఖర శతావధాని 'రాణా ప్రతాపసింహచరిత్ర' బాలకవి వేంకట సుబ్బారెడ్డి 'అరుణ సింహచరిత్ర', శ్రీధర తిరుపతి శాస్త్రి 'అమరసింహచరిత్ర', పుట్టపర్తి నారాయణచార్యులు 'షాజీ', విశ్వనాధ సత్యనారాయణ 'ఝాన్సీరాణీ' కావ్యాలను రచించిన కవులు ముఖ్యులు. వీరందరూ తమ కావ్యాల్లో స్వాతంత్ర్యోద్యమాన్ని ప్రధానేతివృత్తంగా మలచుకుని వ్యక్తులకు ప్రాధాన్యాన్నివ్వకుండా దేశభక్తిని ధ్వనిప్రాయంగా తెలిపారు.

జాతీయోద్యమంలో కవితలు, గేయాలూ, పద్యాలు, కావ్యాలు రాసినవారేకాక అన్యాపదేశ కావ్యరచన చేసిన కవులనుకూడా మనం స్మరించుకోవాలి. పురాణేతిహాసాల్లోని కథలను తీసుకుని అన్యాపదేశంగా స్వాతంత్ర్యోద్యమ సందేశాన్ని అందజేయడమే వీరి కావ్యరచనా లక్ష్యం! జంధ్యాల పాపయ్య శాస్త్రిగారి 'విజయశ్రీ' కావ్యంలో శ్రీకృష్ణుని గీతోపదేశానుసారం ధర్మరక్షణకు పాండవులు కురుక్షేత్ర సమరానికి పూనుకున్నట్లే గాంధీజీ నాయకత్వంలో భారతీయులు జాతిని పరిరక్షించడానికి ధర్మ సంగ్రామానికి పూనుకోవాలని ధ్వనిప్రాయంగా ఉద్బోధిస్తారు. చామర్తి రాజశేఖరరావుగారి 'పాంచాలీ స్వాంతనం'లో కౌరవులు ఆంగ్లేయులకు, ద్రౌపది భరతమాతకు ప్రతినిధులుగా చిత్రించి నాటి దేశ దుస్థితిని వ్యంజింపచేస్తారు.

ఈ గీతాలు, కావ్యాలతో ఉత్తేజాన్ని పొందిన ఆబాలగోపాలం సహాయ నిరాకరణోద్యమంలో మహెూత్సాహంతో పాల్గొన్నారు. 1921 నవంబరులో యువరాజు బొంబాయిని చేరుకున్న రోజున దేశమంతా హర్తాళ్! కొండపల్లి జగన్నాధదాసు "ఏమయో యువరాజ! ఎందుకొచ్చావయ్యా!" అంటూ "ఏ పాపమెరుగక బాములపడ్డాము, మము దుఃఖపెట్టుట మరియాదగాదయ్య, యెన్నటికీ ముక్తి యెరుగ చెప్పుమయ్య, మా గాంధిదేవుని మంత్రము పఠించి శాంతియుద్ధమందు చావనిలచితిమయ్య'' అంటూ భారతీయుల స్వాతంత్ర్య కాంక్షనభివ్యక్తం చేస్తాడు. స్వదేశీ వస్త్రధారణలో రాట్నం పాత్ర ప్రధానమైనది కనుక రాట్నంపైన గీతాలెన్నో వెలువడ్డాయి. కాటూరి, వెన్నెలకంటి రాఘవయ్య, గరికపాటి మల్లావధాని, చెరకువాడ వేంకట నరసింహం, కొండపల్లి, నెల్లూరి వెంకట రామానాయుడు మొదలైన వారెందరో రాట్నం మీద గీతాలను, కవితలను వ్రాసారు.

బసవరాజు:
"సిగ్గులేదా నీకు శరములేదా
అన్నమైన లేక బీదలల్లాడుతుంటేను
సీతాకోకచిలుకలాగ సీమగుడ్డ కట్టితిరుగ" అంటూ తీవ్రంగా నిరసిస్తారు.

గురజాడ- "దేశోద్ధరణకు తెరగది, కలిమిబలిమి యీ కదిరేనని ధర్మ సూత్రములు దారము తీయ, మర్మములను విధ్వంసము చేయగ, నిర్మలమగు శాంతిని వెదజల్లగ యోర్మికల్గి మానసమున వడిగా రాట్నాన్ని త్రిప్ప''మంటారు.

కల్లుమానమంటూ కూడా అనేక గీతాలు విరచితమయ్యాయి. ఒక విధంగా గాంధీగారి వారి జనోద్ధరణోద్యమానికి సుమారు 15-20 ఏళ్ల ముందే గురజాడ అప్పారావుగారు "మలిన వృత్తులు మాలవారని కులము దేర్చిన బలియురొకదేశమునకొందరి వెలికి దోసిరి'' అని,

"మంచిచెడ్డలు మనుజులందున
యెంచిచూడగ రెండె కులములు
మంచియన్నది మాలయైతే మాలనేనగుదున్' అంటూ కులముకన్న గుణము మిన్న అని ప్రబోధిస్తారు 'లవణరాజుకల'లో.
ఉప్పు సత్యాగ్రహావేశంతో మంగిపూడి పురుషోత్తమశర్మ-
"ఉప్పు కొనండయ్యా! స్వరాజ్యపు ఉప్పు కొనండయ్యా
ఉప్పు చట్టమును ధిక్కరించితే తప్పక మనకు స్వరాజ్యమువచ్చు'' అంటూ ఉప్పు సత్యాగ్రహం యొక్క లక్ష్యాన్ని వివరిస్తారు.
కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారి-
"వీరగంధము తెచ్చినారము వీరులెవ్వరో తెల్పుడీ!
పూసిపోయెదము మెడను వైతుము పూలదండలు భక్తితో' అనే గీతం జనబాహుళ్యాన్నెంతో ఆకట్టుకున్నదానాడు. ఆగస్టు విప్లవాన్ని గురించి కరుణశ్రీ, జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు-

"లేచిపోయినవి పోలీసు టోపీలు వందలు వేలు రాబందులట్లు
అల్లకల్లోలమై దద్దరిల్లిపోయె తెల్లదొరల ప్రభుత్వమందిరములెల్ల'' అంటూ కళ్లకుకట్టేటట్టు వర్ణిస్తారు.
మల్లాది రామచంద్రశాస్త్రిగారు-
"వీరావేశం పొందినారమిక వీరవిహారం చేస్తాము
పరాధీనత బాపుకొనంగా ప్రళయభేరి మ్రోగిస్తా''మంటారు.

జైలులోని కష్టాలను కడగండ్లను గురించి దాశరథి, గురజాడ రాఘవశర్మ, యనమండ్ర కృష్ణారావు, గరికపాటి మల్లావధాని మొదలైన వారెందరో కరుణరసార్ద్రంగా రచనలు చేశారు.

జాతీయభావాల ప్రేరణలో దేశభక్తి కవిత్వంతోపాటు ఆంధ్ర రాష్ట్రోద్యమ కవిత్వం కూడా బహుముఖీనంగా విస్తరిల్లింది. భాషా ప్రయుక్త రాష్ట్రాలకోసం ఆందోళనకి బీజావాపం మన తెలుగు నాటే మొదట ప్రారంభమైంది. ఈ ఉద్యమకాలంలో ఆంధ్రప్రశస్తిని, ప్రాభవాన్నీ ప్రత్యేక రాష్ట్రావశ్యకతను తెలియజెప్పే రచనలు చేశారు. రాయప్రోలు సుబ్బారావుగారు 'ఆంధ్రావళిని', విశ్వనాధ 'ఆంధ్రప్రశస్తి', 'ఆంధ్ర పౌరుషమును', తుమ్మల సీతారామ్మూర్తి చౌదరి 'రాష్ట్రగానము' కావ్యాలు రాయగా ఆంధ్ర క్షేత్ర ప్రశంసాత్మకాలైన హంపీక్షేత్రమును కొడాలి సుబ్బారావు, రామచంద్రుని హంపీయాత్రను గంటిజోగి సోమయాజులు, ద్రాక్షారామమును ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, ఓరుగల్లుకోట శ్రీనివాస సోదరులు, 'పెనుగొండ లక్ష్మి'ని పుట్టపర్తి నారాయణాచార్యులు రసోదంచితంగా రచించారు.

ఈవిధంగా జాతీయోద్యమానికి కవుల కలాలెంతో పరోక్షంగా పాటుపడ్డాయి. కవుల కావ్యాలు, గీతాలు ప్రజలలో ఉత్తేజాన్నీ వీరోద్రేకాల్ని రగిలించి స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొనేటట్టు చేశాయి. దేశమాతకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను చేకూర్చే ప్రయత్నంలో దేశభక్తులెందరో తృణప్రాయంగా తమ ప్రాణాలుకూడా అర్పించారు. ఎంతోమంది త్యాగాలకు ఆత్మార్పణలకు ఫలితంగా స్వతంత్ర భారతి అవతరించింది.

ధవళా శ్రీనివాసరావుగారు కమనీయంగా-

"అమ్మ కడగండ్లన్నీ అంతరించాయి
అమ్మ కమ్మని రోజులవతరించాయి'' అని ఆలపిస్తే

రాయప్రోలువారు "ఓ సుస్వతంత్రమా ఓ మోహమంత్రమా'' అంటూ కీర్తిస్తారు.

పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారు- "ఎత్తండీ దివ్వీటీల ఒత్తండీ శంఖాలు
కొలువు తీర్చె దేశమాత కొలువు తీర్చెను'' అంటూ

"హాటకమ్ము రత్న సింహాసనమ్మిదిగో
మువ్వన్నెవలువతోడ వచ్చు పున్నెమ్ముల ప్రోవనీకు'' స్వాగతమంటూ ఆనంద భరగీతికనాలపిస్తారు.

తురగా వెంకట్రామయ్యగారు- "దున్నరా ఈ భూమిని తొలకరించిన పుణ్యభూమిని కరువులేని స్వతంత్ర రాజ్యపు దొరవు నీవయ్యేదవురా'' అంటూ భారతదేశానికి ప్రజాస్వామ్యం రావాలని ఆశిస్తారు.

నేటి స్వాతంత్ర్య స్వర్ణోత్సవ శుభ సమయంలో మన జాతీయోద్యమ కవులందరికీ స్మృత్యంజలి ఘటించడం మన కర్తవ్యం!!

— డా. నిర్మలాదేవి. ఎన్.



# చతుర ప్రపంచం

## 'మద్య'గతం

**మ**ద్యపాన చరిత్ర పరిశీలిస్తే దీని పుట్టుక చాలా యుగాలనాటిదే! "సాంఘిక, రాజకీయ, ఆర్థిక, పౌరాణిక, మతపరమైన




గ్రంథాలన్నిటిలోనూ ఒక్క పేజీ అయినా మద్యంతో తడిసి కనిపిస్తుంది" అంటాడొక పాశ్చాత్య రచయిత. మతపరమైన వేదాలు, బైబిలు వగైరాలలోను పురాణ గ్రంథాలయిన రామాయణం, మహాభారతం, ఇలియాడ్, ఒడిస్సీ వగైరా అన్ని గంథ్రాలలోను ఈ మద్యపాన చర్చ వుంది. గ్రీకులకు మద్యపానానికి ఏకంగా ఒక దైవమే వున్నాడు. ఆయన పేరు డియోనిసిస్. అలాగే రోమనులకు కూడా మద్యపానానికి ఒక దేముడున్నాడు. నాగరికత మొదలయినప్పటినుంచీ మత, సాంఘిక కార్యకలాపాలన్నిటిలోను మద్యపానం ఒక భాగంగా వుంటూ వచ్చింది. ఒక్క కురాన్‌లో మాత్రం దీని ప్రస్థావనలేదు.

తూర్పు ఇండియాకు సంబంధించిన సంతాలె తెగలో మానవజాతి అభివృద్ధికి సంబంధించిన ఓ కథ వుంది. దాని ప్రకారం వారి దేముడు హాడమ్ అనే పురుషుణ్ణి, అయో అనే స్త్రీని సృష్టించగా వారిరువురూ హెన్రియా అనే మత్తునిచ్చే మద్యం సేవించి ఆ మత్తులో సంభోగించడంతో మానవజాతి అభివృద్ధి చెందనారంభించింది.

పాశ్చాత్యదేశాల్లో రాజకీయ, సాంస్కృతిక సమావేశాల్లో, శృంగార విహార యాత్రలలో మద్యం సేవించడం తప్పనిసరి.

పారిస్‌లో ప్రఖ్యాతిగాంచిన ష్రియజ్ లైన్‌ని మనదేశానికి తెచ్చినవాడు బాబర్ గిబ్బర్. బాబర్ తన స్వీయచరిత్రలో వ్రాసిందేమిటంటే- అతడికి 11 సంవత్సరాల వయసులో అతడి తండ్రి ఉమర్ షేక్ మీర్జా చనిపోయాడు. చనిపోయేముందు కొడుక్కి మద్యపానాన్ని అలవాటు చేయాలని ప్రయత్నించి విఫలుడయ్యాడు. కానీ అటుపైన 1519లో కాబూల్‌లో అతడు మొట్టమొదటిసారి మద్యపానం చేశాడు. అప్పటినుంచీ మద్యం అంటే అతనికి అపరిమితమైన ప్రీతి ఏర్పడింది. కానీ 1527 ఫిబ్రవరిలో ఇకపైన మద్యాన్ని సేవించనని ప్రతిన పలికాడు బాబర్. మద్యపానానికి సంబంధించిన బంగారు, వెండి, గాజు గ్లాసులన్నిటినీ పగులగొట్టించాడు. ఆ ముక్కలని పేదప్రజలకు పంపిణీ చేశాడు. మద్యాన్నంతటినీ నూతులలోను, ఇసుక నేలల్లోను పోయించాడు. అతడు, అతడి పరివారం, సైనికులు వగైరాలందరూ మద్యాన్ని ముట్టమని శపథం చేశారు. రెండేళ్ళపాటు అతని మనసు మద్యం వైపు ఎంత పరుగులు తీసినా, బుద్ధితో కళ్లెం వేశాడు. 1530 నాటికే అతనిలో ఆ కోర్కె పూర్తిగా అంతరించింది.

హుమయున్ ఎక్కువగా తాగకపోయినా 45వ ఏటనుంచి మద్యానికి పూర్తిగా దూరమయ్యాడు. మొగలు చక్రవర్తులందరిలోకి మద్యాన్ని ఎక్కువగా సేవించేది జహంగీర్. 16వ ఏటనుంచీ మద్యపానాన్ని ప్రారంభించి రోజుకు 22 ఔన్సు కప్పులదాకా సేవించేవాడు. ఓ అరగంట పాటు నిరవధికంగా తాగకపోతే అతనికాళ్ళూ చేతులూ ఒణికిపోయేవిట।అటుపైన తన పరిస్థితి ప్రమాదకరమవబోతోందని తెలుసుకుని దానిని 22 నుంచి 5 కప్పులకు తగ్గించాడు. చీకటి పడటానికి రెండుగంటల ముందు నుంచి మాత్రమే మద్యపానాన్ని ప్రారంభించాలని ఓ రూలును ప్రవేశపెట్టాడు. అతని భార్య నూర్జహాన్ కూడా వైన్‌ని ఇష్టపడేది. ఆ కాలంనాటి బంగారు, వెండి, స్ఫటిక మద్యం గ్లాసులు ఇప్పటికీ మ్యూజియంలలో భద్రపరచబడి వున్నాయి. ఇంక రాజపుట్ యువరాజులు తాగే మద్యంలో గులాబీ, కుంకుమపువ్వు మొదలైన సుగంధద్రవ్యాలుండేవి. వాళ్ళ మద్యంలో ప్రఖ్యాతి వహించిన మద్యం పేరు అషా. రాజస్థాన్‌లోని వివిధ ప్రాంతాల్లో మద్యం వివిధ రకాల పరిమళాలలో లభించేది. జైసల్మేరులో ఇంపీరియల్ గ్రౌస్ అనే పూమొగ్గల రసం పిండి సారాలో కలిపేవారు. మిగతా చోట్ల వేరొకరకం పూమొగ్గల రసాన్ని కలిపేవారు. ఇవన్నీ రకరకాల పరిమళాలతో తాగుతున్న వారికి హాయిని గొల్పుతూ వుండేవి. అయితే ఈ తయారీ పద్ధతులను వారు రహస్యంగా వుంచడంతో మిగతా చోట్లకు ఈ పద్ధతి విస్తరించలేకపోయింది. పేద ప్రజలు మాత్రం మామూలు చౌకబారు మద్యాన్నే సేవించేవారు.

ఇప్పుడు చాలా రకాల మద్యాలు మార్కెట్‌లోకి వచ్చాయి. సాంఘిక, సాంస్కృతిక కార్యక్రమాల్లోనేకాక మనిషి దైనందిన జీవితంలో కూడా మద్యం ఓ ముఖ్యభాగమయిపోయింది.

# నిలవసరుకు

ఆహారపదార్థాలను ఫ్రిజ్‌లో నిలవచేసుకునేందుకు పాలిథిన్ లేదా అల్యూమినియమ్ ఫాయిల్స్ లేదా వ్యాక్స్ పేపర్లను ఉపయోగిస్తూ వుంటాం. ఇందులో కొన్నిటిలో ఎక్కువ కాలం పదార్థాలను నిలవవుంచలేము. కొన్నిటిలో చాలాకాలం నిలవపెట్టవచ్చు. మరి కొన్నిటిలో తేమ లేకుండా పూర్తిగా ఆరిన పదార్థాలను మాత్రమే నిలవవుంచగలం.

మామూలు పాలథిన్ కవర్లు కొంచెం చవకగా దొరుకుతాయిగానీ, అల్యూమినియం ఫాయిల్స్ ఖరీదు కొంచెం ఎక్కువగానే వుంటాయి. ఏ వస్తువునయినా నిలవ చేయాల్సి వచ్చినపుడు అది వండిన పద్ధతి నిబట్టి, ఆ పదార్థాన్నిబట్టి దానిని వుంచే పాత్రని లేదా కవర్‌ని ఎన్నుకోవాలి. ప్లాస్టిక్ సంచులలో వేడి పదార్థాలను పెట్టకూడదు. చికెన్, మటన్, ఫిష్, ఐస్‌క్రీమ్, బట్టర్ మొదలయినవాటిని ప్లాస్టిక్ సంచులలో వుంచి ఫ్రిజ్‌లో నిలవపెట్టవచ్చు.

కానీ... అలా సంచులలో పెట్టేముందు సదరు మాంసాన్ని వేడినీళ్ళతో బాగా కడిగి ఆరాక దానిని ఫ్రిజ్‌లో పెట్టాలి. లేకపోతే తొందరగా బాక్టీరియా చేరే ప్రమాదముంది.

చేపలయితే మరింత తొందరగా పాడయ్యే ప్రమాదముంది. అందుకని చేపల్లో లోపలి భాగాల్ని శ్వాసకోశంతోసహా తీసివేసి అప్పుడు నిలవచేస్తే పాడవకుండా వుంటుంది. అయినా వాటిని కూడా శుభ్రంగా కడిగి ఆరపెట్టాలి. డీప్ ఫ్రిజ్‌లో పెట్టినప్పటికీ కూడా చేపని 24 గంటలకన్న ఎక్కువ నిలవచేయరాదు. అలా చేస్తే చేప నుంచి ఒక రకమైన ద్రవపదార్థం ఉత్పత్తి అయి అందులో వుండే మినరల్స్, ప్రొటీన్లు ఆ ద్రవం ద్వారా బయటకు పోతాయి. ఐస్‌క్రీమ్ పెట్టేటప్పుడు దానిపై ఓ ప్లాస్టిక్ పేపరును పెట్టినట్టయితే ఐస్‌క్రీమ్ గడ్డకట్టకుండా వుంటుంది.

అలాగే ఛీజ్‌ని కూడా బేక్ చేసి, కల్చర్ చేసి ప్లాస్టిక్ పేపర్‌లో పెట్టాలి. అలాంటి జాగ్రత్త తీసుకోకపోతే అది ఎండిపోయి రుచిని కోల్పోతుంది. ఎటువైపునుంచీ గాలి చొరబడకుండా ప్లాస్టిక్ పేపర్‌ను అతి భద్రంగా దాని చుట్టూ చుట్టాలి.

కొన్ని పదార్థాలు గాలి, తేమ, చల్లదనాలకి దూరంగా వుంచబడేవి అయితే, మరికొన్ని ఇవన్నీ తగిలేలావుంచాలి. అప్పడాలు, చిప్స్ మొదలయినవి గాలి చొరబడని ప్లాస్టిక్ బాక్స్‌లలో వుంచాలి. కూరగాయలను ఓపెన్‌గా వుంచాలి.

పళ్లు, కూరగాయలు బాక్టీరియాకి ఎక్కువ తావిస్తాయి. పండు కొద్దిగా తెగినా, చితికినా మన కంటికి కనిపించని కోట్లాది బాక్టీరియాలు దానిచుట్టూ చేరుతాయి. ఇవి మన ఆరోగ్యానికి అత్యంత హానికరాలు. నిజానికి చాలా పళ్ళకి పైన రక్షణ కవచం వుంటుంది. ఆ విధమైన కవచం కూరగాయల్లో తక్కువ కావడంతో ఇవి ఎక్కువగా బాక్టీరియా ప్రభావానికి లోనవుతాయి.

మామిడి, రేగు, ద్రాక్ష మొదలయినవన్నీ ఫ్రిజ్‌లో వుంచుకోవచ్చును. పళ్ళన్నిటినీ పల్చటి పొటాషియమ్ పర్మాంగనేట్ ద్రవంతో శుభ్రపరచి ఫ్రిజ్‌లో వుంచాలి. ఇది ఫంగస్‌ని, ఇతర బాక్టీరియా క్రిములని రాకుండా అరికడతాయి. కానీ అరటి, సపోటా, అనాస మొదలైన పళ్ళని మాత్రం బయటిగాలి తగిలేలా వుంచాలి. కాలీఫ్లవర్, క్యాబేజీ, బఠాణీ లాంటి కూరగాయలు,

ప్లాస్టిక్ సంచుల్లో వుంచి ఫ్రిజ్‌లో పెట్టవచ్చును. టొమాటోలు బాగా కడిగి ఆరపెట్టి ఫ్రిజ్‌లో పెట్టవచ్చు. పు దీనా కొత్తిమీరలు మాత్రం కొన్న వెంటనే వాడేసుకోవాలి. అవి నిలువ ఉంచితే వాటి సువాసనని కోల్పోతాయి. అలాగే పాలకూర, మెంతికూర కూడా వెంటనే వాడుకోవాలి.

యాలి. అసలు అల్యూమినియం ఫాయల్స్ అయితే బాగా నిలవవుంటాయి.

బ్రెడ్‌లో 38 శాతం తేమ వుంటుంది. అది పోతే బ్రెడ్ ఎండిపోతుంది.

పాలకోవా, జిలేబీలాంటి స్వీట్లని బట్టర్ పేపర్లలో చుట్టి నిలవవుంచాలి. ఇవి సరిగా




బంగాళదుంపలు, ఉల్లిపాయలు, ఫ్రిజ్‌లో నిలవచేయవలసిన అవసరం లేదు. కానీ కొద్దిగా చీకటిగా వున్న ప్రదేశాల్లో వాటిని వుంచితే నిలవవుంటాయి. వెలుగు తగిలితే తొందరగా ఆకుపచ్చ రంగుకి వస్తుంది.

బ్రెడ్, కేక్‌లు, బిస్కట్లు మొదలయినవి వాక్స్ లేదా బట్టర్ పేపర్‌లలో నిలవచే



కప్పకపోతే అతితొందరగా పాడవుతాయి. అందులో వుండే కొవ్వు, తేమ, నీటిపదార్థాలు ఇవి తొందరగా పాడయ్యేందుకు దోహదం చేస్తాయి.

ఇవన్నీ ఇప్పటి సౌకర్యాలేకాక అవసరాలుగా మారి ఇన్ని జాగ్రత్తలు తీసుకోవాలసి వస్తోందిగానీ నిజానికి ఏ పదార్థాన్నయినా ఎప్పటికప్పుడు కొనుక్కుని వండుకుని తింటే పరిపూర్ణ ఆరోగ్యానికి మాత్రం లోటుండదు. నిలువ ఎప్పుడూ ప్రమాదమే మరి. ★

# చతుర కథలు

## బరువు

ప్రముఖ దర్శకుడు వితండరావు తన కొత్త చిత్రం ముహూర్తపు షాట్‌ని శ్మశానంలో చిత్రీకరించేడు. గతంలో పెద్ద స్టార్స్‌తోసిని మాలు తీసి గొడవలు పడ్డాడు. మాస్టారుగా వాళ్ళు తనకి సరైన గుర్తింపు, గౌరవం ఇవ్వడం లేదని, ఈసారి అన్నీ కొత్త ముఖాల్నే పెట్టాడు.



హీరో హీరోయిన్లిద్దరూ బొద్దుగా, లడ్డుల్లా వున్నారని అంతా చాటుగా విమర్శించేరు. ముఖంలో అందం, ఆకర్షణా ఉంటే చాలా? ఇంత భారీ పర్సనాలిటీల్ని ప్రేక్షకులెలా భరిస్తారో... అని ఆక్షేపించారు.

విమర్శల్ని లెక్కచెయ్యకుండా, విక్టరీని ధ్యేయంగా పెట్టుకొని, ధైర్యంగా ముందుకి సాగేడు వితండరావు. రెణ్ణెల్లలో పిక్చర్ రిలీజ్ చేసి రికార్డు బ్రేక్ చేశాడు.

ఫస్ట్ మార్నింగ్‌షోకే సినిమా సూపర్ హిట్ అనే టాక్ వచ్చేసింది. జూబ్లీ జరుపుకోవడం ఖాయం... అని పత్రికలు సమీక్షల్లో పేర్కొన్నాయి. ప్రారంభంలో ఏ హీరో, హీరోయిన్లకైతే వంకలు పెట్టి, లోపాలు వెదికారో ఇప్పుడు ఆ జంటే కలక్షన్ల పంట పండిస్తోంటే వాళ్ళ ఫొటోల్ని విరివిగా ప్రచురిస్తూ పత్రికలు, అభిమానుల్లో ఏర్పడ్డ క్రేజ్‌ని క్యాష్ చేసుకోసాగాయి. ముఖ్యంగా హీరోగా పరిచయమైన

చతుర ... 7

అప్పారావుకి గొప్ప పేరొచ్చింది. అతనికి ఉజ్వలభవిత ఉందని, త్వరలో నెంబర్‌వన్ స్థానానికి చేరుకుంటాడని కీర్తించేయి పత్రికలు.

మనిషి కొంచెం బొజ్జ కలిగి, బొద్దుగా ఉంటేనేం- పాటల్లో, ఫైట్సులో అతను చూపిన చురుకుదనం వారెవా... అన్నిం చేలా వుందని పేరొచ్చింది. అప్పారావుతో ఇంటర్వ్యూకి గిరాకి పెరిగింది. టి.వి.వాళ్లు కూడా ఉగాది పండుగ సందర్భంగా అతనితో పరిచయ కార్యక్రమాన్ని ప్రసారంచేసి తరించేరు.

ఇంతవరకూ అతన్ని ఎనభైమంది ఇంటర్వ్యూ చేశారు. అదేం చిత్రమో, అంత మంది కూడా ఒక ప్రశ్నని ప్రత్యేకించి అడిగేరు.

"అప్పారావుగారూ! ఈ సినిమాతో మీకు అవార్డు రావొచ్చు అయితే ఒక విషయం చెప్తారా?" విలేఖరి ప్రశ్న.

"అడగండి"

"సినిమా చివరి సీన్ ఉంది చూశారూ! మీ ముఖంలో హావభావాలు చాలా నేచురల్‌గా కన్పించేయి.

అది రాత్రి సమయం. హోరున గాలి, కుంభవృష్టి. తుఫాను వాతావరణంతో ప్రకృతి అల్లకల్లోలంగా చెల్లాచెదురుగా వుంది. అప్పుడు ప్రాణాపాయస్థితిలో వున్న మీ ప్రేయసిని రెండు చేతుల్లో, పసిపాపలా ఎత్తుకొని డాక్టరు దగ్గరకు పరుగెత్తే సీన్ సినిమాకి ఆయువుపట్టని అందరూ చెప్పుకుంటున్నారు. చాలా సీనియర్ నటుడిలా మీ ముఖంలో ఆతృత, ఆందోళన... వ్యథ, వేదన... బరువు బాధ... ఇలా రకరకాల ఫీలింగ్స్‌ని ఎలా చూపించగలిగారు? "

ఆ ప్రశ్నకి అప్పారావు లోలోపలే సమాధానం చెప్పుకున్నాడు.

"ఆ సీన్‌లో నేనసలు నటించేడిస్తేనా? సహజత్వం అంటూ... ఆ వితండంగాడు నా దుంపతెంచాడు. నా శరీరమే నాకు బరువైతే నాకంటే డబుల్ బాడీతో వున్న గున్న ఏనుగులాంటి మా హీరోయిన్ని నా చేత బోల్డంత దూరం మోయించేడు. షాట్ ఓ.కే. కావాలన్న ఏంగ్జైటీ కాకపోతే ఈ గుదిబండని శ్రీనాథ కవిలా ఇంకెన్నిసార్లు మోయాలోనన్న ఆందోళన... ఇవి నా మొహంలో వాస్తవంగా ప్రతిఫలించడంతో మీరంతా మెచ్చుకుంటున్నారు.

నేను మోస్తున్న మా హీరోయిన్ బరువే నా మొహంలో తొణికిసలాడిన విషాదపు బరువుకుగానీ, దోబూచులాడిన వేదనకిగానీ రోదనకిగానీ, చుక్కలు, చుక్కలుగా రాలిపడ్డ కన్నీళ్లకి గానీ అసలు కారణం"

**- అవధానుల సుధాకరరావు**

## పేదదేశం

**న్యూ**యార్క్‌లోని వెస్టన్ స్టాన్‌ఫర్డ్ వివిధ దేశాధినేతలు న్యూయార్క్ సందర్శించినప్పుడు బసచేసే పెద్ద హోటల్! యు.ఎన్.ఓ. మీటింగ్‌కి వచ్చిన జపాన్, జర్మనీ, ఇండియా, సౌతాఫ్రికా దేశాధినేతలు ప్రస్తుతం బసచేస్తున్నారు అందులో.

ఆ రాత్రి డిన్నర్ రూంలో ఆ నలుగురు దేశాధినేతలూ ఒకే టేబిల్ దగ్గర భోజనాలు చేస్తూ కబుర్లు చెప్పుకుంటున్నారు. ఎవరి దేశం గొప్ప గురించి వాళ్లు గొప్పలు చెప్పుకోసాగారు.

మొదటగా సౌతాఫ్రికన్ దేశాధినేత చెప్పాడు ఓ బంగారు బిస్కెట్‌ని చూపించి. "ప్రపంచంలో బంగారం అత్యధికంగా లభ్యమయ్యే దేశం సౌతాఫ్రికా కాబట్టి మాది ప్రపంచంలోని అత్యధిక ధనిక దేశంగా భావించవచ్చు''

వెంటనే జర్మని దేశాధినేత అందుకు అభ్యంతరం చెప్తూ ఇలా అన్నాడు.

"నో... నో. అలా ఆలోచిస్తే జర్మనీ.



అత్యధిక ధనికదేశం అవుతుంది. ఈ రోజుల్లో బంగారంకన్నా టెక్నాలజీకి విలువెక్కువ. మీ బంగారపు బిస్కెట్లని మా టెక్నాలజీని ఉపయోగించి ఎంత సన్నటి తీగగా తయారుచేస్తామో చూడండి'' అంటూ ఆయన జేబులోంచి తీసి చూపించిన బంగారుతీగ చూడగానే కంటికి కనపడనంత సన్నగా ఉంది.

జపాన్ అధినేత చిన్నగా దగ్గి చెప్పాడు.

"ఆమాటకొస్తే మీ రెండు దేశాలకన్నా మా జపాన్‌ని అతిగొప్ప దేశంగా మేం భావిస్తున్నాం"

"దేనికి?" ఆ రెండు దేశాధినేతలు ఒక్కసారిగా అడిగారు.

"ఆ బంగారాన్ని సన్నటి తీగగా మలిచిన ప్రెసిషన్ యంత్రాలు మా జపానే తయారుచేసి జర్మనీకి ఎగుమతి చేసిందిగదా'' అంటూ ఆయన తన భూతద్దంతీసి ఆ బంగారు తీగమీద ఏం చెక్కివుందో మిగిలిన ముగ్గురికి చూపించాడు. 'మేడిన్ జపాన్' అని ఈ తీగమీద కనపడింది. అందరూ అవాక్కయిపోయారు.

అప్పుడు ముగ్గురూ ఇండియన్ దేశాధినేత వంక చూశారు. ఆయన అలవాటుప్రకారం పెదవి విప్పలేదు. "మీరేం మాట్లాడరే? మీ ఇండియా పేదదేశం అని ఒప్పుకుంటున్నట్లేగా?" ముగ్గురూ ఏకకంఠంతో అడిగారు.

"ఆహా... మాది ఎందుకు పేదదేశమో, మీవి ఎందుకు ఐశ్వర్యవంతమైన దేశాలో, నాకు ఆ కిటుకు తెలుసు కాని చెప్పను'' చెప్పాడాయన గుంభనంగా నవ్వి. ఎవరూ మాట్లాడలేదు.

వారం తర్వాత ఆ ముగ్గురు దేశాధినేతలూ పేపర్లో చదివారు. 'భారతదేశ రక్షణ మంత్రిత్వశాఖ బంగారు తీగలని దిగుమతి చేసుకునే కాంట్రాక్ట్‌లో ఆయనకి పది కోట్ల డాలర్లు ముడుపులు ముట్టాయనీ, వాటిని ఆయన స్విస్‌బ్యాంక్‌లో దాచుకున్నాడనే విషయం ఆధారాల్తో బయటపడినా ఆయన రాజీనామా చేయటంలేదనీ.

-డి. పద్మజ

సమసమాజం కోసం కొందరు పాదయాత్రలు చేస్తే, భాషా బేధాలు అంతరించాలని మరి కొందరు సైకిల్ యాత్రలు చేస్తారు.

మరి... కుటుంబాలలో అన్నదమ్ముల మధ్యా అక్క చెల్లెళ్లమధ్యనే రాకపోకలు కరువై, అనురాగాలు అరుదై... చెట్టుకొకరు, పుట్టకొకరులా ఒంటరిగా బతుకుతూ, ప్రేమరాహిత్యంలో మగ్గుతున్న సమయంలో... అలాంటి కుటుంబానికి చెందిన ఓ యువకుడు... మమతలను పెంచే, మమకారాల్ని పెంపొందించే లక్ష్యంతో స్వకుటుంబీకుల వద్దకే సద్భావనా యాత్రను ప్రారంభించాడు.

మొట్టమొదటగా పెద్ద మేనమామ ఇంట్లో అడుగుపెట్టిన అతను అటుపైన ఒక్కొక్క దగ్గరి బంధువు ఇంట్లో ఎదుర్కొన్న అనుభవాలేమిటి? సత్సంబంధాలను పెంచే అతని సద్భావనా యాత్ర సఫలీకృతమయిందా?

జీవితంలోని యాంత్రికతనీ, దానికారణాలని సవివరంగా విశ్లేషిస్తూ...

పులిగడ్డ శ్రీరామచంద్రమూర్తి రాసిన

# మల్లె పందిరి

ఈ నెల 'చతుర' సమగ్ర నవల.



కార్తీకమాసపు తొలిరోజులు!

అప్పుడప్పుడే బూడిదరంగు మేఘాలను తొలగించుకుంటూ ఉదయభానుని లేత బంగారుకిరణాలు ప్రత్యక్షమవుతుంటే, చిరు చిరు చలి చల్లగా జారుకుంటోంది.

వాతావరణం ప్రశాంతంగా, నిశ్శబ్దంగా, స్వచ్ఛంగా, నిష్కల్మషంగా ఉన్నదేమో, వీధి చివర్న ఉన్న శివాలయంనుండి గంటల గణగణలు, భక్తుల ఓంకారనాదాలు విన్పిస్తు న్నాయి.

అలాంటి ఉషోదయవేళలో...

సత్యనారాయణపురంలో నెమ్మదిగా సందడి మొదలవసాగింది. ఆ వీధి బద్ధ కంగా ఒకసారి ఆవులించి, నిద్రకళ్లతో వీధి తలుపులు తెరవసాగింది.

సూర్యకిరణాలు బంగారు ఛాయనుండి వెండివర్ణంలోకి మార్పు చెందుతున్నాయి. సత్యనారాయణపురం రైల్వేస్టేషన్‌లో రైలు ఆగిన పావుగంటలో అటూ ఇటూ పాలబిం దెలు కట్టుకుని కొన్ని సైకిళ్లు, పాలపేకెట్లతో నిండిన ట్రేలను ఒకదానిమీద ఒకటి పేర్చి బాలన్స్ చేసుకుంటూ మరికొన్ని సైకిళ్లతో హడావిడి మొదలయింది.

విశాలంగా, నల్లగా ఉన్న తారురోడ్డు మీద చకచకా నడిచి వచ్చిన ఆ యువకుడు ఓ క్షణంసేపు తూర్పువైపుకి ఫేస్‌చేసి ఉన్న ఆ ఇంటికి అభిముఖంగా నిలబడ్డాడు.

భుజానికి వేలాడుతున్న ఎయిర్‌బేగ్ మరో భుజంమీదకి మార్చుకుని, జేబులో నుండి అడ్రెస్ కాగితం తీసుకుని, ఆ ఇంటి వీధి తలుపుమీది నెంబరుతో సరిపోల్చుకుని తనకు కావాల్సిన ఇల్లు అదేనన్న నిర్ధారణకి వచ్చాడు.

మెడ చుట్టూ ఉన్న సిమెంట్ కలర్ మఫ్ల ర్‌ని అటూ ఇటూ సర్దుకుని, గుండెల నిండుగా గాలిపీల్చి వదిలి ముందుకి అడు గేశాడు.

ఆ ఇల్లు బాగా పురాతనమయిన పెంకు టిల్లు.

బయటి కాంపౌండుకి, ఇటుకరాయి రంగు చెక్కతలుపులు ఉన్నాయి. ఆ గేటు మీదనే దాదాపుగా అల్లుకుని వాలిపోయిన ట్లుగా ఉన్న సన్నజాజి తీగలమీద అక్కడ క్కడా తోకచుక్కల్లా విచ్చుకున్న సన్నజాజి పూలు కమ్మటి పరిమళాన్ని వెదజల్లుతు న్నాయి.

కాలింగ్‌బెల్ కోసం చూసి ఎక్కడా కనబ డకపోవడంతో తలుపు తట్టబోయాడు. కాని స్వాగతం చెబుతున్నట్లుగా కిర్రుమని శబ్దం చేస్తూ అదే తెరుచుకుంది.

లోపలికి అడుగుపెట్టిన ఆ యువకుడు క్షణాల్లో- ఆ ఇంటి పరిసరాలను పరిశీలించే శాడు.

రోడ్డుమీదకయితే తెలియడంలేదుకాని, లోపల విశాలమయిన ఆవరణ ఉంది. వీధి వాకిలినుండి ఇంటి అరుగువరకు దాదాపు యాభయిగజాలవరకూ ఉంటుంది.

ఎడమచేతివైపు గుత్తులు గుత్తులుగా విర గబూసి మంచుతో తడిసి కమ్మటి పరిమ ళాన్ని వెదజల్లుతున్న వెన్నముద్దలు- రకర కాల మందారాలు, గులాబీలు- చెట్లనిండా విరగబూసి కనులవిందు చేస్తున్నాయి.

కుడిచేతివైపు విశాలంగా ఉన్న ఆవరణలో పెద్ద పొగడచెట్టు. ఆ చెట్టుకింద సిమెంటుతో కట్టిన గట్లు ఉన్నాయి. పొగడ పూలు గట్టునిండా నక్షత్రాల్లా రాలి, మత్త యిన సుగంధాన్ని నలుదిశలా వెదజల్లుతు న్నాయి. తలుపు శబ్దానికి కాబోలు, లోపల నుండి ఒకావిడ తొంగిచూసి ఆ యువకుడు అరుగు దగ్గరకు వచ్చేసరికే, తనే గబగబా బయటకు వచ్చింది.

ఆమె వయసు యాభయిపైనే ఉంటాయి. జుట్టు అంతా దాదాపుగా నెరిసి పోయి అక్కడక్కడా నల్లవెంట్రుకలు కన్పి స్తున్నాయి. చామనఛాయలో ఉన్నా,

నుదుట నిండుగా బొట్టుతో, చక్కటి కళతో, ఆరోగ్యంగా చూపులకు ఎంతో పవిత్రంగా కనిపిస్తున్నది.

ఎదురుగా-

భుజానికి ఎయిర్‌బేగ్‌తో, మెడ చుట్టూ ఉండి భుజంమీదకి వేలాడుతున్న మఫ్లర్‌తో, నీలంరంగు ఫాంటులోకి టక్‌చేసిన తెల్లటి ఫుల్‌హేండ్స్ షర్ట్‌తో, సన్నగా పొడవుగా ఉండి, చిరునవ్వుతో నిలుచున్న ఆ పాతికేళ్ల యువకుడు ఎవరో చప్పున పోల్చుకోలేకపోయింది.

ఆ కళ్లు, ఆ ముక్కు, ఆ నుదురు.

ఏవో జ్ఞాపకాల దొంతరలను విప్పదీస్తుంటే సందేహంగా అడిగింది.

"ఎవరు కావాలి బాబూ? "

"వేదమూర్తిగారు..." అతనూ సందేహంగా ఆగాడు.

ఆమె బయట వరండాలో వేసివున్న కుర్చీని చూపిస్తూ అన్నది, "కూర్చో బాబూ! ఆయన పూజలో ఉన్నారు. కాసేపట్లో వస్తారు. కార్తీకమాసంకదూ! ఇంత క్రితమే కృష్ణకెళ్లి స్నానంచేసి వచ్చారు" అని లోపలికి నడిచింది.

అతని గొంతుకేదో అడ్డు పడ్డట్లయింది.

అతనికీ- లీలగా ఒకప్పటి ఆమె ముఖం గుర్తుకు వస్తోంది. ఇప్పుడంటే జుట్టు అంతా నెరసి వార్ధక్యంమీద పడిందిగానీ ముక్కుకి ఉన్న మూడురాళ్ల ముక్కెర ఇప్పటికీ అదే!

బలంగా నిట్టూర్చాడు అతను.

పరాయివాడిలా తనను తానే పరిచయం చేసుకోవాల్సి రావడం ఎంత దురదృష్టం? ముందరి పెంకుటి వసారా కొంచెం కిందకి దిగి ఉండటంతో, జాగ్రత్తగా తలవంచి లోపలికి అడుగుపెట్టి, కుర్చీలో కూర్చున్నాడతను.

సాలోచనగా అటూ ఇటూ చూస్తున్న అతని దృష్టి ఎదురుగా ఉన్న గదిమీద పడింది.

ఆ గది గుమ్మం పక్కగా నిల్చున్న ఓ పాప తొంగిచూస్తోంది! ఇంత పొద్దున్నే ఈ అపరిచిత వ్యక్తి ఎవరు? అన్న భావం చక్రాల్లాంటి ఆ అమ్మాయి కళ్లల్లో స్పష్టంగా కనిపిస్తోంది.

అతని ముందునుండే గబగబా పరుగులాంటి నడకతో వెనక్కి వెనక్కి చూసుకుంటూ హాల్లోకి పరిగెత్తింది.

ఓ అయిదు నిమిషాలు గడిచాయి.

అతను ఇబ్బందిగా, ఊహకందని భావాలతో, ఆ కుర్చీలో అటూ ఇటూ సర్దుకుంటూ, అనీజీగా గడుపుతున్నాడు.

గుండె లోతులనుండి ఏవో భావాల పరంపర, ఉద్విగ్నత- అలలకువలె తన్నుకువస్తుంటే గొంతు జీరగా అన్పిస్తోంది.

ఆమెకే ఎందుకు చెప్పలేకపోయాడు? తను ఫలానా అని?

హఠాత్తుగా అప్పుడు గొంతు ఎందుకు అలా మూగపోయింది?

ఏదో మంత్రించిన బొమ్మలా ఎలా ఉండిపోయాడు తను?

మాటలు రానివాడిలా మౌనంగా మునిలా, శిలలా శిల్పంగా ఎలా ఉండిపోయాడు?

ఆమెను చూడగానే ఒక్కసారిగా ముప్పిరిగొన్న ఆ భావాన్ని ఆశ్చర్యం అనాలా? ఆనందం అనాలా? ఏదయినా తనని మూగవాడిని చేసింది.

ఆమె కళ్లల్లో కూడా లీలగా ఆశ్చర్యం తొంగిచూసినా గుర్తుపట్టినట్లు లేదు.

ఎప్పటి మాట?

ఒకటి కాదు- రెండు కాదు- మూడు కాదు.

పది-

పది సంవత్సరాలు!

ఈ కాలుష్య ప్రపంచం మనుషుల్లో మార్పుని చాలా త్వరగా తీసుకువస్తోంది. ఆమెను గుర్తించడానికి తనే క్షణంసేపు తడబడితే- మరి పెద్దవయసులో ఉన్న ఆమె పరిస్థితి ఏమిటి?

ఆలోచనల మధ్యన కొట్టుమిట్టాడుతున్న అతను లోపలినుండి గంట విన్పించడంతో తృళ్లిపడ్డట్లయ్యాడు.

పూజ అయిపోయినట్లుంది.

ఒక్కసారిగా వీచిన చల్లటి మంచుగాలికి అతని శరీరం క్షణంసేపు పులకించినట్లుగా స్వల్పంగా వణికింది.

కొద్దిక్షణాల అనంతరం.

పురాతనమయినా, బలంగా ఉండి అందమయిన లతలూ, డిజైన్లతో నిండివున్న నల్లటి టేకు సింహద్వారం దగ్గరకి వచ్చారు వేదమూర్తిగారు.

అసంకల్పితంగా లేచి నిల్చున్నాడు తను. ఎదురుగా పచ్చటి శరీరచ్ఛాయతో, ఎర్రటి పట్టుబట్టతో, భుజంమీద అదేరంగు పట్టు ఉత్తరీయంతో, నుదుట విబూదిరేకలతో వాటి మధ్యన జ్వలిస్తున్న అగ్నిహోత్రంలా ఎర్రటి కుంకుమ, దానిమీద గంధం బొట్టుతో.

కాంతులీనుతూ- కరుణ వర్షించే కళ్లతో-

మూర్తీభవించిన మార్తాండ తేజునిలా-

ప్రత్యక్షమయిన పరమేశ్వరునిలా-

నిండుగా నిలబడి ఉన్నారు వేదమూర్తి!

ఎంతోమందికి అక్షరజ్ఞానాన్ని, సరస్వతీ కటాక్షాన్ని ప్రసాదించిన విజ్ఞానమూర్తి ఆయన!

వేదమూర్తిగారి వయసు అరవయి సంవత్సరాలు! స్కూలు హెడ్‌మాస్టరుగా చేసి రిటైర్ అయినారు.

తళతళలాడే ఆయన కళ్లు విజ్ఞాన రేఖలను వెదజల్లుతున్నాయి.

జుట్టు పూర్తిగా నెరిసి, పొట్టిగా ఉన్న క్రాపుతో, ఒక విధమయిన గంభీర వదనంతో నిలబడి ఉన్న ఆయన ముందు- ఎంతటి వారికయినా గౌరవాభివందనం చేయాలనిపిస్తుంది.

ఒక విధమయిన 'డిసిప్లిన్'తో కూడిన వాతావరణం- ఆయన సమక్షంలో ఎప్పుడూ నిండివుంటుంది.

అంతటి విజ్ఞానమూర్తి-

ఎదురుగా చిరునవ్వుతో నిల్చుని ఉన్న ఆ యువకుడిని చూసి క్షణంసేపు అయోమయంలో పడ్డారు.

కనుబొమలు ముడుచుకున్నాయి. నుదురు విశాలమయింది. కళ్లు ఆశ్చర్యంతో విప్పారితే- మనసు పులకితమవుతుంటే ఔనా? కాదా? అనే సందిగ్ధావస్థలో పడ్డారు.

"మామయ్యా! నేను..."

మనసులోని మమకారం కళ్లని తడిచేస్తుంటే గుండెల్లోని అభిమానం తళతళలాడుతూ కళ్లల్లో ప్రతిఫలిస్తుంటే నిండుగా నవ్వి అన్నారాయన.

"సాయికృష్ణా!"

ఆనందంగా అన్నాడు, "అవును మామయ్యా! సాయికృష్ణని!"

వేదమూర్తిగారు లోపలికి తొంగి చూస్తూ కేకవేశారు "ఇదిగో కాత్యాయనీ! ఎవరొచ్చారో చూడు!"

అంతసేపు లోపలవైపు- గుమ్మంచాటుగా నిలబడ్డ కాత్యాయని బయటకు వచ్చింది.

"నాకూ ఇప్పుడే అర్థం అయింది. ఇంతక్రితమే వాకిట్లో చూసినప్పుడే అనుకున్నాను. ఈ ముఖం ఎక్కడో చూసినట్లు ఉన్నదే అని. కాని బుర్రకి చప్పున తట్టలేదు.

అయినా పెద్దదాన్ని. చూపు ఆనడంలేదు. సాయీ నువ్వయినా చెప్పొచ్చుకదా. అత్తయ్యా నేను సాయికృష్ణని అని! నిజంగా దురదృష్టం కాకపోతే ఈ ఇంటివాడివి పరాయివాడిలా వాకిట్లో కూర్చుని పరిచయాలు చేసుకోవాల్సి రావడం ఏమిటీ?"

అప్పటికే, వేదమూర్తిగారు సాయికృష్ణ చేతిని ఆప్యాయంగా తన చేతిలోకి అందుకుని లోపలికి తీసుకెళ్లారు.

సాయికృష్ణ లోపలికి అడుగు పెట్టగానే, ఆత్రంతో కూడిన ఆనందంతో అడిగారు వేదమూర్తిగారు. "మీ అమ్మ సత్యవతి ఎలా ఉందిరా! మీ నాన్నగారు ఎలా ఉన్నారు"

సాయి కొంచెం పొడిగా చెప్పాడు. "బాగానే ఉన్నారు"

కళ్లల్లో నీళ్లు చిమ్ముతుంటే అన్నారాయన. "అబ్బ! ఎన్నాళ్ళయిందిరా! దాదాపు పది సంవత్సరాలు పైనే"

సాయికృష్ణ మాట్లాడకుండా మందహాసం చేసి ఊర్కున్నాడు.

లోపలనుండి కాత్యాయని వచ్చి "సాయీ! ప్రయాణపు బడలికతో ఉండిఉంటావ్. బాత్‌రూమ్‌లో వేడినీళ్లు పెట్టాను. ముందు స్నానం చేసిరా! తర్వాత, తీరికగా విశేషాలన్నీ చెప్పుకుందాం" అంటూ బీరువాలో నుండి ఇస్త్రీ చేసి మడతలు పెట్టిన తెల్లటి తువ్వాలు తీసి ఇచ్చింది.

సాయికృష్ణ స్నానానికి వెళుతుంటే, వెనక నుండి వేదమూర్తిగారు అన్నారు.

"ఎంత ఎదిగిపోయాడు? చిన్నప్పుడు నా భుజాలమీద ఎత్తుకుని పెంచాను"

కాత్యాయని కూడా ఆయన ఆనందాన్ని పంచుకుంటూ అన్నది. "నిజమే! చిన్నప్పుడు మీ చెల్లెలికి వంట్లో సుస్తీచేసి పడుకుంటే ఈ సాయికృష్ణకి ఎన్నిసార్లు గోరుముద్దలు తినిపించలేదూ? తలచుకుంటూ ఉంటే నాకే ఆశ్చర్యంగా ఉన్నది"

"కాత్యాయనీ! ఇదంతానిజమేనంటావా? "

"నిజమే మరి! స్వంత అన్నాచెల్లెళ్లు కలిసి పది సంవత్సరాలు! చెబితే తప్పు ఎవరూ నమ్మరు"

భారంగా నిట్టూర్చి, మౌనంగా కుర్చీలో కూర్చుండిపోయారాయన. మాటలు లేనట్లుగా, మాట్లాడలేనట్లుగా కాసేపటివరకూ అలాగే ఉండిపోయారు.

దాదాపు పది నిముషాలు. తర్వాత-

స్నానంచేసి వచ్చిన సాయికృష్ణ, తెల్లటి లాల్చీ పైజామా వేసుకుని వచ్చి కూర్చుంటే కాత్యాయని వేడివేడి ఇడ్లీలు తెచ్చిపెట్టింది.

ఆ వెనకే మంచినీళ్ళ గ్లాసు భద్రంగా పట్టుకుని అడుగులో అడుగు వేసుకుంటూ వస్తున్న ఏడేళ్ల పాపను ప్రశ్నార్థకంగా చూశాడు సాయికృష్ణ! ఆ అమ్మాయే ఇంత క్రితం వాకిట్లో తనని చూసి గదిలోనుండి హాల్లోకి పరిగెత్తింది.

సాయికృష్ణ కళ్లల్లోని భావాన్ని అర్థం చేసుకున్న వేదమూర్తిగారు చెప్పారు.

"ఇది నా మనవరాలు! పేరు ఆకృతి! కూతురి కూతురు! నా కూతురు, అల్లుడూ ఇద్దరూ డాక్టర్లు! విశాఖపట్టణంలో ఉంటున్నారు. వాళ్ల పెద్ద కూతురు అర్పిత! అది మెడ్రాస్‌లో హాస్టల్‌లో ఉండి మెడిసన్ చదువుతోంది. దాని తర్వాతిది ఇది రెండోది. మా దగ్గరే ఉండి చదువుకుంటోంది"

సాయికృష్ణ ఇడ్లీతిని, కాత్యాయని ఇచ్చిన కాఫీ త్రాగుతూ మౌనంగా ఉండిపోయాడు. కాసేపటికి తేరుకుని కుర్చీలోనుండి లేచి, ఎయిర్‌బాగ్‌లోనుండి పొడవాటి ఓ కవర్ తీసి వేదమూర్తిగారికి ఇస్తూ అన్నాడు.

"మామయ్యా! అమ్మ నీకు ఇమ్మంది"

వేదమూర్తిగారు క్షణంసేపు మేనల్లుడి వైపు, ఆ కవరువైపు సాలోచనగా చూసి

అడిగారు, "ఇందాకటినుండీ అడుగుదామను కుంటున్నాను. నువ్వు ఒక్కడివే వచ్చావేం? అసలు సత్యవతి, బావగారు ఏరి? "

"ఉత్తరం చదవండి మామయ్యా!" సమాధానం అదేనన్నట్లుగా చెప్పాడు సాయికృష్ణ! వేదమూర్తిగారు అనుమానంగా కనుబొమలు ముడిచి, సాయికృష్ణ కళ్లల్లో ఏదో వెతకబోయారు కాని- అతని కళ్లు నిర్మలంగా, స్వచ్ఛంగా ఉన్నాయి.

ఆయన కుర్చీలోనుండి లేస్తూ "అయితే- నువ్వు కాసేపు రెస్టు తీసుకో సాయి" అని ముందు వరండాకి పక్కగా ఉన్న గదిలోకి వెళ్ళి కిటికీ పక్కగా ఉన్న ఫేముకుర్చీలో కూర్చుని, కిటికీ రెక్క తెరిచి- చేతిలోనున్న కవరు చింపారు.

ఉత్తరం మడతలు విప్పుతుంటే ఎందుకో చేతివేళ్ళు వణికాయి. అది భయమో, ఆనందమో తెలియదు. మాటలకందని భావమది!

ఉత్తరం దాదాపు నాలుగయిదు పేజీలు ఉంది.

ఆయన కళ్లు ఆతృతగా ఉత్తరంలోని అక్షరాల వెంబడి పరిగెత్తాయి.

"అన్నయ్యా!

నేను! సత్యవతిని. నీ సత్యాని! తోడబుట్టిన నీ చెల్లెలిని! ఒకటి కాదు! రెండు కాదు. దాదాపు పది సంవత్సరాలైంది మనం కలిసి! నేను ఏ అమెరికా వెళ్లలేదు. ఆఫ్రికాలోనూ సెటిల్ అవలేదు. సాక్షాత్తూ ఈ ఆంధ్రాలోనే ఉన్నాను. అయినా- పది సంవత్సరాలైంది మనం కలిసి.

చూడు మన మధ్యన కలతలు లేవు. స్పర్థలు లేవు. ఆస్థి తగాదాలు లేవు. పోట్లాటలు లేవు. మాట పట్టింపులు లేవు. నేను ఎవరితోనూ లేచిపోయి రాలేదు. నువ్వు ఇంట్లోనుండి తరిమికొట్టలేదు. చక్కగా పీటలమీద కూర్చుని కన్యధార పోసి పెళ్లిచేసి, అత్తవారింటికి పంపావు. అయినా మనం కలిసి పది సంవత్సరాలు.

నిజంగా పది సంవత్సరాలు!

చెప్పినా నమ్మలేనిది! కలలో కూడా జరగనిది. ఒకే రక్తం పంచుకుని పుట్టాం. ఒకే ఇంట్లో కష్టసుఖాలు పంచుకుంటూ పెరిగాం. కాని ఆశ్చర్యంగా ఇంతకాలం ఇన్ని సంవత్సరాలు ఒకరి కబుర్లు మరొకరికి తెలియకుండా రాకపోకలు లేకుండా ఎలా గడిపాం?

అసలు ఈ ఉత్తరం ఎలా మొదలుపెట్టాలో, ఎక్కడ మొదలుపెట్టాలో, ఏమని మొదలు పెట్టాలో, నాకే తెలియటంలేదు. దాదాపు పది కాగితాలు- చింపిపోగులు పెట్టివుంటాను. నా ఆవేదనని ఏవిధంగా అక్షరరూపంలోకి అనువదించాలో తెలియక అంతులేని సంఘర్షణతో కొట్టుమిట్టాడాను. అయినా పట్టుదలగా నా ఊహకందినంతవరకూ నాకు చేతనయినంతవరకూ వ్రాస్తున్నాను. ఎంతయినా చిన్నదాన్ని కదరా! అర్థం చేసుకుని క్షమిస్తావు కదూ!

అన్నయ్యా! తప్పు ఎక్కడ ఉన్నా- ఎవరిలో ఉన్నా క్షమార్హం కానిదే! పది సంవత్సరాలు! తలుచుకుంటేనే గుండె పగిలిపోతోంది. ఈ పది సంవత్సరాలలో ఎన్ని మార్పులు వచ్చాయి. ఊహకందనివి. ఊహించలేనివి. ఊహించరానివి కూడా!

అన్నయ్యా! ఒక్కసారి ఆ రోజుల్లోకి వెళదాం. నువ్వూ, నేనూ, చిన్న అన్నయ్య భానుమూర్తి మన మధ్యన కేరింతలు, దొంగటాలు, దోబూచులు ప్రతిక్షణం సందడే. ప్రతిరోజూ పండుగే! పండువెన్నెల్లో- ఒకే కంచంలో కలిపి అమ్మ ముగ్గురుని వరుసగా కూర్చోపెట్టి చందమామ కబుర్లు చెబుతూ, పెట్టిన గోంగూర గోరుముద్దలు, పొగడచెట్టు గట్టుమీద నన్ను కూర్చో పెట్టి, కాళ్లకి భాను, చేతులకి నువ్వూ పెట్టిన గోరింట గుర్తులూ, అమ్మ అల్లిన

పొగడపూల జడ, పెరట్లో మామిడి చెట్టుకి కట్టిన ఉయ్యాలలో ఎడతెరిపిలేని ఊపులూ, ఆటలు...

అన్నయ్యా!

తలచుకుంటూ ఉంటే ఏడుపొస్తోంది! గుర్తుకొస్తుంటే గుండె భారం అవుతోంది.

ఆ అనుభూతులన్నీ ఎలా ఆవిరయిపోయాయి?

ఆ అనుభవాలన్నీ ఎక్కడ నిక్షిప్తమయిపోయాయి?

తరాలు అంతరాలు పెంచాయేకాని, మన మధ్యన బంధం మాత్రం విడిపోలేదు! కాని లోపమనేది ఎక్కడ ఉన్నదోకాని, పరిగెత్తేకాలంలో డబ్బు సంపాదన పిచ్చిలోపడి మనకు తెలియకుండానే దూరమయిపోయాము.

కొంతవరకూ అసందర్భమే అయినా చెప్పక తప్పదు! మా అత్తగారికి మా వారు ఒక్కడే కొడుకు! అందువల్లనో ఏమో మొదటినుండీ ఆయనది ఒంటరితనం కోరుకునే మనస్థత్వం! ఎవరితోనూ చప్పున కలవలేరు. దానిని బిడియం అనాలో, మొహమాటం అనాలో తెలియదుకాని ఒకవిధమయిన ఇనిఫీరియారిటీ కాంప్లెక్సుతో గదిలో గంటల తరబడి ఒంటరిగా, ఈ మనిషి ప్రపంచంతో సంబంధం లేకుండా గడపగలరు ఆయన! ఎపుడయినా నువ్వు, కాత్యాయని వదినా లేదా భాను అన్నయ్య, ప్రమీల వదిన వచ్చినా చప్పున కలవలేక, కలుపుగోలుతనంగా ప్రవర్తించలేక చాలా ఇబ్బంది పడేవారు. ఆయన ఇంట్లో ఆయనే పరాయిగా, ఇబ్బందిగా ఫీలయ్యేవారు. అలాగని ఎవరన్నా ఇష్టం లేరనికాదు! మనసులో అభిమానం ఉంది. కాని బయటికి వ్యక్తీకరించడం చేతకాదు! పెదవి విప్పి ఫ్రీగా మాట్లాడలేరు. చనువుగా మసలలేకపోయేవారు. దానినే మీరందరూ నెమ్మదితనం, మొహమాటం, గంభీరతత్వం లాంటి పేర్లతో పిలిచేవారు. గుర్తుందా! పెళ్లయిన రెండేళ్లకే మా అత్తగారు పోవడం, ఆవిడ పోయిన ఆరు సంవత్సరాలకు సాయికృష్ణ పుట్టడం, అపుడే నీ దగ్గర సాయికృష్ణకు అయిదో నెలవచ్చే వరకూ గడిపాను!

అదిగో!

అక్కడ నుండి అనుకుంటా మొదలయింది మన మధ్యన మనకే తెలియని దూరం! అంతరం! మొదట్లో రెండుమూడు నెలలకు మీ ఇంటికి వచ్చే నేను క్రమంగా అది నాలుగయిదు నెలలు, ఏడెనిమిది నెలలు, సంవత్సరంలోకి మారి క్రమంగా ఉత్తరాలలోకి దిగాయి. నీనుండి ఉత్తరం వస్తే దానికి రెండు నెలల తర్వాత నేను జవాబు ఇచ్చేదాన్ని! అదీ క్లుప్తంగా! మధ్యలో నాలుగయిదు నెలలు గేప్! తర్వాత మళ్లీ ఉత్తరం వచ్చేది. నేను మామూలుగానే రెండు నెలల లేట్ రిప్లయి ఇచ్చేదాన్ని! కవర్లు కార్డులలోకి దిగి, కబుర్లు, యోగక్షేమాలు కరువయి పోవడం మొదలెట్టాయి.

విశేషమేమిటంటే ఆ సంగతి మన మనసులు గ్రహించాయి. గుర్తించాయి! కాని నిర్లక్ష్యం చేశాయి.

నువ్వయినా అపుడపుడు ఉత్తరాలు రాస్తుండేవాడివి! భానుమూర్తి అన్నయ్య అయితే అసలే రాయడు. కొంత నా తప్పు ఉందనకో! వాడు రాయలేదు కదా నేనెందుకు అని నేనూ రాయలేదు.

ఏది ఏమయినా దీనిని ఏమనాలో నాకు తెలియడంలేదు. ఈ గేప్‌కి ఏం పేరు పెట్టాలో తెలియడంలేదు. అసలు ఈ అంతరం ఎందుకు వచ్చింది?

నిర్లక్ష్యం?

బద్ధకం?

తీరికలేకపోవడం?

జీవితాలలో స్పీడు పెరిగిపోవడం?

మనసులలో అభిమానాలు తరిగిపోవడం?

మనషులలో యాంత్రికత పెరిగిపోవడం

'మన' అనే ఫీలింగ్ కరిగిపోయి పరాయి మీద మోజు పెరగడం?

డబ్బు సంపాదనా వ్యామోహంలో పడి కొట్టుకుపోవడం?

లేదా, అహంకారం? గర్వం?

ఏమో! నాకు తెలియడంలేదు! కాని మన మధ్యన ఎలాంటి కబుర్లూ, కనెక్షన్లూ లేకుండానే పది సంవత్సరాలు గడిచిపోయాయి.

పోనీ మీ బావగారయినా ఉత్తరాలు రాస్తారా అంటే ఆయన స్వభావం తెలిసిందేగా! పెళ్లయిన ఈ పదహారు ఏళ్లలో పట్టుమని నాకు పదహారు ఉత్తరాలయినా రాసి ఉండరు. ఇక ఆయన గురించి చెప్పుకునేదేముంది?

కనీసం సంవత్సరానికొకసారి పంపించుకునే నూతన సంవత్సర శుభాకాంక్షల గ్రీటింగ్స్ కూడా మనకు పెద్దగా అలవాటు లేదు. ఆఖరుకి ఎవరు ఎక్కడ ఉన్నారనే విషయం కూడా తెలియని పరిస్థితి. మీ బావగారేమో ట్రాన్స్‌ఫర్ల పేరుతో తరచూ ఊళ్లు మారుతూ మొదట్లో గుంతకల్, జగిత్యాల, కాకినాడ, గుంటూరు ఇలా ఆంధ్రప్రదేశం అంతా తిప్పుతూ ఉండటంతో మన కుటుంబ సభ్యుల మధ్యన గేప్ మరింత పెరిగిపోయింది. మనుషులు దూరం అయినంత మాత్రాన మమతలు, బంధాలు ఎక్కడికి పోతాయి? కలుసుకోవచ్చుగా! కబుర్లు తెలుసుకుంటూ ఉండచ్చుగా అనమాకు! ఎందుకంటే మనుష్యులు ఎదురుగా ఉంటేనే ముఖం చిట్లించే రోజులు ఇవి! ఇక దూర దూరంగా ఉంటే అభిమానాలు ఏం గుర్తుంటాయి?

మీ పిల్లలు ఎలా ఉంటారో నా పిల్లవాడికి తెలియదు! నా పిల్లవాడు ఎలా ఉంటాడో మీమీ కుటుంబ సభ్యుల్లకు తెలియదు. అయినా జీవితాలను గడిపేస్తున్నాము! కాలం తిరిగిపోతూనే ఉంది. అనురాగాలు, మమతలు, బంధాలతో దానికి పనేమున్నది కనుక?

నిన్ను, భానుమూర్తిని ఆఖరిసారిగా కలిసింది వరంగల్‌లో అనుకుంటా! ఆ ఫంక్షన్ ఏదో కూడా గుర్తులేదు అంతే!

అక్కడినుండి ఎవరి బతుకులు వారివి! ఎవరి బిజినెస్ వారిది! ఎవరి జీవితాలు వారివి! ఎవరి జీతాలు వారివి!

కాలం పెట్టే పరుగుపందెంలో విసుగూ విరామంలేకుండా అలుపూ సొలుపూ లేకుండా పరిగెత్తుతున్నాము. కనీసం వెనక్కి తిరిగి చూడకుండా!

మనీగేమ్‌లో గోల్‌ని కొట్టడానికి శతవిధాలా ప్రయత్నించాము! దాదాపు గెలిచాము.

ఆమధ్యన నాలుగు సంవత్సరాల క్రితం అనుకుంటా! కొన్నాళ్లు గుంటూరులో ఓ అపార్ట్‌మెంట్‌లో అద్దెకున్నాము.

మా పక్క ఫ్లాట్‌లో ఉన్న కుటుంబంతో మాకు బాగానే సన్నిహిత సంబంధాలు ఉండేవి! మాకు ట్రాన్స్‌ఫర్ అయి ఆ ఊరు నుండిరాబోయే ముందు ఆ ఇంట్లో పెద్దాయన పోయారు. పోయిన పదోరోజు అనుకుంటా పురోహితులు చదువుతున్న మంత్రాల్లో పేర్లు, గోత్రాలు అన్నీవిన్న తర్వాత, ఎంక్వైయిరీ చేస్తే తెలిసింది ఆ చనిపోయిన పెద్దాయన మా వారికి వరసకు బాబాయి అవుతారట! బాగా దగ్గరి బంధుత్వం! నేను చెబుతున్నది అతిశయోక్తి కాదు. పచ్చినిజం. ఎలాగో చెప్పమంటావా? మా వారు మొదటనుండీ ఒంటరిగానే పెరిగారని చెప్పానుకదూ! దానితో ఎవరి ఇళ్లకీ ముఖ్యంగా బంధువుల ఇళ్లకీ కూడా వెళ్లేవారుకాదు! అటువైపునుండి వాళ్లూ పెద్దగా

వచ్చేవారు కూడా కాదు. ఏదయినా రాకపోకలనేవి మా అత్తామామగార్లు బతికి ఉన్న రోజుల్లోనే. వాళ్ల పోవడంతో వాళ్ల బంధువుల మధ్య రాకపోకలు ఆగిపోవడం, ఈయనగారేమో సంవత్సరానికొకసారి ఊర్లు మారుతూ తిరగడంతో వాళ్ల కుటుంబ సభ్యులు ఎలా ఉంటారో మాకు తెలియదు. మా గురించి వాళ్లకి తెలియదు. మా అత్తగారు ఉండి ఉంటే గుర్తుపట్టి ఉండేవారేమో! ఆమెలేరు. ఆ పెద్దాయనకి చూపు ఆనదు! ఎపుడూ గదిలో పడుకుని ఉండేవారు. ఉండవలసిన రిలేషన్‌షిప్ సరిగ్గా మెయిన్‌టెయిన్ చేయకపోవడం వలన వచ్చిన పరిస్థితి ఇది.

పూర్తిగా అంతే పరిస్థితి కాదుగానీ దాదాపు మన కుటుంబంలో కూడా అలాంటి వాతావరణమే వస్తోంది.

ఆమధ్యన నాకు బాగా జబ్బు చేసింది. దాదాపు నెల రోజులపైనే మంచం మీద గడిపాను. ఒక రోజయితే పరిస్థితి మరీ క్షీణించి మా వారు నీకు, భానుమూర్తికి టెలిగ్రామ్స్ ఇచ్చారు. కానీ ఎవరూ రాలేదు! కారణం ఏమీలేదు. మా దగ్గర ఉన్న నీ అడ్రెస్ ఎప్పటిదో పాతది. దాని తర్వాత నువ్వు బదిలీల మీద రెండుమూడు ఊళ్లు తిరిగి ఉంటావు! భానుమూర్తి అయితే వాడి కొడుకూ, కోడలు దగ్గిరకి అమెరికా వెళ్లాడని తర్వాత ఎవరిద్వారానో తెలిసింది.

అన్నయ్యా!!

మొట్టమొదటిసారిగా నాలో . అపుడు మొదలయింది అంతర్మథనం! బెడ్‌మీద పడుకున్నప్పుడు నా వాళ్లంటూ ఇంతమంది ఉండికూడా ఒంటరిగా దుర్భరంగా గడిపిన ఆ నెలరోజులూ ఆలోచిస్తుంటే, తిరిగి గతం తిరగేస్తుంటే నేను ఏం పోగొట్టుకున్నానో తెలిసీ ఎంత తప్పుచేశానో అప్పుడు అర్థమయింది. స్వంత కుటుంబ సభ్యులతో చక్కటి బాంధ్యవాన్ని మెయిన్‌టెయిన్ చేయకపోవడంవలన పర్యవసానంగా ఎలాంటి దుస్థితిని, ఎలాంటి ఒంటరితనాన్ని అనుభవించానో భగవంతుడికే తెలియాలి. అనుక్షణం మనసులో కుమిలిపోయాను.

నిజానికి నాకు మీ బావగారు ఏలోటూ చేయలేదు! అనుక్షణం కంటికి రెప్పలా కాచుకున్నారు. సాయికృష్ణ అయితే నా పక్క విడిచి వెళ్లలేదు. అయినా ఏదో వెలితి. ఏదో అసంతృప్తి.

నావాళ్లు! అంటే నా భర్త, నా పిల్లలేనా? నా అన్నయ్యలు, నా వదినలు నా వాళ్ల కారా? మేమందరం ఒకే చెట్టు కొమ్మలం కాదా? అనే భావం నాలో అప్పటినుండి తొలచడం ప్రారంభమయింది.

అన్నయ్యా!

ఇప్పుడు నాకు అన్నీ ఉన్నాయి! ఆస్తి ఉంది! చెప్పుకోదగ్గ అంతస్థు ఉన్నది! వెనక్కి తిరిగి చూసుకోవలసిన అవసరం లేనంతగా మీ బావగారు సంపాదించారు.

కానీ ఇపుడు నాకు కావాల్సింది ఆస్తికాదు! అంతస్థుకాదు! నా అనే అండ!!

'మేమున్నాము' అనే బలం!!

నా కుటుంబ బలగం!!

లేకపోతే అనుకునేది ఏమీలేదు. అందరూ ఉన్నారు. కానీ మనకి తెలియకుండానే దూరమయిపోయాము!

ఇందాకటినుండీ వద్దు... చెప్పకూడదు అనుకుంటూ వచ్చాను కానీ మనసు నిలుపుకోలేక చెబుతున్నాను.

ఆమధ్యన మీ బావగారికి హార్ట్‌ఎటాక్ వచ్చినపుడు మా పరిస్థితి భగవంతుడికే తెలియాలి.

సాయికృష్ణ చిన్నవాడు! నేనా బయటి ప్రపంచం తెలియని దాన్ని! ఆ క్షణాల్లో ఎంతటి టెన్షన్, ఎంతటి నరకం అనుభవించామో ఇపుడు తలుచుకుంటేనే గుండె దడ

దడ లాడుతోంది.

వెంటనే పరిగెత్తుకొచ్చి నాకు ధైర్యం చెప్పి, అండగా నిల్చేందుకు నువ్వులేవు! నీ అడ్రెస్ తెలియదు.

దగ్గర ఉండి సహాయంగా, కొండంత బలంగా నిలిచే భానుమూర్తి అన్నయ్య కూడా రాలేదు! అప్పటికే వాడు రెండు అడ్రెసులు మారిపోయాడుట.

అపుడు నన్ను చుట్టేసుకుని 'అమ్మా! మనకెవరూ లేరా? ఎవరూ రారా?' అని భయం నిండిన కళ్లతో అమాయకంగా సాయి అడుగుతుంటే నేను ఏమని సమాధానం చెప్పేది?

మామయ్యలు, అత్తయ్యలు... అనురాగాలు, ఆత్మీయతలు అన్నీ ఆల్బమ్‌లకే పరిమితమయిపోయాయని ఏ మొహం పెట్టుకుని చెప్పేది? నా భయమల్లా ఒకటే! వాళ్ల నాన్నగారికిలాగా సాయికృష్ణ కూడా ఒంటరి ప్రపంచానికి అంకితమవకూడదు! నేను కోల్పోయిన అనురాగం, దూరమయిన అభిమానాలకు వాడు మాత్రం దూరం కాకూడదు. మృదుమధురమయిన మన వరసల పిలుపులు మామయ్యా, అత్తయ్యా, బాబాయి, పిన్ని, బావ, వదిన ఈ పిలుపులకు, మనుష్యులకు సాయికృష్ణ దూరం కాకూడదు! నీకు తెలిసిందే! నాకు మళ్లీ సంతానభాగ్యం లేదు. మా జీవితాలకి ఆశాకిరణం వాడు ఒక్కడే! లేకలేక కల్గిన ఆ ఒక్క సాయికృష్ణ ఈ 'మమ్మీ డాడీ'ల కల్చర్‌లో కొట్టుకుపోవడం నాకు ఇష్టంలేదు. అమెరికాలాంటి దేశాల్లో ఒక వయసు రాగానే పిల్లలు రెక్కలొచ్చిన పక్షుల్లా కుటుంబాలనుండి విడివడిపోయి ఎవరిదారి వారు చూసుకుంటారట! అపుడపుడు స్నేహితుల్లా కలుసుకుంటారట! అంతకుమించిన వేరే బంధాలు వారి మధ్యన వుండవు! దురదృష్టవశాత్తు ఆ కల్చర్ మన దేశానికి దిగుమతి అయింది., వాళ్లలా అందరికీ ఫోన్ సౌకర్యంలేకపోయినా కనీసం పోస్టల్ సౌకర్యం అయినా వినియోగించుకోని అధమస్థాయికి దిగజారిపోయాము.

అందుకు మన కుటుంబమే కొంతవరకూ ఉదాహరణ అని చెప్పుకోడానికి నేను ఏమాత్రం సిగ్గుపడను.

ఆమధ్యన ఒకసారి గుంటూరు వెళ్లినపుడు మా గురించి నువ్వు ఎంక్వయిరీ చేసి వెళ్లావని తెలిసింది.

మా కొత్త అడ్రెస్‌తో వెంటనే లెటర్ రాద్దామనుకున్నాను.

అనుకుంటున్నాను! అనుకుంటూనే ఉన్నాను! అనుకుంటూ ఉంటాను!

అలా... అలా ఇదిగో ఇన్ని రోజులు గడిపేశాను.

నేను చాలా బిజీ, తీరికలేదు అని సర్దిచెప్పుకున్నాను.

వెంటనే రాద్దామనుకుంటే ఆరోగ్యం బాగుండలేదు. అయినా పెద్దగా విశేషాలు ఏమున్నాయని? రాయడానికి? అని సమర్థించుకున్నాను

ఎవరి కాపురాలు వారివి! ఎవరి సంసారాలు వారివి! ఎవరి సమస్యలు వారివి. ఎపుడో ఒకప్పుడు కలుసుకోకపోము. అపుడు కలుసుకున్నాక తీరికగా అన్నీ మాట్లాడుకోవచ్చునులెద్దూ అని ఆత్మవంచన చేసుకున్నాను.

లేనివి ఉన్నట్లుగాను ఉన్నవి లేనట్లుగానూ అనుకుని మనస్సును మభ్యపెట్టుకున్నాను. దురదృష్టం ఏమిటంటే మనవాళ్లలో పెళ్లికెదిగిన పిల్లలు ఎవరూ లేరు. అందరూ చదువులలో ఉన్నవారే! కనీసం అలాంటి సందర్భాలలో అయినా కలుసుకునే వీలు కలగలేదు.

అన్నయ్యా!

ఏమిటేమిటో చెప్పుకోవాలనిపిస్తోంది. నీ చేతుల్లో ముఖం ధాచుకుని, తనివితీరా ఏడ

వాలనిపిస్తోంది.

మన మధ్యన ఏం రాద్ధాంతాలున్నాయి రాకపోకలు స్థంభించడానికి? మన కుటుంబాల మధ్యన ఏం కలతలున్నాయని? కనీసం యోగక్షేమాలయినా తెలియకపోవడానికి?

ఒకప్పటి ఉమ్మడి కుటుంబ వ్యవస్థనుండి విడివడి వ్యాపార రీత్యాకాని, ఉద్యోగరీత్యాకానీ వేరు కాపురాలు పెట్టినా,

అభిమానాలు, ఆప్యాయతలు ఎందుకు తరిగిపోవాలి?

మనుషుల మధ్యన బంధాలు ఎందుకు తెగిపోవాలి?

అందరం ఒకే చెట్టుకొమ్మలం! ఒకే గూటి పక్షులం!

ఇంకా చెప్పాలంటే కొంతకాలం వరకూ పండుగకనో, ఫంక్షన్‌కనో కుటుంబ సమేతంగా వచ్చేవాళ్లం. క్రమంగా అది తగ్గిపోయి, ఆ కుటుంబం తరపునుండి రిప్రజెంటేషన్‌గా ఎవరో ఒక వ్యక్తి హాజరవడం జరుగుతోంది.

ప్రస్తుతం ఆవిధంగా కూడా రాకపోకలు తగ్గిపోయి గ్రీటింగ్ టెలిగ్రామ్స్‌తో సరిపెట్టుకుంటున్నాము.

కారణం!

సెలవు దొరకకపోవడం!

పనితీరిక లేకపోవడం!, పరమ బిజీ అన్నమాట!

మనసులో ఇష్టంలేక అన్నింటికీ మించి అనారోగ్యం అనే గొప్ప ఆయుధం! మరి ఇంత నటన మనలోనే ఉంటే ఇక అభిమానాలు, బంధుత్వాలు ఏం మిగులుతాయి?

పటిష్టమయిన కుటుంబ వ్యవస్థ చిన్నాభిన్నమయి, బలహీనం అయి ఎక్కువగా పరాయివారి జోక్యంతో ముక్కలవడానికి కారణం మనమేగా! నాకు ఆరోగ్యం బాగుండనపుడు, మీ బావగారికి హార్ట్‌ఎటాక్ వచ్చినపుడు పూర్తిగా పనివాళ్లమీద, పక్కవాళ్ల మీద, ఎదురింటి వారిమీద ఆధారపడినపుడు, పైకి కాకపోయినా మరొకరి దగ్గర మన పరోక్షంలో వారుచేసిన విమర్శలకు, ఎగతాళులకు ఆస్కారం ఇచ్చింది మనమేగా.

నిజానికి పరాయివాళ్లు మాత్రం ఎందుకు చేస్తారు? ఎన్నాళ్లని చేస్తారు? వారి పనులు వారికుంటాయి! వాళ్ల సమస్యలు వారికుంటాయి.

అన్నయ్యా!

ఇపుడు నువ్వు నన్ను చూస్తే చాలా ఆశ్చర్యపోతావు. కాలం తెచ్చిన మార్పు! మీద పడుతున్న వార్ధక్యం! జుట్టు చాలావరకు నెరిసింది. ఊడిపోయింది కూడాను! కొత్తగా కళ్లజోడు ముఖమ్మీద చోటుచేసుకుంది. ఆరోగ్యం పాడయింది! జాయింట్ పెయిన్స్ కూడా మొదలయినట్లు అనుమానం. ఎందుకో ఇవన్నీ ఆలోచిస్తుంటే దిగులు వేస్తోంది. ఏదో తెలియని భయం, అసంతృప్తి, ఒంటరితనం, విరక్తిలాంటి భావం. ఏదో పోగొట్టుకున్న వెలితి ముఖ్యంగా ఏ క్షణాన మృత్యువు ముంచుకొస్తుందోననే విపరీతమయిన గుండెదడ.

ఇన్నిరకాల ఫీలింగ్స్ మధ్యన ఇపుడు మీరందరూ గుర్తుకొస్తున్నారు! కళ్లల్లో మెదులుతున్నారు.

ఇలా అంటున్నందుకు సిగ్గుగా ఉంది. కాని ఇది నిజం! క్షమించు అన్నయ్యా!

ఇన్ని సంవత్సరాలు గడిచినా నువ్వు నన్ను, నేను నిన్ను గుర్తుపట్టగలం! కాని మన పిల్లల పరిస్థితి ఏమిటి? భానుమూర్తి మనవరాలు మొదటినుండీ అమెరికాలోనే ఉంది. దాని మొహం చూసి ఎరగను! నీ పిల్లలు నాకయితే తెలుసు! సాయికృష్ణకి అంతగా గుర్తులేదు. నీ మనవలు, మనవ

రాంద్రు అయితే నాకే తెలియదు! పేర్లు అసలే గుర్తులేవు! అలా అని కాదుకాని కొంత కన్‌ఫ్యూజన్!

అదీగాక మీ ఆఖరి మనవలు, మనవరాళ్లు అందరి బారసాలలూ సింపుల్‌గా తిరుపతిలోనూ, హైదరాబాదులోని గుళ్లల్లోనూ చేసినట్లున్నారు! బాలసారెలకు వచ్చే అవకాశం కూడా లేకపోయింది. ప్రస్తుతం ప్రతి ఇంట్లోనూ చూస్తున్నాముగా!

పిల్లలు ఈ అనురాగాలకు, ఆత్మీయతలకు, బంధాలకు, అనుబంధాలకు, సంస్కృతి సంప్రదాయాలకు దూరం అవుతూ (ఒకవిధంగా మనమే దూరం చేస్తున్నామనుకో) ఆ ఒంటరితనం నుంచి కొత్త స్నేహాలకి, చెడు అలవాట్లకి దగ్గరవుతున్నారు.

ఏ మామయ్యలతోనో బాబాయిలతోనో (మన కుటుంబ సభ్యులతో) సరదాగా, స్నేహంగా గడపవలసిన చక్కటి కాలాన్ని, సమయాలని హింస, సెక్సు దృశ్యాలతో నిండి ఉన్న సినిమాలు చూడటానికి, పిచ్చి తిరుగుళ్లు తిరగడానికి వృథా చేస్తున్నారు.

అందుకే, సాయికృష్ణని...

ఈ మెకానికల్, రొటీన్, మనీ, బిజినెస్, కమర్షియల్, కృత్రిమ, అసహజ, మోసపూరిత, కుళ్లు రాజకీయాల!, స్వార్థ, అసూయ, ఈర్ష్య, ద్వేషం, పగ, హింస, అశ్లీలాలతో అణువణువు నిండి ఉన్న ఈ అనారోగ్యపు అసహజసమాజానికి దూరంగా...

మమత, అనురాగం, ఆత్మీయత, బంధం, అనుబంధం, అండదండలు పుష్కలంగా లభించే వాడి మామయ్యలు, అత్తలు, బావలు, వదినలతో కూడిన మన కుటుంబంలోనికి పంపిస్తున్నాను.

ఆ బంధాలే వాడికి బలం!

ఆ అనురాగాలే వాడికి ఆరోగ్యం!

ఆ మమతలే వాడికి మనీ!

ఎందుకంటే మనవాడు, మన కుటుంబ సభ్యుడు అనే ఫీలింగ్ పూర్తిగా కాకపోయినా మనసు పొరలలో ఏమారుమూలనో ఖచ్చితంగా దాగి ఉంటుంది. నాకు ఆ నమ్మకం ఉంది.

కాబట్టి, ఒకరిని ఒకరు మోసం చేసుకునే పరిస్థితి ఉండదు. పైగా ఆపత్కాలంలో అండగా నిలుస్తారని నానమ్మకం! అందుకే,

మిమ్మల్ని వెతుక్కుంటూ సాయికృష్ణ -మీ మేనల్లుడు వస్తున్నాడు!

మనందరినీ కలపాలని, పలుచబడిన మన మధ్యనగల బంధాలని బలీయంగా పటిష్టపరచాలని, మన కుటుంబాల మధ్యన అంతరించి పోతున్న ఆత్మీయతలు, అనురాగాలు తిరిగి మొలకలెత్తించాలని, బలీయమయిన ఆశయంతో, బయలుదేరిన నీ మేనల్లుడిని ఆశీర్వదించి, అండగా నిలుస్తావని మనసారా ఆశిస్తున్నాను!

నువ్వు వాడిని గుర్తుపడతావో లేదోనని చిన్న సంశయం కూడా ఉందనుకో!

అన్నయ్యా!

మళ్లీ - మనందరం కలిసి సరదాగా, నాలుగు రోజులు గడపాలి! అరుదయిపోయిన అనురాగం, ఆత్మీయతలు వెల్లివిరియాలి!

మామయ్యా! అత్తయ్యా! వదినా! బావల్లాంటి అందమయిన పిలుపులు విన్పించాలి! భారతీయ కుటుంబ వ్యవస్థ ఎంత బలమయినదో చాటిచెప్పాలి! ఇది నా కోరిక!

కాత్యాయని వదిన ఎలా ఉన్నది? కలుసుకున్నాక అందరం కలిసి మన వాకిట్లోని పొగడ చెట్టుగట్టుమీద కమ్మని విందుభోజనం చేయాలి! తలచుకుంటూ ఉంటేనే ఆ ఊహ మధురంగా ఉన్నది. ఊహించుకుంటూ ఉంటేనే మనసు దూదిపింజలా ఎగిరిపోతోంది!

అన్నయ్యా!

అతిత్వరలో- అందరం కలవాలని కోరు కుంటూ-

నీ చెల్లెలు
సత్యవతి.''

ఉత్తరం పూర్తిచేసేసరికి, వేదమూర్తిగారి ముఖం వడగాడ్పుకొట్టినట్లుగా అయింది! బలమయిన వేడి నిట్టూర్పు తన్నుకువచ్చింది!

ఆ ఉత్తరంలోని ప్రతి అక్షరం ఆయనని నిలదీస్తున్నాయి! ప్రశ్నిస్తున్నాయి! సమస్యకు పరిష్కారం చెప్పమని శాసిస్తున్నాయి! ఆ మాటలే వేయిగొంతుకలతో ఆయన చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి!

'మన కుటుంబ వ్యవస్థ చిన్నాభిన్నం అవడానికి కారకులు ఎవరో కాదు! మనమే! మన నిర్లక్ష్యమే! మన అజ్ఞానమే!' అనే నగ్న సత్యం ఆయనని నిట్టనిలువుగా దహించివేస్తోంది.

సత్యవతిలో జరిగిన అంతర్మథనంలాంటి సంఘర్షణ ఆయనను ఉక్కిరి బిక్కిరి చేస్తోంది. అది బయటకు చెప్పుకోలేని ఆవేదన! బయటకు రాలేని ఆవేశం!

ఎంతోమందికి విజ్ఞానాన్ని పంచారాయన!

కావ్యాలు, పురాణాలు, ఇతిహాసాలు ఔపోసన పట్టారు!

శతకాలు, నీతిపద్యాలు ఎన్నో పిల్లలకు బోధించారు! వల్లె వేసారు! ఆయన బోధించిన ప్రతి పద్యంలోనూ బలమయిన కుటుంబ బంధాలు! ఆయన చెప్పిన ప్రతి పాఠంలోనూ, ప్రవచించిన ప్రతి పురాణంలోనూ, కుటుంబ సభ్యుల మధ్యన ఉన్న బంధాలు, వాటికోసం వారి త్యాగాలు కళ్ళకు కట్టినట్లు వర్ణించారు!

గడచిపోయిన రోజులు తుమ్మెదల్లా ఆయన చుట్టూ తిరుగుతూ భరించలేని ఝుంకారాన్ని చేస్తున్నాయి!! ఆయన అంతరంగంలో మళ్ళీ అంతర్యుద్ధం మొదలయింది! ఎంతోమందికి నీతులు చెప్పిన తను చేసిందేమిటి?

సత్యవతి చెప్పినట్లు తమ కుటుంబాల మధ్యన సరియైన 'బాంధవ్యాన్ని' తామె వరూ కొనసాగించలేదు! అంతేకాదు, తమ కుటుంబాల మధ్యన ఉన్న బంధాలనే లింకులు తెగిపోతున్నా ఇంటికి పెద్దవాడయి ఉండికూడా తను చూస్తు ఉండిపోయాడు! నిర్లక్ష్యం చేశాడు.

వాళ్ళు రాకపోతేనేం? తను వెళ్ళవచ్చుగా!

మీ యింటికి మా యిల్లు ఎంత దూరమో మా యింటికి మీయిల్లు కూడా అంతే దూరం. అన్నట్లుగా ప్రవర్తించాడు తను!

ఒకే కుటుంబంలోని సభ్యుల మధ్యన సరియైన రాకపోకలు లేకపోవడంవలన ఉత్పన్నమయ్యే అనారోగ్యపు పరిస్థితులు, అపోహలు, సమస్యలు, అందులోని 'సీరియస్‌నెస్' తను గమనించకుండానే-

పరిస్థితి ఇంత దూరం వచ్చింది! మమత లవంతెన తెగిపోయే పరిస్థితి రావడానికి తను కూడా కారకుడే!

కాకపోతే ఇంటికి పెద్దాయన అనే భ్రమ ఒక్కటే మిగిలి ఉంది.

వెనక అలికిడి అయితే కొంచెం కదిలి తలతిప్పి చూశారు వేదమూర్తిగారు!

సాయికృష్ణ!

ఆయన ముందుకు వంగి కూర్చోవడంతో సాయికృష్ణ ఆయనకు ఎదురుగా వచ్చి మోడామీద కూర్చుని చెప్పాడు! "మామయ్యా! మీ పాత అడ్రెస్ ప్రకారం స్కూల్స్‌కి వెళ్ళి ఎంక్వయిరీ చేసుకుంటూ గుడివాడ, భీమవరం, నెమలి, కైకలూరు తిరిగి ఆఖరికి మీ అడ్రెస్ పట్టుకున్నాను!"

వేదమూర్తిగారు వెనక్కి వాలి అన్నారు.

"చిన్నవాడివయినా పెద్ద బాధ్యత నెత్తిన వేసుకున్నావు సాయీ! సమసమాజ స్థాపన కోసం కొంతమంది పాదయాత్రలు చేస్తారు! భాషా భేదాలు అంతరించాలని, మరికొందరు సైకిల్ యాత్రలు చేస్తారు! మనుషుల్లో అహింసాభావం పెంపొందాలని సద్భావనా యాత్రలు చేస్తారు మరి కొందరు! మానవ హారాలు, రథయాత్రలు, మైకు ముందర ప్రసంగాలు, సభలు, సమావేశాలు ఇలా ఒక్కోలక్ష్యం కోసం ఒక్కొక్కళ్ళు రకరకాల మార్గాల నెంచుకుంటారు! ఇందులోని ప్రతి ఒక్కరూ ఒక్కొక్క కుటుంబంనుండి వచ్చినవారే! అసలు కుటుంబమే లేని సమాజంలేదు! సమాజం లేని దేశం లేదు! వీటికి మూలమయిన కుటుంబ వ్యవస్థే కూలిపోతుంటే, దానికి నీ లేత చేతులతో అడ్డుగోడ వేయాలనే నీ ప్రయత్నం, రక్షణ ఇవ్వాలనే నీ ఆశయం అన్నింటి కంటే గొప్పవిరా! నేను చాలా గర్వపడుతున్నాను! పెద్దవాళ్ళం మేము చేయలేని పనిని చిన్నవాడివి నువ్వు తలపెట్టడం సంతోషంగాను, ఒకింత సిగ్గుగాను కూడా ఉంది! ఈ రోజుల్లో, అయిన వారి నుండి దూరంగా పారిపోయి స్నేహితులతో కాలక్షేపం చేయాలని కోరుకునే వాళ్ళేకాని విడిపోతున్న బంధాల్ని కలపాలని ఆశించే నీలాంటివాళ్ళు ఒక్కరుంటే చాలురా! కుటుంబాలలోనే కాదు, మన సమాజంలోనే ఈ అలజడులు ఉండవు!"

కొంచెం సిగ్గుపడ్డట్లుగా, ఇబ్బందిగా ఫీలయ్యాడు సాయికృష్ణ.

"మరీ అంతగా పొగిడేయకు మామయ్యా! ఆశయమయితే ఉంది కాని ముందర ప్రయత్నం సాగించాలి కదా! ముందర మన వాళ్ళెవరో, మన కుటుంబసభ్యులు ఎవరెవరో, ఎక్కడెక్కడ ఉంటారో, వీళ్ళందరి అడ్రెసులు తెలియాలి! పరిచయం చేసుకోవాలి! అందరినీ ఒకే వేదిక మీదకి తీసుకురావాలి! అన్నింటికంటే ముఖ్యం మీ ఆశీర్వచనం, అండదండలుండాలి! అపుడు నా ప్రయత్నం ఫలించేది! నా ఆశయం, మా అమ్మ ఆకాంక్ష నెరవేరేది!"

"నిజమే సాయీ! ముందర నీకు మనవాళ్ళని పరిచయం చేయాలి" అంటూ వేదమూర్తిగారు లేచి, ఎదురుగా ఉన్న అద్దాల బీరువాలోనుండి, రెండు పెద్దసైజు ఆల్బమ్స్ తీసి, సాయి ఎదురుగా పెట్టి చెప్పారు! "తిరగేయి! చూస్తూ ఉండు! నేను చెబుతున్నా కొంచెం కన్‌ఫ్యూజన్‌గానే ఉంటుంది! ఆయా మనుషులను ప్రత్యక్షంగా కలుసుకుంటే తప్ప గుర్తుపట్టలేవు!"

సాయి నాలుగయిదు పేజీలు తిప్పాడు! అన్నీ ఎక్కువగా పెళ్ళిఫొటోలు! ఆ పెళ్ళి అలంకరణలో ఎవరు ఎవరో అసలు అర్థం కావడంలేదు! ఇంకా రెండుమూడు పేజీలు తిప్పి అతికష్టంమీద గుర్తుపట్టాడు. "మామయ్యా! కష్టమే! వీటిల్లో మా యింట్లో ఉన్నవే కాబట్టి, పెళ్ళి ఫొటోలలో కొన్ని అమ్మవి, నాన్నవి! మిగతా వాటిల్లో మీరు, అత్తయ్య, లీలగా కృష్ణమూర్తి బావ, జానకి అక్కలను, మనోహరి వదినను గుర్తుపట్టగలను! అంతే"

వేదమూర్తిగారు నవ్వారు! ఆ నవ్వులో కొంచెం బాధ కూడా తొంగిచూసింది! "నిజమే! తప్పు నీదికాదు! తరచూ కలసుకోని మాది! మనది! పైగా ఈ ఫొటోలు చాలా పాతవి! ఇపుడు మనుషులు అందరూ మారిపోయారు! గుర్తుపట్టడం కష్టమే! నాకనిపిస్తోంది. ఈసారినుండి,

మనందరం ఎప్పుడు కలిస్తే అప్పుడు, ఎక్కడ కలిస్తే అక్కడ, ఆ కలయికకు గుర్తుగా వెంటనే ఫొటో తీసుకోవాలని!"

"నిజమే మామయ్యా! అపుడపుడు ఆ ఫొటోలు తిరిగి చూసుకుంటూ ఉంటే

బాగుంటుంది" అంగీకారంగా తలూపుతూ అన్నాడు సాయి!

"పూర్వం పెళ్ళిఅయి అత్తవారింటికి వెళ్ళిన ఆడపిల్లకి పుట్టింటిమీద దిగులు కనీసం సంవత్సరం వరకూ పోయేది కాదు! ఆ సంవత్సరం ఏ పిల్లో పిల్లాడో పుడితే- వాడి ఆటపాటలతో, పుట్టింటి బెంగ కొంతవరకూ తీరేది! మరి, ఇపుడో! మెడలో తాళి పడిన మరుక్షణంనుండి పుట్టింటి ముఖం చూడటం లేదు కదా, పిల్లవాడు పడగానే అంతక్రితం వరకూ ఏకాస్త అయినా ఉన్న బంధం దాదాపుగా కట్! ఇక, తనూ, తన పిల్లలు, తన సంసారం! అంతే!

చెబితే నమ్మవు! ఇక్కడ ఉన్నదే- నా మనవరాలు ఆకృతి, అది దాని స్వంత అక్క అర్పితను చూసి మూడు సంవత్సరాలయింది! ఇది నిజం! నా కూతురు, అల్లుడు అంటే నీ వదినా, అన్నలన్న మాట. ఇద్దరూ విశాఖపట్టణంలో డాక్టర్లు! క్షణం తీరికి ఉండనంత ప్రాక్టీసు ఇరువురికీ! పెంచే తీరికలేకే ఆకృతిని మా దగ్గర వదిలిపెట్టారు! వాళ్ళ పెద్ద కూతురు అర్పిత మెడ్రాస్‌లో మెడిసన్ చదువుతోంది! అది ఎపుడయినా విశాఖపట్టణంవస్తే రెండు రోజులు ఉండి వెళ్ళిపోతుంది. ఆకృతిని చూడాలనిపిస్తే దీని తల్లితండ్రులే ఏ సంవత్సరానికో ఒకటి రెండుసార్లు వచ్చి వెళతారు! అర్పిత చెల్లెలిని కలవదు! అంటే కుదరదు! అర్పితను కలవాలంటే ఆకృతిని వాళ్ళు విశాఖపట్టణం తీసుకువెళ్ళరు! అదీకాక అర్పిత సడెన్‌గా ఎపుడు వస్తుందో, ఎపుడు వెళుతుందో వాళ్ళకే తెలియదు. అంతే ఇలాగే ఒకరితో ఒకరికి సంబంధాలు లేకుండా రోజులు గడిచిపోతున్నాయి.

నిజానికి నా తమ్ముడు భానుమూర్తి వాడి కుటుంబం, మీ కుటుంబం, నా ఇద్దరు కొడుకుల కుటుంబాలు, కూతురు దాని కుటుంబం, అందరినీ ఈ క్షణాన ఒకచోట నిలబెడితే ఎవరికి ఎవరు ఏమవుతారో అసలు ఒకరిని ఒకరు గుర్తుకూడా పట్టరని నా ప్రగాఢనమ్మకం! వాళ్ళద్వారా, వాళ్ళ ద్వారా కబుర్లు తెలియడమే కాని ఎవరం ప్రత్యక్షంగా కలుసుకుని చాలా రోజులయింది! పైగా అందరం ఉన్నది ఆంధ్రాలోనే. హైదరాబాదు, వరంగల్, రాజమండ్రి, ఏలూరు, ఏమిటో సత్యవతి అన్నట్లు తప్పు ఎక్కడ ఉన్నదో తెలియదు కాని కనీసం కబుర్లు తెలుసుకోడానికయినా కలుసుకునేందుకు వీలులేనంత పరమ బిజీ అయిపోయామని ఎవరికి వాళ్ళం మభ్యపెట్టుకున్నాము. ఏ స్నేహితుడో, స్నేహితురాలో ఆంధ్రాలో అవసరంలేదు ఏ మధ్యప్రదేశ్‌లోనో, బీహార్‌లో ఉన్నాసరే, నాలుగు నెలలకొకసారి కలయిక, రెండు నెలలకొకసారి ఉత్తరం, నెలకో ఫోన్‌కాల్!

మరి ఈ ప్రేమ మన స్వంత మనుషుల విషయాలలో ఎందుకు లోపిస్తోందో అర్థం కావడంలేదు"

క్షణంసేపు ఆగి, ఊపిరి బరువుగా వదులుతూ ఉండిపోయారాయన.

"నిజమే మామయ్యా! 'మా వాళ్ళను కలిసి కొన్ని సంవత్సరాలయింది తెలుసా!' (అంటే మేము అంత బిజీ అనమాట) అని 'ఆనందంగా' చెప్పుకోవడం ఈ రోజుల్లో ఫ్యాషనేమో అన్పిస్తోంది! అంతేకాదు. ముఖ్యమయిన విషయం ఏమిటంటే మనలో మనకే విద్వేషాలు! అసూయా ద్వేషాలు! ఎలాగంటే,

అన్నయ్య కొడుకుకి ఉద్యోగం వచ్చి తన కొడుకుకి రాకపోతే తమ్ముడు భరించలేడు!

తమ్ముడు కూతురుకి వివాహమయి తన కూతురుకి పెళ్ళికాకపోతే అన్నయ్య సహించలేడు!

తన కూతురుకంటే అన్నయ్య కూతురుకి మంచి సంబంధంవచ్చి పెళ్ళి అయితే చెల్లెలి కంటగింపు!

తమ్ముడు కూతురు పెళ్ళికి తమ్ముడు ఎంతటి బాధ్యత ఫీలవుతాడో, అన్న కూడా అంతే బాధ్యత ఫీలయిననాడు అన్న కొడుకు ఉద్యోగం చూసి అసూయపడకుండా, తన కొడుకుని కూడా అలాగే కష్టపడి చదివేలా చేసి, తమ్ముడు సాధించిననాడు ఈ సమస్యలు ఎందుకు తలెత్తుతాయి!

ఇవన్నీ ఉమ్మడి కుటుంబాలలోనే సాధ్యమవుతాయి అనుకోవడం పొరపాటు! దూర దూరంగా ఉన్నా బాధ్యతలు, ప్రేమలే కదా బంధాలని ముడివేసేది!

అయిదు వేళ్లూ కలిసి గట్టిగా పిడికిలి బిగిస్తేనే కదా, గాలి కూడా జొరబడదు!

నేననేది ఒక్కటే మామయ్యా! ఈ రోజుల్లో ఉద్యోగరీత్యా ఎక్కడెక్కడో, అవుటాఫ్ స్టేట్స్‌లో ఉద్యోగాలు చేయక తప్పదు! కాని, దురదృష్ట వశాత్తూ చాలామంది సెలవలు పెట్టి, విహారయాత్రలు, వినోదయాత్రలయినా చేస్తారు కాని, ఇంటివైపు తిరిగి చూడటానికి ఇష్టపడరు! ఆ పద్ధతి మార్చుకుని తన ఇల్లు కూడా ఆ యాత్రలో ఓ మజిలీగా చేసుకుంటే ఎంత బాగుంటుంది?

నిజానికి తల్లితండ్రులు, అక్కచెల్లెళ్లు, అన్నదమ్ములు ఉన్న ఇంటికి మించిన పుణ్యస్థలం ఎక్కడుంది? చెప్పండి మామయ్యా!"

ఆఖరున సాయి అన్న మాటలతో కదిలిపోయారు వేదమూర్తిగారు!

"నిజమే సాయీ! తన తల్లితండ్రులే ఆది దంపతులు. తన ఇల్లే పుణ్యస్థలం అనుకున్ననాడు ప్రతి ఇల్లూ ఒక దేవాలయం అవుతుంది"

సాయి ఆల్బమ్ పేజీలు తిరగేస్తూ అన్నాడు, "అవును మామయ్యా! తప్పు ఎక్కడ ఉన్నా, కనీసం ఇపుడయినా, అందరం ఒకరినొకరం కలుసుకుని, కలుపుకోవాలనే ధ్యేయంతో వచ్చాను! లేకపోతే చూడండి! ఈ ఫొటోలలో ఉన్నది అందరూ మన వాళ్ళే అయినా, వాళ్ళు ఎవరో, నాకేమవుతారో తెలియని పరిస్థితి!"

వేదమూర్తిగారు మాటలు రానట్లుగా, ఉండిపోయారు.

"మామయ్యా!"

"ఊ!"

"చినమామయ్య భానుమూర్తీ, ప్రమీల అత్తయ్యా వాళ్ళు వస్తూ ఉంటారా?"

కొంచెం బాధగా చెప్పారాయన "లేదురా! చాలా తక్కువ! ఎపుడయినా వస్తే భానుమూర్తి ఒక్కడే వచ్చి వెళతాడు! వాడి కొడుకూ కోడలు అమెరికాలో ఉంటున్నారు! మీ మధ్యన ఎలాంటి మాట పట్టింపులు లేవు! మా అమ్మ చెప్పినట్లు కేవలం తరాల అంతరం! అంతే!

మామయ్యా! మీరు 'ఊ' అనాలే కాని నాకు తోడు ఉండాలేకాని ఈ కలుషిత వాతావరణంనుండి, డబ్బు మనుషుల మధ్యనుండి, అభినయించే స్నేహితులకి దూరంగా, నటించే స్వార్థపరులకు అందనంతగా, మనవాళ్ళందరినీ కలుపుకు రావాలి! మన మధ్యన ఉన్న బంధమేమిటో విప్పి చెప్పుకోవాలి!"

కొంచెం ఆవేశంగా, ఎర్రబడిన బుగ్గలతో చెబుతున్న మేనల్లుడివైపే రెప్పవేయకుండా చూస్తున్నారు వేదమూర్తిగారు.

మీసం వచ్చిన దగ్గరనుండీ కుటుంబం నుండి, కనిపెంచిన తల్లితండ్రులకి దూరంగా ఇంటి బరువు బాధ్యతలకు అతీతంగా, వేరుగా ఉండాలనే విపరీతపు ఆలోచనలనుండి.

ఇంట్లో అనవసర తగాదా పెట్టుకుని, పారిపోయి ఏ స్నేహితుల గదులలోనో తల దాచుకోవాలనే పోకడలనుండి.

స్వంత ఊళ్లోనే హాస్టల్‌లో కాపురం పెట్టాలనే పెడధోరణులనుండి తన కుటుంబ సభ్యులకంటే తన స్నేహితులే

గొప్ప అని చాటిచెప్పాలనే తాపత్రయాల నుండి.

అంతరించిపోతున్న ఈ అనుబంధాలని పునర్జీవింప చేయాలనే ఆలోచన ప్రతి యువకుడికీ వస్తే ఎంత బాగుండను?

"ఏమిటి మామయ్యా? ఆలోచిస్తున్నారు? "

తడబడ్డారాయన "ఊహు! ఏమీ లేదురా! చిన్నవాడివయినా, నీకున్నపాటి బుద్ధి, జ్ఞానం మాకు లేవేమిటా? అని!"

"మామయ్యా! అమ్మ మాటల్లో మొదటి నుండీ మీకు ఈ బంధాలు, రిలేషన్స్ అంటే మక్కువ ఎక్కువనీ, అందరితో ఇల్లు ఎపుడూ కళకళలాడుతూ ఉండాలని కోరుకునేవారని అంటుండగా విన్నాను! మరి మీరు కూడా ఇలా ఎవరికీ కానట్లు, మీకు అయిన వారెవరూ లేనట్లు ఎలా ఉండిపోయారు? "

కొంచెం భారంగా అన్నారాయన, "పరిస్థితులు కాలం ప్రభావం అనలేను కాని మనం, అనుకున్నట్లే అవతలివారు కూడా అనుకోవాలి కదా! ఎవరికి వారు గిరిగీసుకుని కూర్చుంటే నా పరిధి కుదించుకుపోయిందే కాని విస్తృతమవలేదు! ఆలోచనల తోసహా!"

"మామయ్యా! ఇది మన ఒక్కరి కుటుంబ పరిస్థితికాదు! చూస్తున్నాను కదా! ప్రతి ఒక్క ఇంట్లోను ఈ సమస్య ఉన్నది! పైకి చెప్పుకుంటే పరువు తక్కువ అని ఎవరూ బయటపడటంలేదు! ఈ పరిస్థితులన్నీ గమనించిన తర్వాతే ఈ నిర్ణయానికి వచ్చాను! మొదట మీ యింటితోనే ప్రారంభించాను! మిగతా మనవారి అందరి అడ్రెసులు ఇవ్వు మామయ్యా!"

"సాయీ! ముందుగా నిన్ను నేను ఒకందుకు అభినందిస్తున్నాను! నోరారా, తియ్యగా, మామయ్యా! అని పిలుస్తున్నందుకు! ఆ పిలుపు ఎంత హాయిగా ఉందిరా? మన పిల్లల్ని మామయ్యలు, బాబాయిలు, పిన్ని, అత్తయ్య, అమ్మ, పెద నాన్నలెవరో ఒకరికి ఒకరికి తేడాలేమిటో తెలియకుండా పెంచుతున్నాము! కనిపించిన ప్రతి మగాడూ 'అంకుల్'! ప్రతి ఆడదీ 'ఆంటీ'! అంతకుమించిన వరుసలు మన ఇంగ్లీషు చదువులు ఈ తరం వారికి నేర్పడం లేదు!"

సాయికృష్ణ చిన్నగా మందహాసం చేశాడు ఆయన చెప్పిన తీరుకి! అతను నవ్వినపుడు బుగ్గలు సొట్టలుపడి ముఖం ఎంతో అందంగా ఉంటుంది.

వేదమూర్తిగారు కూడా చిన్నగా నవ్వి అన్నారు. "అడ్రెసులు ఇవ్వడం కాదు. నేనూ వస్తాను. ఇద్దరం కలిసే వెళదాం. ఆలంబన లేక కృశించిపోతున్న ఈ మల్లె చెట్టుకి ఇద్దరం కలిసి పందిరి వేద్దాము. అన్నట్లు సాయీ నువ్వు నా దగ్గరికి క్షేమంగా చేరినట్లు ముందు మీ అమ్మకి లెటర్ వ్రాసిపడేయ్"

"అలాగే మామయ్యా! సాయంత్రం వ్రాస్తాను"

"వద్దురా! అలా అనుకునే మీ అమ్మ కొన్నివేల సాయంత్రాలు గడిపింది. ఏ విషయంలో అయినా వాయిదా వేయవచ్చుకాని, లెటర్స్ విషయంలో మాత్రం వద్దు. సింపుల్‌గా కార్డు ముక్క చాలు క్షేమసమాచారాలతో. సాయీ నీకు తెలుసా! తల్లిదండ్రుల కోసం కార్డులు, స్నేహితులకోసం ఇన్‌లాండ్స్ ప్రేమికుల కోసం కవర్లు సృష్టించబడ్డాయి"

సాయి నవ్వి పేజీలు తిప్పుతూ ఒకచోట ఆగితే ఆ ఫోటో చూసి చెప్పారు వేదమూర్తి. "వాళ్లు నా రెండవ కొడుకు సూర్యనారాయణ కూతుళ్లు చరిత, చకిత! మావాడు కూడా వాడి పేరు మోటుగా ఉందని "సురేష్" అని మార్చుకున్నాడనుకో! పెద్ద కొడుకు. అదే మీ కృష్ణమూర్తి బావ

కొడుకు వినీల్ , కూతురు వికిత! సరే- మీ వదిన అంటే నా కూతురు గౌరీమనోహరి పిల్లల పేర్లు తెలుసుకదూ! అర్పిత, ఆకృతి! ఏమిటీ పేర్లు చూస్తూ ఉంటే ఆశ్చర్యంగా ఉందికదూ! నిజమే తరాలతోపాటు వాటిల్లోనూ చాలా మార్పులొచ్చాయి. ఆ పేర్లకి అర్థం ఉండదు. కొన్నింటికి అసలు అర్థం ఏమిటో తెలుసుకోకుండా పెడతారు కొంత మంది! తెలిస్తే ఎంత వికృతంగా, అపహాస్యంగా ఉంటాయో అర్థం చేసుకోరు. అదేమంటే వెరయిటీ, లేటెస్ట్ ఫ్యాషన్! ఏమిటో ఎవరినీ నిందించలేము. అంతే" కొంచెం విరక్తి నిండిన స్వరంతో చెప్పారు.

ఇంతలో కాత్యాయని ఆ గదిలోకి వచ్చింది. "వంట అయింది! వడ్డించమంటారా? "

వేదమూర్తి అన్నారు. "ఆలస్యం ఎందుకు? వడ్డించేసేయ్. సాయి తిరిగి తిరిగివచ్చాడు. పెందరాళే తిని రెస్ట్ తీసుకుంటాడు"

ఇద్దరూ లేచి వంటింట్లోకి నడిచి భోజనాలకి కూర్చున్నారు.

వడ్డిస్తున్నంతసేపూ కాత్యాయని ఏవో కబుర్లు చెబుతూనే ఉన్నది. ఆడపడుచు సత్యవతికి పూల మొక్కలన్నా, వాటి పోషణ అన్నా ఎంత ఇష్టమో, సంఘటనలతో సహా వివరించి మరీ చెబుతూ ఆఖరున అన్నది. "మరే! మల్లె చెట్టు వాడిపోయినా- మళ్ళీ చిగురించాలంటే కింద నీరు పోయడంతోపాటు, పైన ఆకులు కూడా దూసిపోయాలి"

సాయికృష్ణ మనసులో అనుకున్నాడు. "అవును! కుటుంబ సభ్యుల మధ్యన సన్నిహితత్వం పెరగాలంటే- పరస్పరం ప్రేమాభిమానాలు పంచుకోవడంతోపాటు, అపోహలు, భ్రమలు, నిర్లక్ష్యం, అసూయలు మనసులోనుండి తొలగించుకోవాలి"

వేదమూర్తిగారు అడిగాడు. "ఉదయం నుండీ మా గురించే చర్చించాం! నీ విషయాలేమిటి సాయీ"

సాయికృష్ణ చిన్నగా నవ్వి చెప్పాడు. "అమ్మా-నాన్నల గురించి అమ్మ వ్రాసిన ఉత్తరం ద్వారా కొంత అవగాహనకు వచ్చి ఉంటారు. ఇక నా విషయం అంటారా! పెద్దగా చెప్పుకోడానికి ఏమీలేదు. కాకపోతే లైబ్రేరియన్‌గా చేరి మూడు సంవత్సరాలయింది. ఈ రోజుల్లో ఎవరూ పొందని జాబ్ శాటిస్‌ఫాక్షన్ నా వృత్తిలో నేను పొందుతున్నాను. మామయ్యా!''

భోజనాలు అయిన తర్వాత తువ్వాలుతో చేతులు తుడుచుకుంటూ చెప్పారు వేదమూర్తి. "ఈ పూటకి హాయిగా రెస్ట్ తీసుకో. రాత్రి కూర్చుని, ముందర ఎక్కడికి వెళ్ళాలి? ఎలా వెళ్ళాలి? అనేది ప్లాన్ చేద్దాం"

"ఏమిటీ- ప్లాన్ అంటున్నారు? " వక్కపొడి అందిస్తూ అడిగింది కాత్యాయని. చిన్నగా నవ్వి చెప్పారాయన. "రక్తసంబంధీకుల మధ్యన స్తంభించిపోయిన రాకపోకల కోసం బాంధవ్య బంధితుల సద్భావనా యాత్ర? "

కాత్యాయని నవ్వి, అర్థమయినట్లుగా తలూపి అన్నది "బాగుంది. ఈ కార్తీక మాసం మీకు మంచి కాలక్షేపం అన్నమాట"

గదిలో మంచం వేసుకుని సాయికృష్ణ పడుకున్నాడు. ప్రయాణపు బడలికతో ఉన్నాడేమో, పది నిముషాలలో మంచి నిద్రలో మునిగిపోయాడు.

**కాత్యాయని సాయంత్రం** నాలుగు గంటలకు నిద్ర లేపేవరకూ మెలుకువ రానేలేదు. లేచి 'టీ' తాగి, స్నానం చేశాక హాయిగా, ఫ్రెష్‌గా అన్పించింది. వేదమూర్తిగారు, సాయికృష్ణ- వాతావరణం ఆహ్లాదకరంగా

బాగుందని కాలక్షేపం కోసం పార్కుకి వెళ్ళారు.



గదిలో కూర్చుని, దాదాపు ఇరవయినిముషాల ఆలోచనల తరువాత వారి సద్భావనా యాత్రలో మొదటి మజిలీ నిర్ణయమయింది.

అది హైదరాబాదులో ఉంటున్న వేదమూర్తిగారి పెద్ద కొడుకు కృష్ణమూర్తి ఇంటికి!

ఆ రాత్రి పక్కలమీద పడుకున్నాక కృష్ణమూర్తి కుటుంబం గురించి టూకీగా చెప్పారాయన.

కృష్ణమూర్తి ఆంధ్రా బాంక్‌లో ఆఫీసరు! భార్య జానకి! వారికి ఇద్దరు పిల్లలు! పెద్దవాడు వినీల్ డిగ్రీ ఫైనల్ ఇయర్ చదువుతున్నాడు. వాడి తర్వాత వికిత! అది ఇంటర్ సెకండ్ ఇయర్ చదువుతోంది.

ఆయన చెప్పినదాని ప్రకారం- వినీల్‌కి మొదటినుండి ఇంటిపట్టు తక్కువ. స్నేహితులూ, షికార్లు ఎక్కువ! ఎక్కువగా బయట ప్రపంచంలోనే కాలక్షేపం చేస్తుంటాడు.

వినీల్ ప్రవర్తన గురించి కృష్ణమూర్తి, జానకి దిగులుపడుతూ ఉంటారని ఆయనకు తెలుసు.

వేదమూర్తిగారు చెప్పే విశేషాలు, కబుర్లు వింటూ మర్నాటి ప్రయాణం గురించి ఆలోచిస్తూ క్రమంగా నిద్రలోకి జారిపోయాడు సాయికృష్ణ.

* * *

మర్నాడు సాయంత్రం హైదరాబాదు చేరే సరికి దాదాపు అయిదు అవస్తోంది. కృష్ణమూర్తి వాళ్లు చిక్కడపల్లిలో అపార్ట్‌మెంట్‌లో ఉంటున్నారు.

అక్కడకు చేరేసరికి దాదాపు అయిదున్నర అయింది.

వాళ్లు ఉండేది సెకండ్ ఫ్లోర్‌లో.

కాలింగ్‌బెల్ మోతకు తెరుచుకున్న తలుపు అవతలనుండి వేదమూర్తిగారి పెద్ద కోడలు జానకి, "మీరా మామయ్యగారూ! రండి" అంటూ లోపలికి ఆహ్వానించింది.

ఆయన లోపలికి అడుగుపెట్టి అడిగారు "ఏమిటీ? ఇంకా కృష్ణ రాలేదా? "

"లేదండీ. వచ్చే టయిమయింది. కూర్చోండి అన్నట్లు..." అంటూ సాయికృష్ణ వైపు ప్రశ్నార్థకంగా చూస్తూ ఉంటే, వేదమూర్తిగారే నవ్వి పరిచయం చేశారు.

"మన సత్యవతి కొడుకు సాయికృష్ణ"

"ఏమిటీ? సాయికృష్ణే! ఇందాకటినుండీ అనుమానంగానే ఉన్నది, ఎక్కడో చూసిన మొహం అని. ఎంత ఎదిగిపోయాడు. ఎంత పెద్ద వాడయిపోయాడు? బావున్నావా సాయికృష్ణా!" ఆశ్చర్యంతో, ఆనందంతో పలకరించింది.

ఆ పలకరింపుకే సాయికి ఎంతో ఆనందం వేసింది.

ఫరవాలేదు. మరీ తను ఊహించుకొన్నంత అథమస్థాయిలో లేవు సంబంధాలు.

ఇంతలో-

వేదమూర్తిగారి పెద్ద కొడుకు కృష్ణమూర్తి కూడా వచ్చాడు.

"ఎవరూ! నాన్నగారే! ఏమిటీ విశేషం? చెప్పా పెట్టకుండా"

"కొడుకు దగ్గరకు రావాలంటే విశేషమే ఉండాలట్రా కృష్ణమూర్తీ" నవ్వుతూ వేదమూర్తిగారు అంటే, ఏం సమాధానం చెప్పాలో తోచనట్లుగా తలగోక్కుంటూ ఉండిపోయాడు కృష్ణమూర్తి.

జానకి అందుకుని అన్నది "ఏమండీ! ఈ అబ్బాయి ఎవరో గుర్తుపట్టారా? మీ సత్యవతి అత్తయ్య కొడుకు"

"ఎవరూ? సాయికృష్ణే" సాయికృష్ణవైపు చూస్తూ ఆశ్చర్యాన్ని ప్రకటించాడు కృష్ణమూర్తి.

వేదమూర్తి అన్నారు, "వాడిని చూసి మనమెంత ఆశ్చర్యపోతున్నామో, మనల్ని చూసి సాయి అంతకంటే ఎక్కువగా ఆశ్చర్యపోతున్నాడు. చిన్నప్పుడు వాడిని ఎత్తుకు మోశాం. మనకి కొంత కాకపోతే కొంతయినా గుర్తు! కాని సాయికి మనంతట మనం ఫలానా అని పరిచయం చేసుకుంటే తప్ప ఎవరెవరో అర్థం కాదు!"

"నిజమే మరి" అన్నాడు కృష్ణమూర్తి.

కృష్ణమూర్తి వయసు నలభయిమూడు. ముఖంలో ఆ ఛాయలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. చెంపలు, గడ్డం నెరిశాయి. కళ్ల కింద నల్లటి చారికలు కన్పిస్తున్నాయి.

లోతుగా ఉన్న అతని కళ్లు ఏదో ఆలోచిస్తున్నట్లుగా ఉంటాయి.

వచ్చి ఇంతసేపు అయింది. కన్నతల్లి గురించి అడుగుతాడేమోనని ఆశించారు వేదమూర్తిగారు! ఆఖరుకి ఆయనే గుర్తుచేయక తప్పలేదు. "మీ అమ్మ నిన్ను, కోడలిని, పిల్లల్ని అందరినీ అడిగానని చెప్పమన్నదిరా!"

అప్పుడు గుర్తుకొచ్చినట్లు, రవంత తత్తరపాటుతో అడిగాడు కృష్ణమూర్తి.

"ఓహ్! అన్నట్లు అమ్మ ఎలా ఉన్నది? కులాసానా?"

అక్కడే ఉన్న జానకి కూడా అడిగింది, "అత్తయ్యగారిని కూడా తీసుకురాలేపోయారూ?"

వేదమూర్తిగారు పేలవంగా నవ్వి అన్నారు, "వయసులో ఉన్న మీరే మన ఇంటికి రావడం తగ్గిస్తే- ముసలివాళ్ళం ఈ రైళ్లల్లో, బస్సుల్లో పడి ఎలా వస్తాంరా? మీ అమ్మకి అసలే నడుం నొప్పి. మీరు వచ్చి ఎన్నాళ్ళయింది? చెప్పండి?"

కృష్ణమూర్తి దొరికిపోయినట్లుగా ముఖం పెట్టి, భుజాలు తడుముకుంటూ, మొహమాటంగా నవ్వి అన్నాడు, "ఎక్కడ నాన్నగారూ! క్షణం తీరిక ఉండటంలేదు! బిజీ! ఫుల్ బిజీ"

వెంటనే హింట్ దొరికినట్లుగా అందుకున్నది జానకి, "పిల్లలకి సెలవుల్లో కూడా ట్యూషన్లు, కోచింగులు- వాళ్లకు చేసుకోవడం చేతకాదు. ఇరవయినాలుగు గంటలు కనిపెట్టుకు ఉండక నాకు తప్పదు"

వేదమూర్తిగారికి ఇక సంభాషణ పొడిగించడం ఇష్టం లేనట్లుగా టాపిక్ డైవర్ట్ చేశారు. "వీళ్ళేరీ? వినీల్! వికితా! కాలేజి వదిలేసి ఉంటారుకదా!"

కృష్ణమూర్తి చెప్పాడు, "వికిత వచ్చే టయిమ్ అయింది. వినీల్ వచ్చేసరికి ఏ రాత్రో అవుతుంది. మాకు మామూలే" 'ఏ రాత్రో అవుతుంది' అంటున్నప్పుడు కృష్ణమూర్తి కళ్లల్లో కదలాడిన నీలినీడలు సాయికృష్ణ దృష్టిని దాటిపోలేదు. అంతసేపు అక్కడే షోకేస్ దగ్గర నిలబడ్డ జానకి

దీర్ఘంగా నిట్టూర్చి వంటింట్లోకి వెళ్ళిపోయింది.

వేదమూర్తిగారు, సాయికృష్ణ సోఫాలో కూర్చుంటే, వాళ్ల ఎదురుగా కుర్చీలో కూర్చున్న కృష్ణమూర్తి షూస్ విప్పి పక్కన పడేస్తూ అడిగాడు.

"సాయీ! ఎలా ఉన్నావు? ఏం చేస్తున్నావు? అత్తయ్య, మామయ్య ఎలా ఉన్నారు? మీ కబుర్లు అసలు తెలియడంలేదని ఎప్పుడూ అనుకుంటూ ఉంటాం. మీరు జగిత్యాలలో ఉన్నంతవరకు నాకు తెలుసు. అప్పుడు నువ్వు సెవెంత్‌క్లాస్ చదువుతున్నావనుకుంటా!"

సాయికృష్ణ కొంచెం కదిలి చెప్పాడు. "ప్రస్తుతం ఏలూరులో ఉంటున్నాం. నాన్నగారి హెల్త్ అంతగా బాగుండకపోవడంతో ఇంటి దగ్గరే రెస్ట్ తీసుకుంటున్నారు. ఎక్కువగా లీవ్‌లోనే ఉంటున్నారు. అమ్మ ఆరోగ్యం కూడా ఈమధ్యన అంతగా బాగుండలేదు. నేను లైబ్రేరియన్‌గా చేస్తున్నాను. ఏలూరులోనే!"

"వెరీగుడ్! మొత్తానికి మనం కలిసి చాలా సంవత్సరాలే అయింది" అని బాత్‌రూమ్‌లోకి వెళ్ళి కాళ్ళూ, చేతులు, ముఖం కడుక్కొని టవల్‌తో తుడుచుకుంటూ వచ్చేలోగా జానకి ముగ్గురికి టీ కలిపి ట్రేలో పెట్టుకుని తీసుకువచ్చి వాళ్ళ ఎదురుగా టీపాయ్ మీద పెట్టి అడిగింది.

"మామయ్యగారూ! స్నానానికి నీళ్లు పెట్టమంటారా? "

"ఒక్క గంట ఆగి చేస్తామమ్మాయి! ఈ లోపల పిల్లలు కూడా వస్తారు" అని ఆయన అంటుండగానే తలుపు తోసుకుని వికిత వచ్చింది.

లోపలికి అడుగుపెడుతూనే, చెప్పులను ఓ మూలకు విసిరి చేతిలోని బుక్స్‌ని నిర్లక్ష్యంగా, గిరవాటు వేసినట్లుగా పక్కనే ఉన్న టేబుల్‌మీదకి పడేసింది.

సాయికృష్ణ ఆ అమ్మాయిని పరిశీలనగా చూడసాగాడు.

మోకాళ్లవరకూ ఎర్రగళ్ల మిడీ? మెడలో గవ్వలు, నత్తగుల్లలతో చేసిన ఓ తమాషా అయిన గొలుసు, చెవులకు గాజులంత రింగులు, ముందరివైపు కట్ చేయడంవలన, ఫ్లవర్‌వాజ్‌లోని కాడలకు మల్లె నుదుటిమీదకి పడుతున్న చిన్న చిన్న వెంట్రుకలు, వెనక్కి విరిచి కట్టిన పోనీటెయిల్, నీట్‌గా ట్రిమ్ చేసిన కనుబొమలు, పెదాలకి నేచురల్ షేడ్ లిప్‌స్టిక్, ముక్కుమీదకి మాటిమాటికి జారుతున్న కళ్ళజోడు, మోచేతులవరకు ఉన్న ఎర్రటి సన్నగళ్ళ బ్లౌజు, గాజులు లేక బోసిగా ఉన్న చేతులు!

పదహారేళ్ళ వికిత మంచి తెలుపురంగులో ఉన్నా, నుదుట బొట్టు లేకపోవడంతో, అందమంటూ ఏదయినా ఉంటే, ఆ కాస్తా తెలిపోయినట్లుగా అన్పిస్తోంది!

వికిత వస్తూనే సోఫాలో కూర్చున్న వేదమూర్తిగారిని చూసి "హాయ్! గ్రాండ్‌పా!" అంటూ విష్‌చేసి పక్కనే ఉన్న సాయికృష్ణవైపు కొత్తగా చూస్తూ ఉంటే వెనక నుండి జానకి పరిచయం చేసింది.

"నమస్తే! నా పేరు సాయికృష్ణ!" చేతులు జోడించి అన్నాడు సాయి!

"హాయ్! ఐయామ్ వికిత" కనుబొమలు ఎగరేసింది!

వాళ్ళ పరిచయాలు చూసి వేదమూర్తిగారు మనసులోనే నిట్టూర్చారు. నిజానికి వాళ్ళిద్దరూ ఊహవచ్చాక ముఖాముఖి కలవడం ఇదే ప్రథమం! వాళ్ళు ఎవరికి ఎవరు ఏమవుతారో, వారి మధ్యనున్న రిలేషన్‌షిప్ ఏమిటో వారికి తెలియదు.

వికిత తల్లి ఇచ్చిన టీ తాగి, సరాసరి బాత్‌రూమ్‌లో దూరింది! పది నిముషా

లలో స్నానం చేసి ఫ్రెష్‌గా తయారయి, పల్చటి నైటీ ధరించి వచ్చి హాల్లో తండ్రిపక్కనే కూర్చుని రిమోట్‌తో టి.వి. ఆన్‌చేసింది. మళ్ళీ లేచి వెళ్ళి ఛానల్స్ మార్చి స్టార్ టి.వి. పెట్టింది.

అలా లేచి వెళ్ళి అటువైపు తిరిగి, ఛానల్స్ మారుస్తుంటే, పల్చటి నైటీలోనుండి నల్లటి బ్రాబెల్ట్ స్పష్టంగా కనిపిస్తోంది.

ఆ డ్రస్‌లో కూతురుని ఎపుడూ చూస్తూ ఉండటంతో, కృష్ణమూర్తికి ఏమీ అన్పించలేదు కాని వేదమూర్తిగారు మాత్రం మనసులో బాధపడ్డారు!

"భగవంతుడా! సిగ్గువిడిచి ఏమిటీ కాలం పోకడ? "

సాయికృష్ణ మొట్టమొదటిసారిగా ఇబ్బందిగా, అనీజీగా సోఫాలో అటూ ఇటూ కదిలాడు!

జానకి వంటింట్లో వంట ప్రయత్నంలో పడింది!

కొడుకుతో, మనవడు, మనవరాలితో, కోడలితో కలిసి అందరూ సరదాగా కబుర్లు చెప్పుకోవాలని, ఏవేవో విశేషాలు వల్లెవేయాలని, ఒక్కసారి పాత కబుర్లన్నీ తిరగతోడాలని, చాలా కాలం తర్వాత కలుసుకున్న కొడుకుతో ఎన్నో విషయాలు పంచుకోవాలని ఉవ్విళ్ళూరుతున్న ఆయన మనసుకి తమ బంధాలు, అనుబంధాలను కలిపే తన ప్రయత్నం గురించి, తమ కుటుంబాల మధ్యన ఉన్న బాంధవ్యాలను మళ్ళీ పటిష్ట పరచాలనే తన ఆశయం గురించి, నెమ్మదిగా ప్రారంభించి, అర్థమయ్యేలా వివరించాలని రకరకాల భావోద్వేగాలకి గురి అవుతున్న సాయికృష్ణ కోరికలకు కళ్ళెంవేస్తూ స్టార్ టి.వి. ప్రోగ్రామ్స్ మొదలయినాయి.

దాదాపు అర్ధనగ్నంగా ఉన్న యువతీయువకులు కేరింతలు కొడుతూ, అంగాంగ ప్రదర్శనలతో, పాప్ మ్యూజిక్ పేరుతో, అసభ్యకరమయిన భంగిమలతో, విచ్చలవిడిగా, విశృంఖలంగా నాట్యాలు చేస్తున్నారు. శరీరాల ఎరుపులతో, కౌగిలింతలతో, పొర్లింతలతో- అశ్లీలం పొంగిపొర్లుతోంది.

ఆ అశ్లీలాన్ని భరించలేనట్లు, వేదమూర్తిగారు చటుక్కున కళ్ళు మూసుకున్నారు. నుదుటి మధ్యన ఉన్న కుంకుమ స్థానంలో పరమేశ్వరుని ప్రతిష్టించుకుని, ఏకాగ్రత కుదుర్చుకోడానికి విశ్వప్రయత్నం చేయసాగారు.

సాయికృష్ణ టి.వి.వైపు నిర్వికారంగా చూసి, రెండు నిముషాల అనంతరం తల తిప్పి తండ్రీకూతుళ్ళవైపు చూశాడు.

కృష్ణమూర్తి ఆ అశ్లీల దృశ్యాలు చూస్తూ ఎంతగా ఎంజాయ్ చేస్తున్నాడో, అంతే ఉత్సాహంతో అతని పదహారేళ్ళ కూతురు మ్యూజిక్‌కి అనుగుణంగా పాదంతో నేల మీద తాటిస్తూ ఎంజాయ్ చేస్తోంది!

దాదాపు ఇరవయి నిముషాలతర్వాత ఆ ప్రోగ్రామ్ అయిపోయింది! అపుడు లేచి, వికిత వంటింట్లోకి వెళ్ళింది!

కృష్ణమూర్తి కూడా లేచి, అక్కడే గోడకు తగిలించి ఉన్న బాట్ తీసుకుని "నాన్నగారూ! ఇపుడే గంటలో వచ్చేస్తాను! రోజూ షటిల్ ఆడటం అలవాటు. ఈలోపు మీరు రెస్ట్ తీసుకోండి" అంటూ తన డ్యూటీ అయిపోయినట్లుగా స్లిప్పర్స్ వేసుకుని టప్‌టప్ మని శబ్దంచేసుకుంటూ వెళ్ళిపోయాడు!

రెస్ట్! రెస్ట్!

ఎందుకు రెస్ట్?

తప్పించుకోడానికి, ఆమాట ఒక సాధనం కాకపోతే ఎంతసేపు రెస్ట్?

తండ్రికి కొడుకు సమక్షంలోనే రెస్ట్. అతని సాన్నిహిత్యంలోనే అన్నీ మర్చిపోతాడని ఎపుడు తెలుసుకుంటావు కృష్ణా! మనసులోనే బాధపడ్డారు వేదమూర్తిగారు.

కాందిశీకుల్లా లాడ్జింగ్‌లో దిగిన ప్రయాణీ

# పారిన ముత్యాలు

★ ఈ ప్రపంచములో ఒంటరిగా పోరాడేవాడే అత్యంత బలమైన వ్యక్తి

-హెన్రిక్ ఇబ్సన్

★ ద్వేషమనేది తీర్పులేని ఒక అభిప్రాయము.

- ఓల్టేర్

★ కష్టించి పనిచేసే ప్రజలున్న దేశమే సంపన్నమైన దేశము

-థియోడర్ హెర్బల్

★ ఇతరులలో భయాన్ని ప్రవేశపెట్టేవాడు నిత్య భయస్థుడు

-గ్లాడియన్

★ మనము చేసే తప్పులకు ఇచ్చే పేరే అనుభవము

-ఆస్కార్‌వైల్డ్

★ లెక్కింపలేని జీవితాలయొక్క సారాంశమే చరిత్ర (హిస్టరీ)

-థామస్ కార్‌లీ

★ మనుషులు చేసే తప్పొప్పులను కోరికలే ప్రోత్సహిస్తాయి

- బెర్ట్రాండ్ రసెల్

★ ఇరవయ్యవ శతాబ్దములో మనిషి యొక్క పాత్ర నిత్యవ్యాకులత

-నార్మన్‌మెయిలర్

★ ఎప్పుడయితే స్వాతంత్ర్యము లైసెన్సు సంపాదించుకుంటుందో అప్పుడే నిరంకుశాధికారము దగ్గరపడిందన్నమాటే

-విల్‌డ్యూరంట్

★ ఒకజాతి లేక మనిషి యొక్క ఉన్నతికి అవరోధమే అతృప్తి

-ఆస్కార్‌వైల్డ్

★ వందమంది ఫాదర్‌లకంటే ఒక ఉత్తమ ఉపాధ్యాయుడివల్ల ఎంతో ఉపయోగం ఉంటుంది

-థామస్‌పెయిన్

★ వివాదంలో ఒక మూర్ఖుడితో వాదించి గెలవటం కష్టం

-విలియం.జి.మెకాదో

★ బ్యాలెట్ పత్రము లేని ఓటర్, బుల్లెట్సులేని తుపాకిపట్టిన సిపాయిలాంటివాడు

-ఐసెన్ హోవర్

★ అపవాదు నరమాంసభక్షణకంటే చెడ్డది

-సెంట్‌జాన్‌క్రిసోస్టన్

సేకరణ: అద్దేపల్లి రాంబాబు




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

**ఆగస్ట్** చతుర నవల **మల్లెపందిరి**

..........................................................................

**సమీక్షకుని పేరు :** ..........................................................................

**చిరునామా :** ..........................................................................

..........................................................................

..........................................................................

..........................................................................

కుల్లా ఇద్దరూ రాత్రి ఎనిమిదింటివరకూ ఆ సోఫాలోనే గడిపారు!

జానకి వంటింట్లో వంట పనిలో నిమగ్న మయింది! మధ్యలో వచ్చి, ఇద్దరికీ నీళ్ళు పెడితే, ఇద్దరూ స్నానాలు చేశారు.

వికిత తల్లికి వంటపనిలో ఓ పదినిము షాలు సాయంచేసి, మళ్ళీ వచ్చి టి.వి. ఆన్ చేసి ఎదురుగా కూర్చుని ఏవో క్లాసు పుస్త కాలు తీసుకుని నోట్స్ ప్రిపేర్ చేస్తూ కూర్చుంది!

టి.వి. చూస్తూ, మధ్యమధ్యలో చదువు మీద దృష్టి నిలుపుతూ మొత్తంమీద అరగం టసేపు కాలక్షేపం చేసింది!

దాదాపు ఎనిమిదిగంటల ప్రాంతంలో చెమటలు కారుకుంటూ వచ్చిన కృష్ణమూర్తి, బాట్ మూలన తగిలించి, బాత్‌రూమ్‌లో దూరి, స్నానంచేసి వచ్చాడు!

ఈ లోపల జానకి డైనింగ్ టేబుల్‌మీద అన్నీ సర్దింది.

నిజానికి కిచెన్‌లో స్పేస్ ఉన్నా, డైనింగ్ టేబుల్ హాల్లోనే టి.వి. కన్పించేలా గోడవా రగా వేశారు!

డైనింగ్ టేబుల్‌కి ఎదురుగానే ఎటాచ్డ్ టాయిలెట్ ఉంది.

జానకి వేదమూర్తిగారిని, సాయికృష్ణని భోజనానికి పిలిచింది!

వికిత "నాకు ఆకలిగా లేదు, నేను ఇపుడే తినను" అంటూ వెళ్ళి టి.వి. ఎదురుగా సోఫాలో కూర్చుండిపోయింది!

కృష్ణమూర్తి లేచి వచ్చాడు!

ఆ వాతావరణం వేదమూర్తిగారికి ఇబ్బం దిగా అన్పిస్తోంది!

సాయికృష్ణకి మొహమాటంగా తోస్తోంది!

తను చెప్పాలనుకుని వచ్చిన కారణం వేరు! ఇక్కడి వాతావరణం వేరు! తనను చూడగానే కృష్ణమూర్తి బావ, జానకి అక్క చెప్పలేని ఆనందంలో మునిగిపోయి, తన చేయి వదలరని,

వినీల్, వికిత తనను ఒక్క క్షణం కూడా వదలకుండా ఎన్నెన్నో కబుర్లు, విశేషాలు చెబుతూ తనని వదిలిపెట్టరని,

కొన్ని సంవత్సరాల తర్వాత కలయికతో ఒకవిధమయిన పండుగ వాతావరణం నెల కొంటుందనీ,

ఎన్నెన్ని ఊహించుకున్నాడు తను? కాని ఇలా అయిందేమిటి?

ఏమిటో అంతా యాంత్రికంగా, అదేదో డ్రమటిక్‌గా జరిగిపోతోంది! అసలు మాటలు రానట్లుగా నోరు పడిపోయిన ట్లుగా ఇలా అయిపోయాడేమిటి తను? అనుకుంటూ లోలోపలే మధనపడసాగాడు సాయికృష్ణ! అప్పటికీ బలవంతాన నోరు పెకలించుకుని అన్నాడు, "వినీల్‌ని కూడా రానీయండి! అందరం కలిసి భోజనాలు చేయవచ్చు"

"వాడికోసం చూస్తే తెల్లవారుతుంది మీరు చేయండి" చెప్పింది జానకి!

కృష్ణమూర్తి, సాయికృష్ణ, వేదమూర్తిగారు డైనింగ్ టేబుల్‌ముందు కూర్చున్నారు! వాళ్ళకి కుడివైపుగా టి.వి. ఉన్నది.

స్టార్ టి.వి.లో ఏదో ఇంగ్లీషు పిక్చర్ వస్తోంది! దానిలో విలన్ పెద్ద శాడిస్టు! రక్తం చూసి రెచ్చిపోతుంటాడు! ఎదుటి మనిషి చెవి కొరికి, చేయి నరికి రక్తం ధారలై ప్రవహిస్తుంటే ఆనందపడిపోతూ ఉంటాడు! దానితో సినిమా మొదలయినది మొదలు రక్తం ఏరులై ప్రవహిస్తోంది!

వికిత అయితే సర్వప్రపంచాన్ని మరిచి పోయి, ఆ సినిమాలో లీనమైపోయి, విపరీ తంగా ఎంజాయ్ చేస్తోంది!

కృష్ణమూర్తి పరిస్థితి కూడా అదే! దృష్టి సినిమామీద, చెయ్యి కంచంలో అన్నాన్ని కెలుకుతోంది.

ఎటొచ్చీ వేదమూర్తిగారికి భోజనాల ముందు ఆ దృశ్యాలు చూస్తుంటే కడుపులో చేయిపెట్టి దేవినట్లుగా ఉంది! తల తిరుగుతున్నట్లుగా అన్పిస్తోంది!

తృప్తిగా భుజించిన తర్వాత ఆరుబయటకు వచ్చి చూస్తే కన్పించే, వెండి జాబిలి, పండువెన్నెల!, వేలవేల తారకలు వాళ్ళకి తెలియదు! ఎందుకంటే ఆరుబయట అసలే లేదు. కనీసం ప్రకృతిని ఆస్వాదించాలనే ఆలోచనే లేనతంగా అశ్లీలానికి కట్టుబడిపోయారు.

'ఉషోదయం' అంటే తెలియదు! టి.వి. చూసిచూసి అలసిపోయి, బరువెక్కిన కళ్లతో, అర్ధరాత్రి ఏ పన్నెండింటికో నిద్రలోకి జారిపోయి, ఉదయం లేచేసరికి ఎనిమిది దాటుతుంది.

"సంజెవేళ, గోధూళివేళ" అసలే తెలియదు! కేటాయించాల్సిన సమయం చదువుకు కేటాయించక పోవడంవలన ఆ సమయంలో ట్యూషన్స్‌తో గడుపుతూ ఉంటే,

ఇక ఈ మనుష్యులకి ప్రకృతి ధర్మాలు ఎలా తెలుస్తాయి? కళాత్మక దృష్టి ఎలా అలవడుతుంది? అంతా వికృతి- వికృతమే తప్ప!

తల్లి తిని లేవగానే హఠాత్తుగా అపుడు ఆకలి గుర్తుకొచ్చినట్లుగా సోఫాలోనుండి లేచిన వికిత, గబగబా డైనింగ్ టేబుల్ దగ్గరకు వెళ్ళి, కంచంలో హడావిడిగా అన్నం కూర వడ్డించుకుని, ఆ కంచం చేతితో పట్టుకుని, ఇవతలకు వచ్చి టి.వి. చూస్తూ నిల్చుని తినసాగింది!

ఆ దృశ్యం చూస్తూనే తెల్లబోయారు వేదమూర్తిగారు.

అలా కంచం చేత్తో పట్టుకుని, నిల్చుని భోజనం చేయడం ఫ్యాషనో, అతి తెలివో అర్థంకాలేదు ఆయనకు!

మిగతా వాళ్ళకేమో కాని ఆ క్షణంలో ఆయనకి మాత్రం అలా తెల్లటి, పల్చటి నైటీలో, విరబోసుకున్న జుట్టుతో, కళ్ళు పెద్దవి చేసుకుని టి.వి.నే చూస్తూ, నిల్చుని కంచం చేతిలో పట్టుకుని , గబగబా అన్నం నోట్లో కుక్కుకుంటూ, ఏవో కొంపలు మునిగిపోతున్నట్లు హడావిడిగా మింగేస్తున్న వికితను చూస్తుంటే జడలు విరబోసుకుని ఆవు రావురని నరమాంసాన్ని తింటున్న పిశాచమో, దయ్యమో అన్పించింది!

"అదేం తిండి? అదేం పద్ధతి? " అని తండ్రి మందలించలేదు.

"అసలు- ఒక్కతివే ఎందుకు? కలిసి తినాల్సిందే"నని అంతక్రితం తల్లీ ఒత్తిడి చేయలేదు!

ఎవరి దారి వారిది! ఎవరి బ్యాచ్ వారిది!

ఇక ఆ కుటుంబంలో కలిసికట్టుతనం ఏమి ఉంటుంది?

కంచంలో సగం అన్నం వదిలేసి, దానిలోనే చెయ్యి కడుక్కుని, ఆ కంచం టేబుల్ మీద పడేసి, ఉత్సాహంగా పరిగెత్తుకుంటూ వెళ్ళి టి.వి. ముందు కూర్చుంది.

అప్పటికి సినిమా క్లైమాక్స్‌కి చేరింది.

కంచాలు సర్ది, టేబుల్ తుడుస్తున్న జానకిని అడిగాడు సాయికృష్ణ "వినీల్ ఎన్నింటికి వస్తాడు? భోజనం ఎపుడు చేస్తాడు? "

క్షణంసేపు మౌనంగా ఉండి. తర్వాత కొంచెం భారంగా చెప్పింది. "ఏమో అది వాడికే తెలియాలి! బయట స్నేహితులతోనే సరిపోతుంది! ఒక్కోసారి వచ్చేసరికి అర్ధరాత్రి కూడా అవుతుంది! అపుడు ఇష్టమయితే తింటాడు! బయటే తినివస్తే అదీ లేదు!"

"మరి వండినదంతా వేస్ట్‌కాదా!"

"ఏం చేసేది? చద్ది అన్నం తినే అలవాటు మా యింట్లో ఎవరికీలేదు! రోజువిడిచి రోజూ మిగిలినదంతా పనిమనిషికి

పడేయడం మాకు అలవాటే"

ప్రస్తుత రోజుల్లో బియ్యం, నిత్యావసర వస్తువుల ధరలు తలచుకుంటే గుండె గుభేల్‌మన్నది సాయికృష్ణకి! ముఖ్యంగా హైదరాబాదు లాంటి సిటీలో ఉంటూ మైగాడ్! ఇంత వేస్టేజా? అన్పించింది!

వెనకే వచ్చి నిల్చున్న వేదమూర్తిగారు అడిగారు "అసలు అందరూ కలిసి తింటే ఈ సమస్యే ఉండదుగా!"

పేలవంగా నవ్వి అన్నది, "హు! అదే ఉంటే అనుకునేది ఏమున్నది? అలాంటి మంచి పనులు మా యింట్లో ఎపుడూ జరగలేదు! కనీసం ఆదివారాల్లో కూడా!" ఆశ్చర్యం ప్రకటించాడు సాయి!

విరక్తి నిండిన స్వరంతో చెప్పింది, "సరే మిగతా రోజుల్లోనే నయం! ఏదో సమయంలో ఇంటిపట్టున ఉంటారు! ఆదివారాల్లో అయితే పిక్నిక్‌లకని, బయటి పార్టీలకని, స్నేహితుల ఇళ్లల్లో విందులని అసలు కంటికే కన్పించరు!"

సాయి మాటలు రానట్లుగా ఉండిపోయాడు.

బాధగా నీలినీడలు కదులాడుతున్న కోడలు ముఖం చూసిన వేదమూర్తిగారు స్వగతంగా అన్నారు. "ఏమిటో! ఎంతో అభివృద్ధి చెందిన సైన్సు టెక్నాలజీ మనకు మంచే చేస్తోందో, చెడే చేస్తోందో నాకయితే అర్థంకావడంలేదు! అర్థం అయిందల్లా ఒకటే మనుషుల్లా మనసులు, మమతలు కూడా మెకానికల్ అయిపోయాయి. జీవితాలు ఇరుకయిపోయాయి"

వీళ్ళు ముగ్గురే, దూరంగా డైనింగ్ టేబుల్ దగ్గర నిల్చుని మాట్లాడుకుంటూ ఉండటం చూసిన కృష్ణమూర్తి అనుమానంగా, హడావిడిగా టి.వి. ముందునుండి లేచివచ్చాడు! తమ సంసారం గురించి భార్య ఏం చెప్పేస్తోందోనని అతని భయం! ఆవేశం వచ్చినా, ఆక్రోశం వచ్చినా జానకిని పట్టడం కష్టం!

తమ కాపురంలోని లొసుగులు ఎక్కడ బయటపడతాయో, పరువెక్కడ పోతుందోని మహాభయం కృష్ణమూర్తికి!

సినిమా అయిపోవడంతో టి.వి. ఆఫ్‌చేసి వికిత కూడా వచ్చింది.

"ఏమ్మా! ఈ రోజుకి రెస్ట్ మనకా? టి.వి.కా? " నవ్వుతూ అడిగారు వేదమూర్తి.

గలగలా నవ్వింది వికిత "మళ్ళీ గంటకి హిందీ సినిమా ఉంది తాతయ్యా!"

"అదికూడా చూస్తావా? " హడలిపోయి అడిగారాయన.

"మీరు చెబితే నమ్మరు తాతయ్యా! నేను టి.వి. చూసే హిందీ నేర్చుకున్నాను. తెలుసా? " గొప్పగా చెప్పింది.

"అంతకంటే ఎక్కువే నేర్చుకున్నావు తల్లీ" అనుకున్నారాయన మనసులో!

అది టూ బెడ్‌రూమ్ అపార్ట్‌మెంట్! హాలుకి కుడివైపు ఒక బెడ్‌రూమ్ ఉన్నది! దాని తలుపు బార్లా తీసి ఉంది! లోపల డబల్ కాట్స్ గది అంతా ఆక్రమించి ఉన్నాయి!

దాని పక్కనే టాయిలెట్స్ తర్వాత మరో బెడ్‌రూమ్ ఉన్నది!

అటువైపుగా నడిచిన సాయికృష్ణ చాలా క్యాజువల్‌గా ఆ గది డోర్‌హేండిల్‌మీద చెయ్యివేసి, మరుక్షణం ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవిచేసి, అప్రయత్నంగా పైకే అనేశాడు "ఇదేమిటి? ఈ రూమ్ లాక్ చేసి ఉన్నది? '

ఆ మాటలతో వేదమూర్తిగారు కూడా ఆశ్చర్యంగా చూశారు.

వికిత చెప్పింది "అది అన్నయ్య రూమ్. లాక్ ఎందుకు చేసి ఉన్నది? అని మీరు అనకూడదు! అడగకూడదు! ఎందుకంటే తలుపేసుకుని లోపల ఏం చేస్తుంటాడో,

ఏవేం ప్రయోగశాలలు ఉన్నాయో మాకే తెలియదు కనుక! అదొక అంతర్జాతీయ రహస్యం! అందుకే బయటకు వెళ్ళేటపుడు లాక్‌చేసి, 'కీ' తనతోనే తీసుకువెళతాడు! చెప్పాలంటే కాశీ మజిలీ కథలాగా ఈ రూమ్ గురించి తప్ప మిగతా ఏవయినా అడగండి"

వికిత యాక్షన్‌తో కలిపి చెప్పిన తీరుకి, సాయికృష్ణ నవ్వకుండా ఉండలేకపోయాడు! కృష్ణమూర్తి కూతురుమీద విసుక్కున్నాడు "విక్కీ! ఏమిటా మాటలు? చిన్నా పెద్దా లేకుండా"

వేదమూర్తిగారు అందుకుని అన్నారు, "పోనీలేరా! అన్నందుకు కాదుకానీ తెలుగులో కాశీమజిలీకథలు అనే గొప్ప సాహిత్యం ఉన్నదనే సంగతి గుర్తున్నందుకు చాలా సంతోషం వికితా!"

బలవంతంగా నవ్వాడు కృష్ణమూర్తి. "వినీల్ మొదటినుండీ అంతే నాన్నగారూ! అదోటైప్! త్వరగా ఎవరితోనూ కలవడు! రిజర్వ్‌డ్‌నెస్!" భార్యవైపు తిరిగి పురమాయించాడు. "జానకీ! పక్కలు ఏర్పాటు చేయి! పడుకుంటారు!"

టాపిక్ డైవర్టు చేయాలనే అతని తాపత్రయం గమనించనట్లుగా, బరువుగా చెప్పింది జానకి. "చెప్పుకుంటే సిగ్గుచేటు మామయ్యగారూ! వాడి ధోరణి ఏమిటో అర్థంకాదు! ఎపుడు వస్తాడో ఎపుడు వెళతాడో తెలియదు! వచ్చీ రావడంతోనే గదిలో దూరి తలుపేసుకుంటాడు. బయటకు వెళ్లేటపుడు తలుపు లాక్ చేసుకు వెళతాడు! వాడి భయమేమిటో అర్థం కాదు! చెల్లెలితో సరదాగా కబుర్లు చెప్పడంకాని, మాతో కలిసి కూర్చుని నాలుగు మాటలు చెప్పటం కాని ఏమీలేదు! ఎవరితోను కలవడు! మాట్లాడడు! అదో పెడధోరణి! మింగలేక, కక్కలేక భరిస్తున్నామంటే నమ్మండి!"

ఆనకట్ట తెగితే కంట్రోల్ చేయడం కష్టమని తెలుసు కృష్ణమూర్తికి. మధ్యలో ఆపడానికి ప్రయత్నిస్తే "అంతా మీవల్లే మీరేం పట్టించుకోరు" అని తనమీద విరుచుకుపడుతుందని తెలుసు.

అందుకే పేపరు తిరగేసే నెపంతో వెళ్లి సోఫాలో కూర్చుని, చెవులు ఇటుపడేసి పేపరుకి కళ్లప్పగించి కూర్చున్నాడు కృష్ణమూర్తి అనీజీగా.

వేదమూర్తిగారు కొడుకు ధోరణి పట్టించుకోలేదు! కోడలివైపు తిరిగి అడిగారు...

"మీరు చెప్పలేదా?, మందలించలేదా? కంట్రోల్ చేయలేదా? "

"ఎందుకు మందలించలా? వాడి ధోరణికి విసిగిపోయి ఒకసారి గట్టిగా అరిస్తే ఇంట్లోనుండి వెళ్లిపోయి బయట ఎక్కడో స్నేహితుల దగ్గర గడిపి నాలుగు రోజులకి మళ్లీ ఇల్లుచేరాడు! నాలుగు రోజులు ఏమయిపోయాడోనన్న బెంగతో, టెన్షన్‌తో నరకయాతన అనుభవించాము!"

"అసలు తలుపులు బంధించుకుని గదిలో ఒక్కడే ఏం చేస్తాడు? బాగా చదువుతున్నాడా? " ఆశ్చర్యపోతూ అడిగారు వేదమూర్తిగారు.

పేలవంగా అన్నది "ఏమో! ఆ భగవంతుడికే తెలియాలి! చదువంటారా? ఫీజులు కడుతున్నాము! పుస్తకాలకి డబ్బు ఇస్తున్నాము! కాలేజీకి వెళుతున్నానంటాడు! అంతవరకే తెలుసు! పుస్తకం పట్టుకుని చదవగా నాకంటితో నేనింతవరకూ చూడలేదు! అసలు మనిషి కంటపడితేగా? వాడికి నా చేత్తో అన్నంపెట్టి ఎన్నాళ్లయిందో నాకు గుర్తులేదు! ప్రేమగా మాట్లాడుకుని ఎన్ని నెలలయిందో తెలియదు! పగలయినా, అర్ధరాత్రి అయినా వాడు ఒక్కడే కూర్చుని పెట్టుకు తింటాడు! మేము ఎవ్వరం వడ్డించడానికి కూడా ఇష్టపడడు. ఏమిటో అలాగని మామధ్యన ఎలాంటి పోట్లాటలూ,

మాటపట్టింపులు లేవు!" కళ్లు చెమరుస్తుంటే చెప్పింది జానకి.

ప్రమాన్పడిపోయినట్లుగా చూడసాగాడు సాయికృష్ణ.

సోఫాలో కూర్చున్న కృష్ణమూర్తి పేపరు పక్కన పడేసి ప్రపంచ రహస్యాలు బయట పడి పోతున్నట్లుగా, ఖంగారుగా, విసుగ్గా అరిచాడు, "జానకీ! ఇప్పటికే లేటు అయింది. పక్కలు ఎరేంజ్ చేయి! పడుకుంటారు"

"ఆ! ఆ! వస్తున్నా!" అని పవిటచెంగుతో కళ్లు తుడుచుకుంటూ వెళ్లి, హాల్లో వికిత సహాయంతో రెండు మంచాలు వేసి పక్కలు వేసింది.

పక్కలు వేయగానే కృష్ణమూర్తి తృప్తిగా తలాడించి తండ్రివైపు తిరిగి అన్నాడు...

"ఇక నేను పడుకుంటాను నాన్నగారూ! రేపు బ్యాంకుకి ఎర్లీగా వెళ్లాలి! వర్క్ చాలా ఉంది" అంటూనే వికిత వైపు తిరిగి "విక్కీ! ఇక టివి ఆపేసేయ్!" అని అరిచి తమ బెడ్రూమ్‌లోకి వెళ్లాడు.

ఆ వెనుకే జానకి వెళ్లి తలుపువేసుకుంది.

డైనింగ్ టేబుల్ మీద అన్నింటిమీద మూతలు పెట్టి, కంచం గ్లాసు బోర్లించి ఉన్నాయి... వినీల్ వస్తే భోజనం చేయడానికి రెడీగా.

వికిత రోజూ టివి చూసి తర్వాత అలాగే సోఫాలోనే పడుకుని నిద్రపోతుందిట. వినీల్ తను ఆక్రమించుకున్న బెడ్రూమ్‌లో పడుకుంటాడు.

"ఏం సంసారమో!" అనుకుంటూ చిన్నగా నిట్టూర్చిన వేదమూర్తిగారు కనుకొలకుల్లోంచి మేనల్లుడివైపు చూస్తే సాయికృష్ణ చిన్నగా నవ్వుతున్నాడు.

"ఎందుకు సాయీ! నవ్వుతున్నావు? "

"ఏమో! నాకే తెలియదు! ఎందుకో నవ్వొచ్చింది!" నవ్వడం ఆపి చెప్పాడు! పక్కలు వేసే కార్యక్రమం అయిపోగానే వికిత రెండు అంగల్లో పరిగెత్తి సోఫాలో దిండు వేసుకుని, దానికి ఆనుకుని టివి సినిమా చూడటంలో లీనమయిపోయింది. అప్పటికే పది దాటుతోంది.

వేదమూర్తిగారు పలకరించారు "ఏమ్మా! నిద్ర రావడంలేదా? "

తాతయ్యను చూడటంతోనే వెంటనే లేచి టివి సౌండ్ తగ్గించి "లేదు తాతయ్యా! రోజూ నాకు అలవాటే! సినిమా చూసి కాని పడుకోను! మీరు పడుకోండి!" అతిగా చూడటం వలన ఎర్రబడి, కొంచెం ఉబ్బినట్లున్న కళ్లు పైకెత్తి చూస్తూ చెప్పింది! వెంటనే లైట్ తీసేసి సోఫాలో సెటిలయింది.

"భగవంతుడా! ఈ స్టార్ టీవీలనుండి సంసారాలని నువ్వే కాపాడాలి!" మౌనంగా ఆక్రోశించింది ఆయన మనసు! మౌనంగా నడిచివెళ్లి తనకు కేటాయించిన మంచం మీద నడుము వాల్చారు! నిద్రరాకపోయినా మనసు పరిపరివిధాలా పోతోంది. ఎంత విలువయిన సమయం! రమ్మన్నా తిరిగి రాని కాలం! చదువుకి ఎలాగూ కేటాయించడంలేదు! కనీసం భార్యాభర్త, తల్లీ కూతురు, తండ్రీకూతురు, ముగ్గురూ కొడుకుని కూడా కలుపుకుని ఎన్ని కబుర్లు చెప్పుకోవచ్చు? ఎంతటి ప్రేమను పంచుకోవచ్చు? తిరిగి రాని ఆ క్షణాల్ని ఎంత ఆనందంగా గడపవచ్చు?

ఆయన మనసులో కొట్టుమిట్టాడుతున్న భావాలేమిటో కొంతవరకూ అర్థం చేసుకోగలడు సాయి.

కాసేపటికి మెల్లగా ధ్యానం నుండి మేలుకుంటున్నట్లుగా కళ్లు తెరిచారు వేదమూర్తిగారు. తనవైపే చూస్తున్న సాయికృష్ణని చూసి అడిగారు. "ఏం సాయీ! నిద్రపట్టడం లేదా? "

"అహ! అదేంలేదు!"

"పడుకోబోయేముందు ఓ పదినిముషాలు మెడిటేషన్ చేయడం అలవాటు చేసుకో! దేహానికి మనసుకీ రెంటికీ మంచిది!"

"అలాగే మామయ్యా! కాని నాకు నిద్రప ట్టకపోవడమనే ప్రాబ్లెమ్‌లేదు"

"నీ గురించికాదు! జనరల్‌గా చెప్పాను! కాని సాయీ! ఈ రోజున నిద్రలేమితో బాధ పడుతూ స్లీపింగ్ పిల్స్‌ని ఆశ్రయిస్తున్న వాళ్ళ వేల సంఖ్యలో ఉన్నారు. ఎందుకో తెలుసా? తల్లితండ్రుల కళ్లముందు తిరు గుతూ పెరగాల్సిన కొడుకు చిన్నప్పుడే సెప రేట్ అయి వేరే రూమ్‌లో పడుకున్నపుడు, తల్లితండ్రుల సమక్షంలో వెచ్చగా ముడు చుకు పడుకోవాల్సిన కూతురు దూరంగా వేరే గదిలో ఏ అశ్లీల సాహిత్యం చదువు తూనో లేక ఏ లేట్‌నైట్ సినిమా చూస్తూనో పడుకున్నపుడు ఆ ఇంట్లో ఏ ఒక్కరికీ నిద్రపట్టదు! అది అంతే!"

సాయికృష్ణ తల తిప్పి చూశాడు.

టివి ప్రోగ్రాములు వస్తూనే ఉన్నాయి. అటు తిరిగి కొంచెం ఓరగా, సోఫాలో వాలి నట్లుగా పడుకోవడంతో వికిత మెలకువగా ఉన్నదో, నిద్రపోతోందో తెలియడంలేదు.

అపుడు దాదాపు పదకొండు దాటుతోంది!

దాదాపు ఓ పది నిముషాల తర్వాత...

బయట తలుపు కొడుతున్నట్లుగా టకటక శబ్దం అయింది.

సాయికృష్ణ తల తిప్పి చూశాడు. అప్ప టికే వేదమూర్తిగారు మంచం మీదనుండి లేచి కూర్చున్నారు.

వికిత గమనించినట్లు లేదు! లేవకుండా అలాగే ఉండిపోయింది.

వేదమూర్తిగారు పెద్దగా అన్నారు, "వికితా! మీ అన్నయ్య వచ్చినట్లున్నాడు చూడు! తలుపు శబ్దం అవుతోంది!"

వికిత బద్ధకంగా లేచి, ఒళ్లు విరుచుకుని "అబ్బా! కాలింగ్‌బెల్ నొక్కచ్చుగా!" అను కుంటూ తలుపువైపు నడిచింది.

సాయికృష్ణ కూడా ఉత్సాహంగా మంచం మీదనుండి లేచాడు! ఇద్దరూ వికిత వెనకే గుమ్మం దగ్గరికి నడిచారు.

వికిత తలుపు తెరిచింది.

వేదమూర్తిగారు, సాయి బయటకు చూశారు.

బయట నిలబడి ఉన్నాడు వినీల్!

ఇరవయి ఏళ్ల వినీల్! మనిషి కొంచెం బొద్దుగా, చామనఛాయలో ఉన్నాడు. నల్లటి మరకలతో ఉన్న జీన్స్‌లోకి, మురికిగా ఉన్న తెల్లషర్ట్ టక్ చేశాడు. అతని ముఖం నూనెలో ముంచినట్లుగా జిడ్డుకారుతోంది. జుట్టు చిందరవందరగా నుదుటిమీదకి పడు తుంటే దాని మధ్యనుండి ఎర్రగా ఉన్న అతని కళ్లు ఎటో చూస్తున్నాయి! కనుగుడ్లు చకచకా కదిలిపోతున్నాయి.

అతను లోపలికి అడుగుపెట్టగానే ఒక్క సారిగా బ్రాంది వాసన గుప్పుమని వచ్చింది.

ఒక్కసారిగా కంపించిపోయారు వేదమూ ర్తిగారు.

సాయికృష్ణ అయితే స్థాణువయినట్లుగా చూడసాగాడు!

కళ్లెదుట జరుగుతున్న ఈ పచ్చినిజాల్ని జీర్ణించుకోలేకపోతున్నారు ఇద్దరూ!

వికితకి అది మామూలే అన్నట్లుగా, అల వాటు అయినట్లుగా బద్ధకంగా తలుపు లోపలికి వేసి వెను తిరిగి తాతయ్యని, సాయికృష్ణని చూస్తూనే ఖంగుతిన్నట్లుగా తడబడింది. వాళ్ళ తనవెనుకే ఉన్నారనుకో లేదు.

అప్పటికే వినీల్ 'ఎవరీ కొత్త మొహాలు?' అన్నట్లుగా కళ్లు చిట్లించి విచి

త్రంగా చూస్తున్నాడు.

"వినీ! తాతయ్యా! అతను... అతను.. సాయికృష్ణ అని మన..." బంధుత్వం ఎలా చెప్పాలో తెలియక కంగారుపడింది వికిత.

"నమస్తే మన మధ్య ఉన్న బంధుత్వమే మిటో రేపు చెబుతాను! మీరు పడుకోండి!" అని సాయికృష్ణ తన మంచంవైపు నడిచాడు.

ఆ వెనుకే బరువుగా అడుగులు వేసుకుంటూ వచ్చారు వేదమూర్తిగారు! కళ్లారా చూసిన ఆ నిజాన్ని తట్టుకోలేనట్లుగా, ఆయన బుగ్గల్లోకి రక్తం చిమ్మి, ముఖం ఎర్రబడింది.

మౌనంగా మంచం మీద వాలిపోయారు.

ఆ క్షణాన ఆయనకు గుర్తుకు వచ్చింది భగవంతుడుకాదు! భగత్‌సింగ్!

ఆయన ప్రతి క్లాసులోనూ యువతకు స్ఫూర్తిగా ఉదహరించేది భగత్‌సింగ్‌నే!

వినీల్ తడబడుతూ తన గదివైపు నడిచి, జేబులోనుండి కీ తీసి లాక్ తీయడానికి విశ్వప్రయత్నం చేయసాగాడు.

ఆ హోల్‌లో అది సరిగ్గా ఇన్‌సర్ట్ కావడంలేదు! అతని చేతులు తడబడుతున్నాయి. శరీరం తూలుతోంది.

మంచం మీదనుండే సాయి అతనిని జాలిగా చూస్తూ ఉండిపోయాడు.

దాదాపు రెండు నిముషాల యుద్ధం తర్వాత విజయం సాధించాడు వినీల్! లోపలికి వెళ్లీ వెళ్లడంతోనే దభేల్‌మని తలుపేసుకున్నాడు.

దానికి ఇవతలగా ఉన్న గదిలో డబల్‌కాట్‌మీద పెళ్లి అయి ఇరవయి రెండేళ్లు అయిన కృష్ణమూర్తి, జానకి ఒకరి కౌగిలిలో మరొకరు ఆదమరచి గాఢంగా నిద్రపోతున్నారు. వికిత కూడా వెంటనే టివి ఆపేసి, అక్కడే సోఫాలో పడుకుని ముసుగుతన్నింది. ఎటొచ్చీ వేదమూర్తిగారికి, సాయికృష్ణకి ఆలోచనలతో కలత నిదురే అయింది.

ఎందుకో మధ్య రాత్రివేళ మెలుకువవచ్చి కళ్లు తెరిచి చూశాడు సాయికృష్ణ. వేదమూర్తిగారు మంచంమీదకూర్చుని గుండెలమీద చేత్తో రుద్దుకుంటూ ఆయాసపడుతున్నారు.

గబుక్కున లేచి "మామయ్యా! ఏమయింది?" ఖంగారుగా అడిగాడు.

ఏం లేదన్నట్లుగా తల అడ్డంగా తిప్పి చెప్పారాయన, "కంగారుపడ వలసినది ఏమీ లేదురా! అపుడపుడు ఏదయినా టెన్షన్‌కి గురి అయితే నాకిలా వస్తుంది. ఇపుడే టాబ్లెట్ వేసుకున్నాను. తగ్గుతోందిలే! నువ్వు పడుకో!"

సాయికృష్ణ చెమటలు పట్టిన ఆయన శరీరాన్నే చూస్తూ సాలోచనగా తన మంచంమీదకి చేరాడు.

కాసేపటికి ఆయన కూడా పక్కకు ఒత్తిగిల్లి పడుకున్నారు.



ఉదయం ఆరింటికల్లా లేచి బ్రెష్ చేసుకున్నారు ఇద్దరూ!

సోఫాలోనే ముసుగుపెట్టి గాఢనిద్రలో ఉన్న వికితని, వీపుమీద కొట్టీ కొట్టీ జానకి పదిసార్లు లేపగా, లేపగా బద్ధకంగా లేచి మళ్లీ గదిలోకి వెళ్లి పడుకుంది. జానకి పాల పేకెట్లు రాగానే ఇద్దరికీ టీ కలిపి ఇచ్చి వెంటనే తన వంట హడావిడిలో పడిపోయింది.

వేదమూర్తిగారు, సాయి సోఫాలోనే పేపరు చదువుతూ గడిపారు.

ఏడున్నరకి కృష్ణమూర్తి, ఎనిమిదింటికి వికిత నిద్రలేచి బెడ్‌టీ కప్పులు చేతితో పట్టుకుని నెమ్మదిగా సిప్‌చేస్తూ హాల్లోకి వచ్చారు.

కృష్ణమూర్తి అలవోకగా తలతిప్పి కొడుకు గదివైపు చూసి మళ్లీ తల తిప్పుకున్నాడు. ఆ ఒక్క క్షణంలోనే అతని ముఖం మాడిపోయింది.

తండ్రీ కూతుళ్లు ఇద్దరూ ఎదురుగా కుర్చీలలో కూర్చున్నారు.

నలుగురి మధ్యనా నిశ్శబ్దం!

కనిపించని చీకటి తెరలు!!

"ఇపుడెందుకు వచ్చారు? ఏమిటీ విశేషం? " అని అడగాలని ఉన్నది కృష్ణమూర్తికి.

"ఎన్నాళ్లు ఉంటారు? " మనసులో అనుకుంది వంటింట్లో ఉన్న జానకి! ఇరుకుగా ఫీలయింది వికిత.

సాయికృష్ణ కళ్లెత్తి మౌనంగా ఇద్దరినీ పరిశీలించాడు. వాళ్లని చూస్తుంటే తన ఉత్సాహం అంతా నీళ్లు జల్లిన పాల పొంగులా అయిపోతోంది.

అందరినీ కలుపుకు రావాలన్న తన ఆశయం అలా ఉంచి ఆ వాతావరణానికి, ఆ మనుష్యులకు తనే దూరంగా పారిపోవాలనిపిస్తోంది.

గట్టిగా కళ్లు మూసుకుని, మనసు కంట్రోల్ చేసుకోడానికి ప్రయత్నించసాగాడు. కాత్యాయని అత్తయ్య చెప్పిన మాటలే గుర్తుకొస్తున్నాయి. 'మల్లె చెట్టు మళ్లీ చిగురించాలంటే నీరు పోయడంతో పాటు, ఆకులు కూడా దూసేయాలి'

నిజమే ముందర తమ మధ్యన ఉన్న ఈ చీకటి తెరలను ఛేదించాలి! మరీ చిన్న పిల్లాడిలా మొదట్లోనే జావకారిపోకూడదు! పాజిటివ్ థింకింగ్‌వైపు దృష్టి మరల్చాలి.

మార్పు అనేది హఠాత్తుగా రాదు! అలవాటు చేయాలి. ఈ కృత్రిమ ప్రపంచం నుండి దూరంగా తీసుకు వెళ్లడానికి ముందర ఎంతో ఓర్పు, సహనం అవసరం!

సాయికృష్ణ ఆలోచనలు ఇలా ఉంటే వేదమూర్తిగారి ఆక్రోశం మరోలా ఉంది. ఆయన కళ్లు సూటిగా కొడుకునైతే చూస్తున్నాయికాని మనసు తీవ్రంగా పరితాపం చెందుతోంది.

'ఒరేయ్ కృష్ణా! ఎందుకురా అలా నా ముందు బలవంతంగా ముళ్లమీద కూర్చున్నట్లు కూర్చుంటావు? నా సమక్షంలో ఆముదం తాగిన మొహం పెడతావు ఎందుకురా? ఎందుకు? అలా ముడుచుకుపోయి పరాయివాడిలా ఫీలయిపోయి నన్ను పరాయివాడిని చేస్తావు? నేను నీ జన్మనిచ్చిన కన్నతండ్రినిరా! ఒకప్పుడు నా ఒడిలో ఎంత వెచ్చగా ఎంత హాయిగా, ఎంత భద్రతగా కూర్చునేవాడివో ఒక్కసారి గుర్తుకు తెచ్చుకో! ఒక్కమాట! ఒక్క పలుకు! నాన్నా నీ ఆరోగ్యం ఎలా ఉంది? అని కుశల ప్రశ్న వేశావా? మనసారా పలకరించావా? అశాశ్వతమయిన ఈ డబ్బు సంపాదనల వెంబడి ఎందుకురా ఈ పరుగులు? ఏనాడయినా నీ తల్లిని, తండ్రిని చూడాలనిపించిందా? మన యింటికి కాదుకాదు మా ఇంటికి వచ్చి ఎన్నాళ్లయింది? గుర్తు తెచ్చుకోరా! పొగడ చెట్టుగట్టు మీద కబుర్లు చెప్పుకొని, ఆరు బయలు వెన్నెల్లో అమ్మచేతి

భోజనం చేసి, ప్రేమ, ఆప్యాయతలు పంచు కుని ఎన్ని ఏళ్లు అయింది? అవునులే! తల్లి తండ్రులూ పిల్లల మధ్యన ఉండే అనిర్వచ నీయమయిన బంధం నీకెందుకు అర్థం అవుతుంది? పెళ్లికెదిగిన కూతురితో కలిసి అశ్లీలం ఎంజాయ్ చేసే స్థితికి దిగజారావు! పొరపాటున కన్న నీ కొడుకు ఎక్కడ ఉంటాడో, ఎలా ఉన్నాడో, ఏం చేస్తున్నాడో ఏ స్థితిలో ఎలాంటి పరిస్థితులలో పెరుగు తున్నాడో ఏనాడయినా గమనించావా? కంటికి రెప్పలా కాచావా? నీకెందుకు? ఆ అవసరం నీకెందుకుంది? నువ్వూ నీ భార్యా, మీ బెడ్‌రూమ్, నీ ఉద్యోగం, నీ సంపాదన, నీ షటిల్ నీ ప్రపంచమే సెప రేట్!'

"నాన్నగారూ! నాన్నగారూ!" మునిలా, మౌనంగా కళ్లు మూసుకుని కూర్చుండిపో యిన తండ్రిని చూస్తూ గట్టిగా పిలిచాడు కృష్ణమూర్తి.

నెమ్మదిగా కళ్లు విప్పి, అపుడు పెదవి విప్పారాయన. వంటింట్లో ఉన్న కోడలిని ఉద్దేశించి అన్నారు... "అమ్మా వినీల్‌ని కూడా నిద్రలేపు"

కంగారుగా జవాబిచ్చింది జానకి "ఎందు కులెండి! వాడు ఇపుడే లేవడు! వాడి మామూలు టైము పదకొండు!"

సాయికృష్ణ నిర్లిప్తంగా చూస్తూ ఉండిపో యాడు.

"పోనీ బంధువులు వచ్చారని లేపితే!" అన్నారు వేదమూర్తి.

వికిత అన్నది "వద్దులే తాతయ్యా! నిద్ర పోతున్నపుడు డిస్టర్బ్ చేస్తే ఊర్కోడు! అరు స్తాడు! గొడవచేస్తాడు! నానా హంగామా సృష్టిస్తాడు. మేనర్‌లెస్‌గా బిహేవ్ చేస్తాడు. అందుకే వదిలేశాం"

"వదిలేసారా? " ఆశ్చర్యంగా అన్నారు ఆయన. "వదిలేయడానికి వాడేమన్నా ఆవా? గేదా? "

కృష్ణమూర్తికి ఆ సంభాషణ ఇష్టంలేన ట్లుగా అసహనంగా చేతులు నలుపుకుంటూ తలవంచుకుని ఉండిపోయాడు.

కొన్ని క్షణాలసేపు నిశ్శబ్దం రాజ్యమేలింది ఆ హాల్లో!

ఏదో ముఖ్యమయిన విషయమని, జానకి కూడా వచ్చి నిల్చుంది.

క్షణంసేపు అందరివైపు తేరిపార చూసిన వేదమూర్తిగారు చెప్పారు, "కృష్ణా! ఎప్పటి నుండో అనుకుంటున్న మాటరా ఇది! ఆవే దనతో చెబుతున్నాను అర్థం చేసుకోండి"

సాయికృష్ణ తప్ప మిగతా ముగ్గురు ఆశ్చ ర్యంగా చూశారు ఆయనవైపు. "మీరు మేము పరాయివాళ్లంకాదు. నా కన్నకొడు కువి నువ్వు! నీ జీవితాన్ని పంచుకున్న భాగ స్వామి ఆమె! నీ రక్తం పంచుకున్న పిల్లలు వీరు! మనందరి మధ్యన విడదీయలేని విడ దీయరాని అద్భుతమయిన అనిర్వచనీయ మయిన, అపురూపమయిన రక్తసంబంధం ఉంది. అవునా! కానీ మనం అది మర్చిపో తున్నాం. మా సంగతి అలా ఉంచి కనీసం మీలో మీకే సరియైన అవగాహనలేదు.

కాని అసహజపు బలవంతపు నవ్వులతో ఎన్నాళ్లిలా?

తెలిసీ అంతో ఇంతో ఇంగిత జ్ఞానం ఉండీ మనల్ని మనమే దూరం చేసుకో వాలా? లేదు.

పైకి వెళ్లిన చక్రం మళ్లీ క్రిందికి దిగివ స్తుంది.

అందుకే, ముందర ఒకసారి అందరం కలవాలి! మన అందరి కలయికకు నాందీ ప్రస్తావనగా మన ఇల్లు, విజయవాడలో మన యిల్లే వేదికగా నిర్ణయించాను! అంత రించిపోతున్న అనురాగాలు, మల్లెపూలై విరి యాలి. అందుకు ఏం చేయాలి? మన మధ్యన రాకపోకలు, తెగిపోయిన కనెక్షన్స్

ఎలా పునరుద్ధరించాలి? అనే విషయాలు అక్కడే నిర్ణయిద్దాం! వినడానికి, చెప్పుకోడానికి ఇది అతిశయోక్తిగా అన్పించవచ్చు! కాని తప్పదు. ఈ విషయంలో కష్టమయినా, నిష్టూరమయినా అందరూ పాల్గొనక తప్పదు. ఈ ప్రయత్నం మనకోసంకాదు. మన పిల్లలకోసం. మన పిల్లల మధ్యన ఆరోగ్యకరమయిన వాతావరణం నెలకొల్పడంకోసం! కుటుంబం కలిసికట్టుగా ఉంటేనే సమాజం పటిష్టవంతంగా ఉండేది. మనం అందరం కలుసుకోవాలంటే ఏదో ఒక అకేషన్ ఉండాలిగా. అందుకే ఈ కార్తీక మాసం ఆఖరి సోమవారం మన ఇంట్లోనే కార్తీక సమారాధన, మన పెరడులోనే వన భోజనాలు ఏర్పాటు చేస్తున్నాను. ఇంత కంటే ప్రస్తుతం ఇంకా ఎక్కువగా చెప్పే పరిస్థితులలో లేను. కాని ఈ సమారాధనకి మీరు రాకపోతే మాత్రం జీవితాంతం ఒంటరితనంతో బాధపడవలసి ఉంటుంది. గుర్తుంచుకోండి!"

కృష్ణమూర్తి ఏదో చెప్పడానికి ముందుకు వంగబోయాడు.

అతని నోటినుండి మాటలు వచ్చే అవకాశం లేకుండా వెంటనే అన్నారు వేదమూర్తిగారు.

"వద్దు! సెలవు దొరకదని, కుదరదని, ఫుల్ బిజీ అని, నెలాఖరు కాబట్టి వర్క్ ఎక్కువని ఇలాంటి కుంటిసాకులు చెప్పడానికి ప్రయత్నించవద్దు. ఒక్క క్షణం ఆలోచించు. ఇంచుమించు- తన వయసు వాడే అయిన సాయికృష్ణ వెదుక్కుంటూ తన ఇంటికి వస్తే- 'వినీల్' తన దోవన, తన గదిలో పడుకున్నాడంటే నీకేమీ అన్పించడం లేదా? వాళ్ళ మధ్యన ఉండవలసిన 'బంధం' సరిగ్గా ఉండకపోవడం వలనే కదా? అది మన తప్పేగా!"

కృష్ణమూర్తి సమాధానం చెప్పలేనట్లుగా ఉండిపోయాడు.

జానకి అన్నది "ఇందులో ఆలోచించడానికి ఏమీలేదు మామయ్యగారూ! ఎప్పుడూ ఉండే పనులే! ఎప్పుడూ ఉండే బిజీవర్కే- మీరు చెప్పినట్లే వస్తాం. కాస్త ఈ ప్రపంచం నుండి రిలీఫ్‌గా ఉంటుంది"

"నేను కోరుకునేది అదేనమ్మా! మన వాళ్లను చూడటంలోనూ, మన వాళ్ల సమక్షంలో గడపటంలోనూ ఎంతో 'రిలీఫ్' ఫీల్ అవడంలోనే- అసలయిన ప్రేమ, అనురాగం దాగివున్నాయి. వాటిని బయటకు లాగాలనే మన ప్రయత్నం కూడాను. జానకీ! అడుగుతున్నానని అనుకోకు! మీ పుట్టింటికి వెళ్ళి ఎన్నాళ్లయింది? "

జానకి ముఖం నల్లబడి వెంటనే సమాధానం చెప్పలేకపోయింది. కొంచెం తడబడినట్లయి, నత్తిగా అన్నది. "చాలా రోజులయింది. అయినా ఏదీ పెళ్ళిపేరంటాల లాంటి సందర్భాలు ఏమీ కలిసిరాలేదు. పైగా ఎప్పుడూ బిజీ!" పకపకా నవ్వారాయన. "ఈ రోజున ప్రతివాడి ఊతపదం 'బిజీ!' అమ్మా జానకీ! తల్లితండ్రుల దగ్గరకు వెళ్ళాలంటే, పెళ్లి పేరంటం, సమయం సందర్భమే కావాలా? "

జానకి మాటలు రానట్లు మూగగా తల వంచుకున్నది.

"నీ తల్లిని కలవడమే ఒక పేరంటమమ్మా! నీ తండ్రిని కలవడమే ఒక సందర్భమమ్మా! నీ కుటుంబసభ్యులు అందరూ కలిసి కళకళలాడుతూ ఉండటమే ఒక పెళ్ళికళ తల్లీ!"

ఎంత చక్కగా నిర్వచించారు అనుకున్నాడు సాయికృష్ణ!

వేదమూర్తిగారు కృష్ణమూర్తివైపు తిరిగి అడిగాడు "సూర్యనారాయణ ఎప్పుడైనా వస్తున్నాడా? "

సూర్యనారాయణ అంటే వేదమూర్తిగారి రెండో కొడుకు!

జానకి చెప్పింది. "ఈమధ్యన వచ్చి చాలా రోజులయింది మామయ్యగారూ! ఆ మధ్యన హైదరాబాదులో ఏదో పని ఉందని వచ్చి, మనింటికి వచ్చాడు. అయి దంటే అయిదే నిముషాలు కూర్చుని వెళ్ళాడు. వాళ్ళ అన్నయ్యగారు వచ్చే టైమ్ అయింది ఉండమన్నా 'బిజీ' అంటూ వెళ్ళి పోయాడు" అని 'బిజీ' అన్నప్పుడు సాయి కృష్ణ నవ్వడం చూసి తనూ శృతి కలిపింది.

ఆయన చిన్నగా నిట్టూర్చి కృష్ణమూర్తితో అన్నారు. "సరే! కృష్ణా మధ్యాహ్నం భోజ నాలు చేసి ఇక బయలుదేరుతామురా. సూర్యనారాయణ దగ్గరకు కూడా వెళ్ళాలి"

"వరంగలా! అయినా- తొందరేమున్నది? రెండు రోజులు ఉండి వెళ్ళవచ్చుగా! పైగా సాయికృష్ణ రాక రాక వచ్చాడు!"

ఆ మాటలు మనసులోనుండి వచ్చినవి కాదు, పెదవుల మీదనుండి రాలిపడిన పొడి అక్షరాలని ఎవర్కైనా ఇట్టే తెలిసిపో తుంది.

'యాక్ట్' చేయడం కృష్ణమూర్తికి అంతగా చేతకాదు. కాబట్టే- ఆఫీసులో కూడా ఎప్పుడూ, ఎక్కువ పనితో సతమతమయి పోతూ ఉంటాడు.

"లేదులేరా! తిరగాల్సిన ఊళ్లు చాలా ఉన్నాయి. నా కుటుంబీకుల్ని సమావేశపర చడానికి వాళ్లని పర్సనల్‌గా కలిసి ఆహ్వాని స్తేనే కాని నాకు తృప్తిగా ఉండదు"

"మీ ఇష్టం ముక్తసరిగా అన్నాడు కృష్ణ మూర్తి.

"కృష్ణా! నేను చెప్పిన రోజుకు మీరందరూ తప్పక రావాలి! కేవలం భార్యాభర్తలే కాదు. వినీల్, వికితలతో కలిసిరావాలి! ఎలా ఒప్పి స్తావో నాకు తెలియదు. మొక్కుబడిగా కాదు, మనసు పెట్టి రావాలి! సరేనా? "

కృష్ణమూర్తి అలాగేనన్నట్లు తలూపి, కాసేపు కూర్చుని లేచివెళ్ళి బాత్‌రూమ్‌లో దూరాడు.

తండ్రి స్నానం అయిపోగానే, వికిత కూడా స్నానంచేసి, గబగబా భోజనం చేసి కాలేజికి వెళ్ళిపోయింది. తర్వాత, మరో అర గంటలో భోజనంచేసి, కృష్ణమూర్తి కూడా హడావిడిగా వెళ్ళిపోయాడు.

హఠాత్తుగా ఇల్లు అలికిడి లేనట్లుగా అయిపోయింది.

వంటింట్లో గిన్నెల చప్పుడు మినహా ఏ శబ్దమూ లేదు.

సాయికృష్ణ పేపరు చదువుకుంటూ కూర్చుంటే, వేదమూర్తిగారు స్నానం చేసి కింద కూర్చుని దైవధ్యానం చేస్తూ గడి పారు.

దాదాపు పదిన్నర. ఆ సమయంలో...

స్టేజీమీద తెర తొలిగినట్లుగా...

కోటగుమ్మం తలుపులు బరువుగా తెరు చుకున్నట్లుగా...

వినీల్ గది తలుపులు తెరుచుకున్నాయి.

ఎర్రగా, మగతగా, బరువుగా ఉన్న నిద్ర కళ్ళతో, తూలుకుంటూ బయటకు వచ్చిన వినీల్ సరాసరి బాత్‌రూమ్‌లో దూరాడు.

కేవలం అయిదే అయిదు నిముషాలలో బ్రషింగ్, తలస్నానం పూర్తిచేసి, గుండెలవ రకూ లుంగీకట్టి, భుజంమీద ఉన్న టవ ల్‌తో తల తుడుచుకుంటూ వచ్చి డైనింగ్ టేబిల్ ముందు వచ్చి కూర్చున్నాడు.

జానకి వచ్చి 'టీ' కప్పు టేబుల్ మీద పెట్టి వెళ్ళింది.

'టీ' తాగుతున్న వినీల్‌ని చూసి, పేపర్ పక్కన పడేసి లేచివచ్చి వినీల్‌కి ఎదురుగా కూర్చున్నాడు సాయికృష్ణ!

"హలో! గుడ్‌మార్నింగ్ వినీల్!"

"హాయ్" విష్ చేశాడు వినీల్!

"మామయ్యా!" అని చిన్నగా నవ్వాడు

సాయికృష్ణ!

చేతిలో టీ కప్పు కింద పడిపోయేటంత ఆశ్చర్యంగా చూశాడు వినీల్.

తననేగా ఆ పిలుపు?

"నిన్నే! మేనల్లుడా! మన మధ్య బంధుత్వం అదే. నీకు నేను మామయ్యని అవుతాను. నువ్వు నన్ను ఎలాగూ ఆ పిలుపుతో పిలవలేవు! అందుకే నేనే పిలుస్తున్నాను. వినీల్ మామయ్యా!"

విన్నీ- గురూ- బ్రదర్- లాంటి పిలుపులకు అలవాటుపడ్డ వినీల్‌కి ఈ పిలుపు, కొత్తగా, చిత్రంగా, గమ్మత్తుగా అన్పించింది.

"నీ కాలేజ్ టైమ్ అయినట్లుంది" సాయికృష్ణ అడిగాడు.

అవునన్నట్లుగా తలూపాడు వినీల్.

"అయితే- డైరెక్టుగా విషయంలోకి వచ్చేస్తాను! వినీల్- ఈ కార్తీకమాసం ఆఖరి సోమవారం, విజయవాడ మీ తాతయ్యగారింట్లో సమారాధన, వనభోజనం! మీరందరూ తప్పక వస్తున్నారు. ఆరోజు పెద్దవాళ్ళందరూ కలిసి పీటలమీద కూర్చుని పూజలు చేస్తారట"

"ఓహ్! ఇవన్నీ నాకు బోర్! ఇంట్రెస్ట్ లేదు" భుజాలు ఎగరేసి చెప్పాడు వినీల్. గలగలా నవ్వాడు సాయి "భయపడకు మేనల్లుడా! నువ్వేం మంత్రాలు చదవక్కరలేదు. కూర్చుని పూజలు చేయనక్కరలేదు. జస్ట్- ప్రసాదం తింటే చాలు! అన్నట్లు నీకో విషయం తెలుసా? "

ఏమిటన్నట్లు ఆసక్తిగా ముందుకు వంగాడు వినీల్!

"ఆరోజు రాత్రి- వెన్నెల్లో నీ బ్రేక్ డ్యాన్స్ ప్రోగ్రామ్ కూడా ఎరేంజ్ చేయబడింది"

"అబ్బే! నాకంతగా రాదు. అయినా ఎవరు చెప్పారు? "

పెదవి బిగపట్టి నవ్వాడు సాయి "ఎవరు చెబితే ఏంకాని నువ్వు కూడా రాకతప్పదు"

వినీల్ మాట్లాడకుండా, ఆలోచిస్తున్నట్లుగా, సూటిగా సాయికృష్ణ కళ్లల్లోకి, చూస్తుండిపోయాడు.

చేపపిల్లల్లా స్వచ్ఛంగా, తెల్లగా, ఆరోగ్యంగా ఉన్న సాయికృష్ణ కళ్లు నిర్మలంగా నవ్వుతున్నాయి.

వంటింట్లోనుండి ఆ ఇద్దరిని చూస్తున్న జానకికి ఎంతో ఆనందం అన్పించింది. మేనమామ, మేనల్లుడు పక్కపక్కనే కూర్చుని, కబుర్లు చెప్పుకుంటున్న ఆ సన్నివేశం ఎంతో హాయిగా ఉంది.

"భగవంతుడా! ఈ బంధాలని శాశ్వతం చేయి" మనసులోనే మొక్కుకుంది! హఠాత్తుగా అడిగాడు వినీల్ "ఆర్డరా! అభ్యర్థనా? " ఆ అడగడం కూడా ఎంతో స్టయిల్‌గా, సినిమాటిక్‌గా ఉంది.

వెంటనే వెనకనుండి వేదమూర్తిగారి గంభీరమైన స్వరం విన్పించింది.

"రెండూ కాదు! నిర్బంధం"

ఉలిక్కిపడి తల తిప్పిన వినీల్, కుర్చీలో నుండి లేచి నిల్చున్నట్లుగా నిల్చుని మళ్ళీ కూర్చుని అన్నాడు.

"హాయ్ గ్రాండ్ ఫా! బాగున్నారా! సారీ! రాత్రి ఒంట్లో బాగాలేదు! అందుకే పలకరించలేకపోయాను"

వేదమూర్తిగారు ఆ విషయం గురించి పట్టించుకోలేదు. పట్టించుకోనట్లుగా అన్నారు. "మీ కుటుంబసభ్యులు నలుగురూ హాజరవుతున్నారు!"

గంభీరమయిన తాతయ్య స్వరానికి ఎదురు చెప్పలేనట్లు, తలూపి ఊర్కుండిపోయాడు వినీల్.

దాదాపు అయిదు నిముషాలు గడిపి, తర్వాత ఎక్కడలేని హడావిడితో, పుస్తకాలు తీసుకుని కాలేజికి వెళ్ళిపోయాడు. వెళ్లేట

ప్పుడు భోజనం చేయనేలేదు. 'ఆకలిలేదు-క్యాంటిన్‌లో తింటాను' అని చెప్పి వెళ్లాడు.

చిన్నగా నిట్టూర్చడం మినహా ఏమీ చేయలేకపోయింది జానకి!

పన్నెండుగంటలకల్లా వేదమూర్తిగారు, సాయికృష్ణ భోజనాలు చేసి బ్యాగ్స్ సర్దుకుని, జానకికి చెప్పి బయలుదేరారు.

రెండో మజిలీ వరంగల్‌కి!!



ప్రయాణం మధ్యలో తాము వెళ్ళబోతున్న తన రెండో కొడుకు గురించి చెప్పారు వేదమూర్తిగారు. "పెద్దవాడు కృష్ణమూర్తి, తరువాత గౌరీ మనోహరి, ఆఖరున వీడు పుట్టాడు. రథసప్తమిరోజున పుట్టాడని "సూర్యనారాయణ" అని పేరు పెట్టుకున్నాం. కాని వాడికి ఆ పేరు మోటుగా ఉండటంతో 'సురేష్' అని మార్చుకున్నాడు. నేను మాత్రం సూర్యనారాయణా అనే పిలుస్తాను. వాడి భార్య పేరు సులోచన! ఇద్దరూ ఉద్యోగస్థులే. సూర్యనారాయణ కాలేజి లెక్చరర్. కోడలేమో ప్రయివేటు కంపెనీలో క్లర్కు! వాళ్ళకి ఇద్దరు ఆడపిల్లలు! పెద్దది చరిత. రెండోది చకిత! ఎన్నో పేర్లు శోధించి పెట్టుకున్నారట ఆ పేర్లు! నాకయితే ఆ పేర్లకు అర్థం తెలియదు. వాళ్ళిష్టం. తమ పిల్లలకి ఇష్టపడి పెట్టుకున్నారు. పోతే చూచాయగా నేను గమనించినదేమిటంటే- ఇద్దరూ ఉద్యోగస్థులే అవడంతో పిల్లల పెంపకంమీద అంత శ్రద్ధ వహించినట్లుగా కనబడరు. వాళ్ళ ఇంట్లో కూడా దాదాపుగా ఎవరి దారులు వారివి. పెద్దకూతురు, చరిత డిగ్రీ అయిపోయినట్లుంది. చకిత ఇంటర్ సెకండ్‌ఇయర్‌లో ఉన్నది. అసలు మనం ఇంటికి వెళ్ళేసరికి భార్యాభర్తలు ఇంటికి వచ్చి ఉండకపోవచ్చు ఫిల్లలయినా ఉన్నారో, కాలేజికి వెళ్ళారో తెలియదు"

"ఫోన్‌చేసి వెళ్ళి ఉండాల్సింది" సాయికృష్ణ అన్నాడు.

"ముందరగా చేస్తే అనవసరంగా మన గురించి సెలవు పెట్టుకుని కూర్చుంటారు. మనం ఇంటికి చేరేసరికి వాళ్లు వచ్చే టైమ్ కూడా అవుతుందిలే"

వేదమూర్తిగారు చెబుతుంటే- ఎదురుగుండా బెర్తుమీద కూర్చున్న ముసలాయన అడిగారు "కొడుకు దగ్గరకా బాబూ"

అవునన్నట్లుగా తలూపారు వేదమూర్తిగారు.

ఎదురుగా కూర్చున్న ముసలాయనకు వయసు అరవైపైనే ఉంటుంది. వార్ధక్యం బాగా మీదపడినట్లుగా, బక్కపలచగా నడుము వంగిపోయినట్లుగా ముందుకు వంగి కూర్చున్నాడు. పక్కనే ఆయన భార్య. ఆమె కూడా పండిపోయిన వయసులో ఉంది. తలంతా ముగ్గుబుట్ట అయిపోయి, గువ్వలా ఒదిగి ఒదిగి కూర్చుంది.

వేదమూర్తిగారు పలకరించారు "మీరెక్కడినుండి? "

బోసినోరు విప్పి, చిన్నగా నవ్వాడా ముసలాయన "హైదరాబాదునుండి. అక్కడ నా కొడుకు, వాడి కుటుంబం ఉంది! వెళ్ళి వస్తున్నాం"

"ఏదయినా ఫంక్షనా? " సంభాషణ కలుపుతూ అడిగాడు వేదమూర్తిగారు.

విరక్తిగా నవ్వాడు ముసలాయన, "అలాంటిదేమీలేదు బాబూ! ఏదో అంటారే! కడుపు చించుకుంటే కాళ్లమీద పడుతుందని అదిగో అలాగే ఉన్నాయి మా బతుకులు. అపుత్రస్య గతిర్నాస్తి- అని పిల్లల్ని కంటాం. ఎన్నో ఆశలు పెంచుకుని, ఏవో భ్రమలు కల్పించుకుని, సర్వస్వం వాళ్ళ కోసమే ధారపోసి, చదివించి, ప్రయోజకుల్ని చేస్తాం! కాని బాబుగారూ! తల్లిదండ్రులకు పిల్లల మీద ఉండే మమకారం- పిల్లలకు తల్లితండ్రులమీద ఉండద్దూ! ఏమిటో బాబుగారూ! మాది మంగళగిరి దగ్గర చిన్న పల్లెటూరు. నేనూ ఇదిగో నా భార్య ఇద్దరమే ఒకరికొకరం తోడుగా బతుకుతున్నాం. అప్పుడప్పుడు వచ్చి వెళ్ళండర్రా అని అడుగుతుంటే కుదరదు, సెలవు దొరకదు, అంత దూరం వచ్చి వెళ్ళాలంటే ఇంతమందికి బోలెడన్ని ఛార్జీలు అవుతాయి అంటూ రానేరారు. కనీసం మనవడు, మనవరాలయినా వస్తారా అంటే ఈ పల్లెటూర్లలో ఒక్కక్షణం కూడా గడపలేరట. పిచ్చి ఎక్కుతుందట. పరమ బోర్ అట. అందుకనే సిటీ వదిలి రారు బాబూగారూ! నాకు తెలియక అడుగుతానూ- పట్నాలలో షికారుకంటూ ప్రత్యేకంగా పెంచిన గార్డెన్లకు వెళతారుకాని సహజమైన మా పల్లెటూరి ప్రకృతి అందాలు ఆస్వాదించలేరు. ఎందుకని? అక్కడ కూడా కృతిమత్వమేనా? ఏమిటో బాబూ! తీర్థయాత్రలకని దాచి ఉంచుకున్న డబ్బుతో- ఇదిగో ఇలా ఆరునెలలకొకసారి, దేవుని దర్శనంలా, అయ్యవారిని, అమ్మవారిని దర్శించుకుని, కన్నతీపిని తృప్తిపరచుకుంటాం."

ఈ సమస్యకి సరియైన ముగింపు అసలయిన పరిష్కారం ఎక్కడ ఉన్నది? ఒదిగిపోయి కూర్చున్న ఆ పండు ముత్తయిదువ అన్నది, "ఏమిటో! చెబితే ఈయనగారు విన్పించుకోరు కాని, సెలవలు పెట్టి ప్రత్యేకంగా పనులు మానుకుని పిల్లలని రమ్మనడం ఎందుకు? ఖాళీగా ఉన్నాం కాబట్టి- మనమే వెళ్ళి రావడంలో తప్పులేదు. ఈ మాత్రం భాగ్యానికి పాపం! పిల్లలని శ్రమపెట్టడం దేనికి? ఎవరు ఎక్కడకు వెళ్ళినా కలుసుకోవడమేకదా ముఖ్యం"

సాయికృష్ణ గొంతుకేదో అడ్డుపడ్డట్లయింది.

వేదమూర్తిగారు అన్నారు "మీది తల్లి మనసు కనుక అలా అనగలిగారు. కాని ఆ ముసలి తండ్రి అలా సరిపెట్టుకోలేడుగా, మనసొప్పుకోదు మరి"

ఇద్దరూ ఏదో గొణుక్కుంటూ ఉండిపోయారు.

చూస్తుండగనే వరంగల్ స్టేషన్ వచ్చింది.

దిగబోతూ వేదమూర్తిగారు ఆ వృద్ధదంపతుల ఆరోగ్యం గురించి హెచ్చరించి మరీ దిగారు.

ఇద్దరూ ఆటో చేసుకుని ఇంటికి చేరేసరికి సాయంత్రం నాలుగయింది.

మధ్యలో ఆటోలో చెప్పాడు సాయికృష్ణ "మామయ్యా! నిజానికి కృష్ణమూర్తి బావకి అన్నీ వివరంగా చెప్పాలని, అందరం మళ్ళీ కలుసుకోవాలనే ఆలోచన వెనక గల ఉద్దేశం గురించి వివరించాలని ఎంతగానో అనుకున్నాను. కాని ఎందుకో చెప్పలేకపోయాను. అసలు మాటలే పెగలిరాలేదు వయసు తారతమ్యం కూడా అడ్డొస్తోంది

"నిజమేరా! దాని గురించి నువ్వు వర్రీ అవకు. నేనున్నానుకదా! అందరికంటే పెద్దవాడిని కాబట్టి ఎలాగయినా చెప్పగలను

ఏవిధంగానయినా శాసించగలను. ఒకవిధంగా నేను చెబితేనే బాగుంటుంది. నువ్వు నా పక్కన ఉండు అది చాలు”

నిన్నటినుండి ఆ విషయంలో అసంతృప్తికి గురిఅవుతున్న సాయికృష్ణ తేలికగా నిట్టూర్చాడు.

ఆటో దిగి, ఇంటి ముందుకు వచ్చి తలుపు తట్టారు.

రెండు క్షణాల తర్వాత తలుపు తెరుచుకుంది.

లోపల పదహారేళ్ల అమ్మాయి నిల్చుని ఉంది.

పంజాబీ డ్రస్‌లో ఉన్న ఆ అమ్మాయి చకిత! సూర్యనారాయణ రెండో కూతురు. చామన ఛాయలో ఉన్నా చకిత ముఖం అందంగా ఉంది. కాని చెవులకు, చేతులకు ఏమీ లేకుండా బోసిగా ఉన్నాయి. నుదుట కన్పించీ కన్పించనట్లుగా చిన్న చుక్కలా నల్లటి బొట్టు ఉంది. జడ వేసుకోకుండా నడినెత్తిమీదకి సిగలా చుట్టింది.

బయట వేదమూర్తిగారిని, ఆ వెనకే నిల్చున్న యువకుడిని చూడగానే అప్రయత్నంగా తడబడింది. కంగారుగా ఒక అడుగు వెనకకు వేసింది.

“మీరా! రండి తాతయ్యా” అంటూ గభాలున వెనకకు రెండు అడుగులు వేసి, అంత క్రితం వరకు మంచంమీద పడుకుని చదువుతున్న డిటెక్టివ్ నవలని దిండుకిందకు తోసేసింది.

“అమ్మా- నాన్నా ఇంకా రాలేదా? ” లోపలికి అడుగుపెట్టిన వేదమూర్తిగారు అడిగారు.

“లేదు తాతయ్యా! వచ్చే టైమ్ అయింది. రండి, కూర్చోండి” అంటూ కుర్చీలు ముందుకు జరిపింది.

సాయికృష్ణ ఆ హాలు పక్కగా కనిపిస్తున్న గది పరిశీలించసాగాడు.

ఆ ఇంట్లో పెద్దవాళ్లుకాక, ఇద్దరు అమ్మాయిలు కూడా ఉంటున్నారంటే ఎవరూ నమ్మరు. అంత గందరగోళంగా ఉంది.

మంచం మీదనుండి సగం కిందకు జారి, నేలమీద జీరాడుతున్న దుప్పటి, ఒక మూల ఉండలు ఉండలుగా చుట్టి పడేసిన విడిచిన పంజాబీ డ్రెస్‌లు, జాకెట్లు, బ్రాసియర్స్, కుర్చీ కోళ్ళమీద అడ్డదిడ్డంగా పడేసిన ఫాంటు షర్టులు, చీరలు హాలు మధ్య కట్టిన దండెం మీదనుండి వ్రేలాడుతూ మొహాలని తాకుతున్న టవల్స్, పుస్తకాలతో చిందర వందరగా ఉండి ఓ మూలన పడివున్న చెక్కటేబుల్, ఓ మూలకి నిర్లక్ష్యంగా విసిరేసిన చెప్పులు, అక్కడక్కడా వ్రేలాడుతున్న బూజు, దుమ్ము పేరుకుపోయిన తలుపులు, గుమ్మాలు...

వేదమూర్తిగారు ఆ వాతావరణాన్ని నిర్లిప్తంగా పరిశీలించారు. మంచం చివర అనీజీగా కూర్చున్న చకితని అడిగాడు
“అక్కయ్య లేదా? ”

“ఉన్నది పడుకున్నది” అంటూ గదిలోకి వెళ్ళి “అక్కా” అంటూ పిలిచింది. రెండుక్షణాల అనంతరం గదిలోనుండి హాల్లోకి వచ్చింది చరిత! సూర్యనారాయణ పెద్దకూతురు.

ఈ లోపల చకిత వంటింట్లోకి వెళ్ళి మంచినీళ్లు తీసుకువచ్చి ఇచ్చింది ఇద్దరికీ! గోడవారగా నిలుచున్న చరితను క్షణంసేపు గుర్తుపట్టలేకపోయారు వేదమూర్తిగారు.

తెల్లగా, బొద్దుగా, ఆరోగ్యంగా, ముద్దబంతి పువ్వులా ఉండే చరిత ప్రస్తుతం, నల్లబడిపోయి, కళ్ళకింద గుంటలతో, బయటకొచ్చిన భుజాలతో బక్కచిక్కిపోయింది.

“చరితా నువ్వేనా? ఏమిటీ ఇలా అయిపోయావు”

చరిత పేలవంగా నవ్విందే కాని సమాధానం చెప్పలేదు. చకితే అన్నది.

"అక్కయ్యకి ఈమధ్యన హెల్త్ బాగా దెబ్బతిన్నది తాతయ్యా!"

వేదమూర్తిగారు జబ్బేమిటని, అనారోగ్యం ఏమిటని రెట్టించలేదు. సాలోచనగా చరిత వైపే చూస్తుండిపోయారు.

క్షణం తర్వాత కదిలి సాయికృష్ణని పరిచయం చేశారు. "వీడు సాయికృష్ణ! నా చెల్లెలు సత్యవతి కొడుకు! మీకు వరసకు మామయ్య అవుతాడు"

చకిత చిన్నగా నవ్వి చేతులు జోడించి నమస్తే చెప్పింది.

చరిత పలకరింపుగా నవ్వి, మళ్ళీ నీరసంగా వెనుతిరిగి తన డ్యూటీ అయిపోయినట్లుగా గదిలోకి వెళ్లిపడుకుంది.

పక్కనే స్టూలుమీద చిందర వందరగా పడివున్న రెండు మూడు పుస్తకాలను యధాలాపంగా చేతిలోకి తీసుకున్నాడు సాయికృష్ణ!

అతని చేతిలోకి వచ్చిన మూడు పుస్తకాలూ కూడా, చవకబారు డిటెక్టివ్ పుస్తకాలు! వాటి పేర్లు చదువుతుంటే, అతనికే సిగ్గువేసింది.

ఇంట్లో కూర్చుని, ఈ అమ్మాయి చదువుతున్న పుస్తకాలు ఇవా? ఇలాంటి సాహిత్యమా?

సాయికృష్ణ పుస్తకాలు చేతిలోకి తీసుకోవడం చూసిన చకిత తత్తరపడింది. ముఖంలో రంగులు మారాయి.

"ఎక్కడివే ఇవి నీకు? " వేదమూర్తిగారు కొంచెం గద్దింపు స్వరంతో అడిగారు.

"అవా? అబ్బే నేను అంతగా చదవను. ఎంత చెప్పినా వినకుండా లెండింగ్ లైబ్రరీ వాడు తెచ్చిపడేసి వెళ్ళాడు. ఇచ్చేయాలి" కంగారుపడుతూ చెబుతున్న మనవరాలిని, జాలితో, సగం కోపంతో చూస్తూ అడిగారాయన, "ఎలా చదువుతున్నావు? ఈ సంవత్సరం సెకండియర్ అనుకుంటా"

బాగానే చదువుతున్నానన్నట్లుగా తలూపింది చకిత!

ఇంతలో బయట స్కూటర్ ఆగిన శబ్దం అయింది.

"మమ్మీ, డాడీ వచ్చినట్లున్నారు" అంటూ చటుక్కున లేచిన చకిత వాకిట్లోకి ఎదురేగింది.

కాలేజినుండి వస్తూ, మధ్యలో ఆఫీసు దగ్గిర తన భార్యను కూడా ఎక్కించుకుని వచ్చేశాడు సూర్యనారాయణ.

లోపలికి వస్తూనే "నాన్నగారా? ఎంతసేపయింది వచ్చి? " అంటూ పలకరించి, పక్కనే కూర్చున్న సాయికృష్ణని సందేహంగా ఎవరూ? అన్నట్లు చూశాడు.

వేదమూర్తిగారు చెప్పారు "మీ సత్యవతి అత్తయ్య కొడుకు సాయికృష్ణ"

"సాయికృష్ణా! మైగాడ్! ఎంత ఎదిగిపోయాడు? ఎన్నాళ్ళయింది చూసి? "

అంటూ ఆశ్చర్యం ప్రకటించి "ఎలా ఉన్నావు సాయీ? మామయ్య అత్తయ్య ఎలా ఉన్నారు? " అంటూ అడిగాడు.

అన్నింటికీ చిరునవ్వే సమాధానం ఇచ్చాడు సాయికృష్ణ.

కృష్ణమూర్తి బావ అంతా తండ్రి పోలికయితే ఈ సూర్యనారాయణ బావ మాత్రం కాత్యాయని అత్త నోట్లోనుండి ఊడిపడ్డట్లుగా ఉన్నాడు. కనుముక్కు తీరు, మాట విరుపు అంతా ఆమెదే!

సులోచన కూడా నవ్వుముఖంతో ఇద్దరినీ పలకరించి, గబగబా మూలల్లో పడేసిన బట్టలను, కుర్చీలో పడేసిన ఫాంటుషర్టులను తీసుకెళ్ళి గదిలో పడేసి, ఇల్లంతా క్షణాల్లో సర్దేసింది!

ఇంతలో పాలు వస్తే అందరికీ 'టీ' కలిపి ఇచ్చి వాళ్ళతోపాటు తనూ త్రాగుతూ కూర్చుంది! టీ తాగగానే వెంటనే హడావి

డిగా సూర్యనారాయణ స్నానానికి వెళ్ళాడు! అతను స్నానం చేసి వచ్చేసరికే పదిపది హేను మంది స్టూడెంట్స్ వచ్చి వాకిట్లో కూర్చున్నారు!

సూర్యనారాయణ ఇంటిదగ్గర ట్యూషన్స్ కూడా చెపుతాడని అపుడే తెలుసుకున్నారు వేదమూర్తిగారు!

లుంగీ కట్టుకుని, చొక్కా వేసుకుంటూ అపుడు అడిగాడు సూర్యనారాయణ.

"అమ్మ ఎలా ఉన్నది నాన్నా? "

ఆ ప్రశ్నకోసమే లక్ష చెవులతో ఎదురు చూస్తున్న వేదమూర్తిగారు గాఢంగా నిట్టూర్చి అన్నారు. "బొత్తిగా- నల్లపూస వయి పోతున్న నీ గురించే ఎపుడూ అను కుంటూ ఉంటుందిరా!"

"ఎక్కడ నాన్నా! ఎప్పటికపుడు వద్దాం, వద్దాం అనుకుంటూ ఉంటే, అలాగే సరిపోతోంది! నాకు సెలవులయితే సులోచ నకి లీవ్ దొరకక, తనకి లీవ్ దొరికినపుడు నాకు కుదరక, పిల్లల చదువులు- పోనీ సెలవల్లో వద్దామనుకుంటే- అపుడు ఇంకా బిజీ! ఎమ్‌సెట్ కోచింగులూ, ట్యూషన్లనీ స్పెషల్ బ్యాచెస్ ఏమిటో!" అని హడావి డిగా, వాకిట్లో తన కోసం వెయిట్ చేస్తున్న స్టూడెంట్స్ దగ్గరకి వెళ్ళాడు!

సులోచన వంట ప్రయత్నంలో పడింది.

ఈ లోపల వేదమూర్తిగారు, సాయికృష్ణ స్నానాలుచేసి, మేడమీదకి వెళ్ళారు!

చరిత మాత్రం అలాగే మంచానికంటుకు పోయి, గదిలోనే పడుకుంది!

చకిత మధ్యమధ్యలో తల్లికి వంటలో సాయంచేస్తూ, అపుడపుడు గదిలోకి వచ్చి దొంగతనంగా మధ్యలో వదిలేసిన డిటెక్టివ్ పుస్తకం పూర్తిచేయసాగింది.

మేడమీదకి వెళ్ళిన సాయికృష్ణ కోరికమేరకు, అప్పటికప్పుడు అనుకుని ఇద్దరూ మళ్ళీ వెంటనే దిగివచ్చి, బట్టలు మార్చుకుని వేయిస్థంబాల గుడికి వెళ్ళారు!

కాకతీయ కళావైభవానికి ముగ్ధులయిపో యారు ఇరువురూ! దాదాపు గంట పైగా అక్కడే గడిపి ఇంటికి వచ్చారు!

వాళ్ళు ఇంటికి వచ్చేసరికి సూర్యనారా యణ ట్యూషన్ కూడా అయిపోయింది. వీళ్ళు రాగానే సులోచన వంటింట్లో డైనింగ్ టేబుల్‌మీద మూడు కంచాలే పెట్టి వడ్డి స్తుంటే అడిగారు వేదమూర్తిగారు, "అదేం! పిల్లలకు కూడా పెట్టేసేయి సులోచనా!"

"లేదు మామయ్యగారూ! వాళ్ళు ఇపుడే తినరు! మీరు తినేయండి! మాకిది అల వాటే!" అంది. భోజనాలయ్యాక తండ్రీ కొడుకులు, సాయికృష్ణ వాకిట్లో కుర్చీలు వేసుకుని కూర్చున్నారు! కార్తీకపౌ ర్ణమి దగ్గరపడుతున్నట్లుంది! ఆకాశం అంతా తెల్లగా వెన్నెల పరుచుకున్నట్లుగా ఉంది!

చల్లటి చలిగాలి పక్కనే గోడమీదకి పాకిన మాలతి తీగలమీదుగా వీస్తూ, చక్కటి పరిమళాన్ని వెదజల్లుతోంది!

రోడ్లమీద జనసంచారం తగ్గి నిశ్శబ్దంగా ఉన్నాయి!

దూరంనుండి మైకులో ఏదో భజన విన్పి స్తోంది!

అయిదు నిముషాల నిశ్శబ్దం తర్వాత కొంచెం కదిలి అన్నారు వేదమూర్తిగారు.

"నారాయణా!"

"ఏం నాన్నగారూ!"

"ఇందాకటి నుండీ అడగాలనుకుంటు న్నాను! అందరిముందు అడగడం ఇష్టంలేక అడగలేదు! అసలు చరిత అనారోగ్యం ఏమిటి? ఏమయింది దానికి? "

ఆ ప్రశ్న వినగానే సూర్యనారాయణ ముఖం కళతప్పి వాడిపోయింది! క్షణంసేపు మాటలు రానట్లుగా ఉండిపోయాడు! ఆ

తర్వాత బరువుగా తలెత్తి ఇబ్బందిగా- సాయికృష్ణ వైపు చూశాడు।

అతని బాధ, పరిస్థితి అర్థంచేసుకున్నట్లుగా అన్నారు ఆయన "ఫరవాలేదు। చెప్పవచ్చు।"

అప్పటికీ మాట్లాడలేదు సూర్యనారాయణ।

"ఏం నారాయణా। అంత చెప్పుకోలేని అనారోగ్యమా? "

"నాన్నగారూ।" కదిలిపోయి అన్నాడు సూర్యనారాయణ? తర్వాత చిన్నగా దగ్గాడు। వేదమూర్తిగారు ఫరవాలేదన్నట్లుగా కొడుకు భుజంమీద తట్టారు।

"ఏం చెప్పేది నాన్నగారూ। అదంతా మా ఖర్మ! చెప్పుకోవాలంటే సిగ్గుగా ఉంది। చరిత డిగ్రీ సెకండ్ఇయర్ చదువుతుండగా దాని క్లాస్‌మేట్ మురళితో పరిచయం అయింది। ఆ పరిచయమే స్నేహంలోకి దారితీసి, పీకలవరకూ ప్రేమలో కూరుకుపోయారు ఇద్దరూ। మా హడావిడిలో ఇద్దరం ఉద్యోగ స్థలమే అవడంతో చరిత కాలేజికి ఎప్పుడు వెళుతోందో, ఇంటికి ఎపుడొస్తోందో, దాని స్నేహాలేమిటో, తిరుగుళ్ళు ఏమిటో మేము పట్టించుకోనేలేదు. ఉదయం వెళ్ళి సాయంత్రం వచ్చే మాకు పిల్లలు బుద్ధిగా కాలేజికివెళ్ళి అయిపోగానే తలవంచుకుని ఇంటికివచ్చి చదువుకుంటున్నారనే అనుకున్నాము కాని చరిత ఇలా పెడత్రోవ పడుతుందని కలలో కూడా ఊహించలేదు। వాళ్ళద్వారా, వీళ్ళద్వారా ఆ మురళి అనే కుర్రాడితో దీని ప్రేమ, షికార్లు, మా చెవిన పడటంతో ఏమిటి సంగతి? అని నిలదీస్తే, నిజమేనని ఒప్పుకుంది। సరే। ఆ కుర్రాడి తల్లితండ్రులతో మాట్లాడదామని నేనూ, సులోచనా వాళ్ళింటికి వెళ్ళాం। అదిగో అక్కడే మేము దెబ్బతిన్నాము। వాళ్ళ ఇంట్లో అడుగుపెట్టగానే తెలిసిపోయింది వాళ్ళకీ మాకు బాగా దగ్గరి చుట్టరికము ఉన్నదని। సులోచనకి వాళ్ళు రక్త సంబంధీకులు। వాళ్ళు చాలా రోజులు కర్ణాటకలో ఉండి ఉద్యోగరీత్యా వరంగల్ వచ్చారట। వరసకి మురళి చరితకు అన్నయ్య అవుతాడు। ఒకే ఊళ్ళో ఉంటున్నా, వాళ్ళ అడ్రెస్ మాకు, మా అడ్రెస్ వాళ్ళకి తెలియక పోవడంవలన అసలు వాళ్ళు ఇక్కడే ఉంటున్నారనే సంగతి సులోచనకిగాని, నాకుగాని తెలియక పోవడంవలన ఈ అనర్థం జరిగిపోయింది। తనకీ- మురళికి మధ్యనగల రిలేషన్ ఏమిటో తెలియగానే ఆ షాక్‌కి చరిత మంచం పట్టి, దాదాపు రెండు నెలలు లేవలేదు। ఇపుడిపుడే కోలుకుంటోంది। ఇంత గొడవ జరిగాక ఇక్కడ ఉండటం ఇష్టంలేక మురళి వాళ్ళ నాన్నగారు ఇక్కడినుండి ట్రాన్స్‌ఫర్ చేయించుకుని వెళ్ళిపోయారు। ఇక చరితని కాలేజి మాన్పించి ఇంట్లోనే ఉంచేశాము। అసలు అది చదివే స్థితిలో కూడా లేదు। ఆ విషయం చెప్పుకోలేక పైకి డిగ్రీ అయిపోయిందనే చెబుతున్నాము"

కొడుకు భుజం తడుతూ అన్నారు వేదమూర్తిగారు "ఊర్కో నారాయణా। అన్నీ అవే సర్దుకుంటాయి। జరిగినదానికి చింతించి ప్రయోజనం లేదు। అన్నానని కాదు. తప్పు మనలో కూడా ఉన్నది। ఒకటి ముఖ్యమయినది. మన రక్త సంబంధీకుల మధ్యనే కనెక్షన్స్ మెయిన్‌టెయిన్ చేయక పోవడం, రెండు పిల్లల పెంపకంపట్ల మన నిర్లక్ష్యం"

"లేదు నాన్నగారూ" ఏదో చెప్పబోయాడు।

"లేదురా। సాయంత్రం, ఈ ఇంట్లో అడుగుపెడుతూనే గమనించాను। ఇల్లు ఆ తీరు ఏమిట్రా? ఇంట్లో ఇద్దరు ఆడపిల్లలు ఉన్నారు। ఇల్లు ఎంత పరిశుభ్రంగా ఉండాలి? పరిసరాలు ఎంత ఆహ్లాదకరంగా ఉంచాలి? "

ఒప్పుకుంటూ అన్నాడు సూర్యనారాయణ "నిజమే। పిల్లలకి శ్రద్ధ తక్కువ"

"పిల్లలకి కాదు! పిల్లలపట్ల పెద్దలకి శ్రద్ధ తక్కువ అను! చిన్నప్పటినుండి సరిగా, క్రమశిక్షణలో పెంచుకుంటూ వస్తే వాళ్ళు ఇలా ఎందుకుంటారు? మీరు మీ ఉద్యోగాలూ, సంపాదనే చూసుకున్నారు కాని పిల్లల్ని నిర్లక్ష్యం చేశారనే చెప్పాలి! నారాయణా! నీ పిల్లల గురించి నీ దగ్గర విమర్శించకూడదు! కాని వాళ్ళు నా మనవరాళ్ళు! చెప్పక తప్పదు! చకిత దాని వయసెంతని? అది చదివే పుస్తకాలు ఎలాంటివో ఏనాడయినా గమనించావా? సిన్సియర్‌గా గుండెలమీద చెయ్యివేసుకుని చెప్పరా! ఇలాంటి విషయాలలో ముఖ్యంగా పిల్లల విషయంలో నిర్లక్ష్యం, దాపరికం కూడదు!"

"ఏమో నాన్నగారూ! నేనెపుడూ గమనించలేదు! నా కాలేజి, ట్యూషన్స్‌తోనే అలిసిపోతాను! మీ కోడలి పరిస్థితీ అదే! ఇక పిల్లలు వాళ్ళ చదువుల గురించి ఏం పట్టించుకుంటాము? అసలు అంత తీరికేది? ఆమధ్యన సులోచన ఈ పుస్తకాల విషయంలో మందలించినట్లున్నది! అప్పటికి తాత్కాలికంగా మానేసినా మేము బయటకు వెళ్ళాక, లెండింగ్ లైబ్రరీలో తెచ్చుకుంటున్నట్లున్నది!'

"ఒరేయ్ నారాయణా! మీరు అనుకుంటున్నంత తేలికయిన విషయం కాదురా అది! చకిత చదువుతున్న సాహిత్యం, మద్యం కంటే మత్తయినది! డ్రగ్స్ కంటే డేంజరయినవి! ఆ సాహిత్యం మెదడుని చెదలు తినినట్లు తిని మనసుని పెడత్రోవపట్టిస్తాయి! ముఖ్యంగా వయసులో ఉన్న పిల్లరా అది! అది చదవదగిన పుస్తకాలు కావురా అవి!"

"ఏం చేయమంటారు నాన్నా నన్ను? మొండి పిల్లలు చెబితే వింటారా? "

జీరనిండిన గొంతుతో అన్నాడు సూర్యనారాయణ.

సాయికృష్ణ ప్రేక్షకుడిలా వాళ్ళ సంభాషణ వింటూ ఉండిపోయాడు!

కొంచెం సర్దుకుని అన్నారు వేదమూర్తిగారు "నారాయణా! ఇపుడు కోడలు కూడా ఉద్యోగం చేయడం అంత అవసరమా? "

ఆయన భావం అర్థంచేసుకున్నట్లుగా సమాధానం చెప్పాడు సూర్యనారాయణ "నిజానికి అంత అవసరం లేదు!"

"అయితే ఉద్యోగం మాన్పించరా! నీ ఉద్యోగం మీద, నీ ట్యూషన్స్‌మీద వచ్చే సంపాదన చాలురా మీ జీవితాలకి! ఇపుడు ఆలోచించవలసినది డబ్బు సంపాదన గురించి కాదు! పిల్లల భవిష్యత్ గురించి. ఆడపిల్లలు వయసులో ఉన్న అమ్మాయిలు పెరగవలసిన ఆరోగ్యకరమయిన వాతావరణం గురించి పట్టించుకునే తీరిక నీకు ఎలాగూ ఉండదు! కనీసం కోడలయినా ఇంటిదగ్గర ఉంటే పిల్లలు కొంతయినా క్రమశిక్షణలో ఉంటారు!"

"నిజమే... నేనూ అదే ఆలోచిస్తున్నాను!"

"ఇంకా ఎన్నాళ్ళు ఆలోచిస్తారు? పరిస్థితి చేయి దాటకముందే, పరువు గడపదాటకముందే త్వరగా ఓ నిర్ణయానికి రండి" హెచ్చరిస్తూ చెప్పారు వేదమూర్తిగారు. లోపలనుండి సులోచన వచ్చి "మామయ్యగారు ! మీకూ, సాయికృష్ణకి హాలులో పక్కలు ఏర్పాటుచేశాను" అని గదిలోకి వెళ్ళి పడుకుంది!

పడుకున్న అయిదు నిముషాలలోనే అలసిపోయిన ఆమె శరీరం నిద్రలోకి జారుకుంది! వాకిట్లోనే కాలేజీల గురించి, స్టూడెంట్ల యూనియన్ల గురించి, రాజకీయాల గురించి, ఓ అరగంటసేపు ముగ్గురూ మాట్లాడుతూ కూర్చుండిపోయారు.

కాసేపటికి నిద్రవస్తోంది అంటూ సూర్యనారాయణ తన గదిలోకి వెళ్ళి తలుపేసుకుని పడుకున్నాడు!

ఇవతల గదిలో చరిత, చకిత పడుకు న్నారు!

వేదమూర్తిగారు, సాయికృష్ణ లోపలికి వచ్చి, తలుపేసుకుని పడుకోబోతూ ఇవతల గదిలో ఇంకా లైటువెలుగుతూ ఉండటంతో చకిత సాహిత్య పఠనంలో మునిగి తేలు తోందని ఊహించారు.

కాసేపట్లో ఇద్దరూ మంచి నిద్రలోకి జారి పోయారు!

మర్నాడు ఉదయం ఇద్దరూ లేచేసరికే,

సులోచన వంట ఇంట్లో హడావిడిగా ఉన్నది!

వాకిట్లో సూర్యనారాయణ పిల్లలకు ట్యూషన్ చెబుతున్నాడు! అతని ట్యూషన్ అయేసరికే ఇద్దరి కాఫీలు, స్నానాలు అయి పోయాయి!

చరిత బయటికి రావడం ఇష్టంలేనట్లుగా, గదిలోనే మంచానికి అంటుకుపోయింది!

చకిత మాత్రం అందరూ చూసేలా, సీరి యస్‌గా క్లాసుపుస్తకాలు చదువుతూ కూర్చుంది! ఈలోపు వేదమూర్తిగారు, కాసేపు మేడమీదకి వెళ్ళి ఒంటరిగా దైవ ధ్యానం చేసుకువచ్చారు!

తర్వాత ఆయన ఆదేశం మేరకు, అందరూ హాలులో సమావేశమయ్యారు. నిశ్శబ్దంగా ఉన్న వాతావరణాన్ని ఛేదిస్తూ అన్నారాయన "ఇంత హఠాత్తుగా, ఎందుకు దిగానా? అని ఆశ్చర్యపోతున్నారు కదూ! నిజమే. మా ఈ రాక వెనక గొప్ప ఆశయం ఉన్నది! మేము చేస్తున్న ఈ 'యాత్ర'లవెనక ఒక మంచి ప్రయత్నం ఉన్నది! సింపుల్‌గా చెప్పాలంటే ఒకసారి మన కుటుంబ సభ్యులందరూ కలిసి సమా వేశమయి, ఘన మధ్యన తగ్గిపోతున్న రాక పోకలను, అంతరించిపోతున్న అనురాగా లను తిరగతోడాలనే ఈ ప్రయత్నం! ఇందులో ఆశయం ఏముంది? అన్పించ వచ్చు? కానీ, ఆలోచిస్తే మన మధ్యనున్న 'గేప్' రోజురోజుకి పెరిగిపోతూ, అగాధాలని విస్తృతం చేస్తూ ఎన్ని అనర్థాలకి కారణం అవుతోందో ఊహించలేని పరిస్థితి! ఇంత కంటే ఎక్కువ చెప్పలేను! అందుకే ఈ కార్తీ కమాసం ఆఖరి సోమవారం, విజయవాడ లోని మన ఇంట్లో సమారాధన అనే వేది కగా, వనభోజనాలు అనే సమావేశం ఏర్పా టుచేశాను! మీ కుటుంబ సభ్యులు అందరూ ఖచ్చితంగా వచ్చి తీరాలి!"

సూర్యనారాయణ ఏదో చెప్పడానికి నోరు తెరవబోయాడు!

వెంటనే అన్నారు వేదమూర్తిగారు "వద్దు! ఏమీ చెప్పడానికి ప్రయత్నించవద్దు! ఇది నిర్బంధం!"

ఆయన చెప్పిన తీరుకి ఎవరూ మాట్లాడ లేదు!

కాసేపటికి సులోచనే అన్నది "తప్ప కుండా వస్తాము మావయ్యగారూ! మీరు చెప్పినట్లు మీ ఆశయం చాలా గొప్పది! పైకి చూస్తే సింపుల్‌గానే కన్పిస్తూన్నా తరచి ఆలోచిస్తే కాని, అందులోని నగ్నస త్యాలేమిటో తెలియవు! మీ కోరిక ప్రకారమే వస్తాము! ముఖ్యంగా, చరితకు గాలి మార్పుగా కూడా ఉంటుంది"

వేదమూర్తిగారు తేలికగా నిట్టూర్చి అన్నారు. "నేను కోరుకునేది అదేనమ్మా! ఇక మేము బయలుదేరతాము"

"అదేమిటి భోజనాలు చేసి వెళ్ళండి నాన్నగారూ!"

"లేదురా! ఇంత పెందరాడే అలవాటు లేదు! అదీకాక ఇపుడు భోజనాలు పెట్టు కుంటే ప్రయాణం చేయలేను! ఈసారి చాలా దూరప్రయాణం కూడాను! విశాఖప ట్టణం!"

"అక్కయ్య దగ్గరకా?"

"అవును! గౌరీ మనోహరి దగ్గరకి!"

"ఇంకా రెండు రోజులు ఉండి వెళ్ళు తాతయ్యా!" అని చకిత అంటే,

"సాయీ, నువ్వయినా ఉండవచ్చుగా! తొందరేమిటి? " అంటూ సులోచన అడిగింది!

"లేదు అక్కా! మామయ్యతో నేనూ వెళ్ళాలి!" అంటూనే బాగ్ సర్దడంలో నిమగ్నమయాడు సాయికృష్ణ.

వేదమూర్తిగారు అన్నారు "నావెంట సాయి లేకపోతే ఎలా? అసలు ఈ ప్రయత్నానికి నాందీ ప్రస్తావన చేసిందే సాయి! ఈ ఆశయానికి బీజం నాటింది వాడే"

కాసేపటికి ఇద్దరూ బయలుదేరుతూ "మీకు ఆఫీసులకు వెళ్ళేటైమ్ అయినట్లుంది! మీరు రెడీ అవండి!" అన్నారు వేదమూర్తిగారు.

ఆటో రాగానే ఇద్దరూ ఎక్కారు!

★ ★ ★

విజయవాడలో ఒకరోజు పూర్తిగా విశ్రాంతి తీసుకున్నారు!

కాత్యాయనికి హైదరాబాదు, వరంగల్ విశేషాలు చెప్పడంతోనే ఒక పూటంతా గడిచిపోయింది!

అంతా విని నవ్వుతూ అడిగింది కాత్యాయని "ఇంకా మీ యాత్రలో మజిలీలు ఏవేమిటి? "

"విశాఖపట్టణంలోని మనమ్మాయి, రాజమండ్రిలో నా తమ్ముడు, ఏలూరులో నా చెల్లెలు, రేపల్లెలో నీ చెల్లెలు,మరిదిదగ్గరకు వెళ్ళాలి!"

ఆఖరున అన్న మాటలతో కాత్యాయని చప్పున కళ్ళెత్తిచూసింది! రేపల్లె విషయం ఆమె ఊహించలేదు!

ఆయన అన్నారు, "ఏం కాత్యా! మన వాళ్ళు అంటే నా చెల్లెలు, నా తమ్ముడు మన పిల్లలేనా? నీ చెల్లెలు నీ తరపువాళ్ళు మనవాళ్ళు కారా? నీలాంటి అపురూపమయిన వరాన్ని నాకు ప్రసాదించిన నీ కుటుంబంలో నీకంటూ మిగిలింది ఒక్క నీ చెల్లెలు కామేశ్వరి! వారు లేకుండా మన సమారాధన పరిపూర్ణం కాదు!"

కళ్ళు చెమరుస్తుంటే, మనసులోనే భగవంతుడికి వేలవేల నమస్కారాలు చేసింది, అలాంటి భర్తని ఇచ్చినందుకు!

ఆ రాత్రి భోజనాలు చేసి ఇద్దరూ విశాఖపట్టణం బయలుదేరారు! తమతోపాటు ఆకృతిని కూడా తీసుకువెళ్ళాలనుకున్నారు కాని తర్వాత రెండుమూడు ఊళ్ళు తిరగాల్సి ఉండటంతో ఆ ప్రయత్నం మానుకున్నారు!

అదీకాక రెండుమూడు రోజుల్లో ఆకృతికి యూనిట్ టెస్ట్‌లు ఉన్నాయి!



విశాఖపట్టణం చేరేసరికి విపరీతమయిన వర్షం! ఆకాశం దట్టమయిన, నల్లటి మేఘాలతో కమ్ముకుపోయింది!

ఆ వర్షంలో స్టేషన్‌నుండి సిటీబస్సులో ఇంటికి చేరేసరికి, దాదాపు ఉదయం పది గంటలవుతోంది!

వెళ్ళేసరికి అల్లుడు మోహన్ అప్పటికే హాస్పిటల్‌కి వెళ్ళిపోయాడు!

గౌరీ మనోహరి కూడా అపుడే బయలుదేరబోతూ, ఎదురు వస్తున్న తండ్రిని, ఆ వెనకే ఉన్న సాయికృష్ణని చూసి ఆగిపోయింది!

"నాన్నా! తండి! చాలా రోజులయింది" అంటూ ఆయన చేయిపట్టుకుని లోపలకు తీసుకువెళ్ళింది!

"గౌరీ! ఈ కుర్రాడెవరో గుర్తుపట్టావా? "

ఆలోచిస్తున్నట్లుగా ముఖం పెట్టింది గౌరీ మనోహరి! ఎంత సేపటికీ తట్టలేదు! చిరునవ్వుతో ఆమెని పరిశీలిస్తూ ఉండిపోయాడు సాయికృష్ణ!

ఆమె వయసు నలభయి సంవత్సరాలు ఉంటాయి. కృష్ణమూర్తి, సూర్యనారాయణల కంటే ఆమె మంచి రంగు! ఎత్తుకు తగ్గలావుతో, అందమయిన ముఖంతో ఉన్న ఆమెలో ఎవరినయినా చప్పున ఆకర్షించేది, కొనదేలి పొడవుగా చెక్కినట్లున్న ముక్కు, దానిమీద తళతళలాడే తెల్లరాయి ముక్కుపుడక!

పరిశీలనగా చూస్తే తప్ప, ఆ కళ్ళకింద నల్లటి చారికలు, కళ్ళల్లో లీలగా తొంగి చూసే ఏదో పోగొట్టుకున్న వెలితిలాంటి భావం, పైకి నవ్వుతూ కన్పిస్తున్నా ఆ వెనకే అంటిపెట్టుకున్న ఏదో తెలియని విషాదం కన్పించవు!

ఇవన్నీ క్షణాలలోనే సాయికృష్ణ చురుకైన బుర్ర పసిగట్టేసింది!

"నీ సత్యవతి అత్తయ్య కొడుకే! సాయికృష్ణ" తండ్రి చెప్పగానే, అపుడు గుర్తు కొచ్చినట్లుగా, అబ్బురంగా చూసింది సాయివైపు.

"నమస్తే వదినా!" నవ్వుతూ అన్నాడు సాయికృష్ణ!

"అత్తయ్య- మామయ్య ఎలా ఉన్నారు సాయీ? ఎన్నాళ్ళయింది చూసి? " బాగున్నారంటూ తల ఊపాడు!

అపుడు అడిగింది గౌరి "ఆకృతి ఎలా ఉన్నది నాన్నా బాగా చదువుతున్నదా? "

"ఆహా! నీ కన్నకూతురు కుశలము గురించి నువ్వు అడుగుతున్నావు! అలాగే తన కన్నకూతురి కుశలము అడగమన్నదే మీ అమ్మ!"

కొంచెం సిగ్గుపడ్డట్లయి అన్నది "అమ్మ ఆరోగ్యం ఎలా ఉన్నది నాన్నా? "

"డాక్టరువి! నువ్వు దగ్గరుండి చూసి చెప్పాలి! మన యింటికి వచ్చి ఎన్నాళ్ళయిందో గుర్తుందా? క్రితం సెలవలకు కూడా ఆకృతినే తీసుకువచ్చి ఇక్కడ దిగవిడిచాను కాని, నువ్వు మాత్రం రానేలేదు" నిష్టూరంగా అన్నారాయన.

"ఎక్కడ నాన్నా! సెలవు పెట్టడానికి మావి గవర్నమెంట్ జాబ్స్ కావు! పోనీ ఒక్కపూట రెస్ట్‌తీసుకుందామంటే ఏ పేషెంట్‌కో సీరియస్‌గా ఉన్నదని హాస్పిటల్ నుండి ఫోన్లమీద ఫోన్లు!" నిట్టూరుస్తూ చెప్పింది!

ఆ సమాధానం ఊహించినదే కాబట్టి ఆయన పెద్దగా రెట్టించలేదు.

ఈలోపు గౌరి వెళ్ళి ఇన్‌స్టెంట్ కాఫీ కలిపి తెచ్చిఇస్తూ అడిగింది "స్నానాలు చేస్తారా నాన్నా!"

"ఒక అరగంట ఆగి చేస్తామమ్మా!" కాఫీ తాగుతూ చెప్పారాయన!

రెండు నిముషాల మౌనం తర్వాత అడిగారు "అర్పిత ఎలా ఉన్నది గౌరీ! బాగా చదువుతోందా? మెడ్రాస్ నుండి ఎపుడొస్తుంది? "

ఆ ప్రశ్నకి, గౌరి వెంటనే సమాధానం చెప్పలేదు!

రెండు క్షణాల తర్వాత చిన్నగా గొణిగిన ట్లుగా అన్నది "అర్పిత- ఇక్కడే ఉన్నది నాన్నా!"

సంభ్రమంగా అడిగారాయన "ఏదీ? ఎక్కడ? కన్పించదే? చాలా రోజులయింది సుమా మా చిన్నడాక్టరుగారిని చూసి" నవ్వారు

గౌరి నవ్వలేదు సరికదా ముఖం మ్లాన మయింది "ఇక్కడ కాదు నాన్నా హాస్పిట ల్‌లో! మన హాస్పిటల్‌లోనే ఉన్నది"

వెంటనే వేదమూర్తిగారి మనసు ఏదో కీడును శంకించింది! అయోమయంగా అడి గారు "గౌరీ! అర్పితకు ఏమయింది తల్లీ!"

"నాన్నా!" కంఠం వణుకుతుంటే, ఏదో చెప్పబోతూ, మళ్ళీ సాయికృష్ణని చూసి సందేహంగా ఆగిపోయింది! కళ్ళు వాల్చి తల వంచుకుని ఉండిపోయింది.

కూతురి బాధను అర్థం చేసుకున్నట్లుగా ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుని ఆప్యా యంగా నొక్కి అన్నారు "ఫరవాలేదు గౌరీ! చెప్పు! సాయి మనవాడే. ఎలాంటి వార్త అయినా మనమధ్యే ఉండిపోతుంది. నిర్భ యంగా చెప్పు"

అతి కష్టం మీద చెప్పింది గౌరి, "దూరాన ఉన్నా శ్రద్ధగా చదువుతోందని అనుకున్నాము నాన్నా! అది కూడా డాక్టర యితే మన హాస్పిటల్‌లోనే ప్రాక్టీసు పెట్టిం చాలని కలలు కన్నాము నాన్నా! కాని మా కలలు, కోరికలు అన్నింటినీ ముక్కలు చేస్తూ అర్పిత చేయకూడని పెద్ద పొరపాటు చేసేసింది! ఏ ప్రలోభానికే లొంగిందో, ఏ ఆశలకే లోబడిందో అంత పిచ్చిగా ఎలా మోసపోయిందో దానికే తెలియాలి. తన పేరుని సార్థకం చేసుకుంది నాన్నా! తన శీలాన్ని ఎవడికో అర్పించింది. ఆ ప్రేమి కుడు అవసరం తీరాక తన దారి తను చూసుకున్నాడు"

"గౌరీ" పిడుగులు పడ్డట్లు చూశారు వేద మూర్తిగారు!

సాయికృష్ణ సూటిగా ఆమె కళ్లల్లోకి చూడ లేక తల వంచుకుని, చేతిలోని కాఫీ కప్పును చేతిలో తిప్పుతూ ఉండిపోయాడు.

భయంకరమయిన ఆ నిశ్శబ్దంలోనుండి నెమ్మదిగా చెప్పింది గౌరి! "అవును నాన్నా! నా కూతురుకి నేను అబార్షన్ చేశాను! ప్రస్తుతం మన హాస్పిటల్‌లోనే ఉంది" కళ్ల ల్లోనీళ్లు నిండుతుంటే తలవంచుకుని చెప్పింది.

"గౌరీ నువ్వు డాక్టరువి! అల్లుడుగారు డాక్టరు! ఇంకా ఏం సంపాదించాలని? ఇంకా ఎంత కూడబెట్టాలని ఈ పరుగులు. నిజం చెప్పు! నీకు సుఖం ఉన్నదా? నాలుగు చేతులా సంపాదిస్తున్నారు! మన శ్శాంతి అన్పిస్తోందా? అటు పెద్ద కూతు రుని దూరంగా ఉంచారు, ఇటు చిన్న కూతురుని దూరం చేసుకున్నారు. పిల్లలతో కలిసి చేయనిసంసారం ఎందుకమ్మా? ఇలా అన్నానని వేరేగా అనుకోకు! కన్న తండ్రిగా చెబుతున్నాను! అంతే!"

"నిజమే నాన్నా! మెడిసన్ అంటూ అర్పి తను దూరంగా ఉంచి పొరపాటు చేశామా అని నాకిపుడు అన్పిస్తోంది"

"డాక్టరు మీద నీకంత ముచ్చటగా ఉంటే హాయిగా డాక్టర్లని అల్లుళ్లుగా తెచ్చుకోండి!"

"ఏమో నాన్నా! పెళ్లి అనే మాట వింటుం టేనే గుండెలదిరిపోతున్నాయి. ముందర ఈ షాక్‌నుండి ఎప్పటికి కోలుకుంటామో అర్థం కావడంలేదు. అర్పిత ముఖం చూస్తూ ఉంటే అది ఏం అఘాయిత్యం చేస్తుందోనని భయమేస్తోంది. అందుకే దానిని మేము పల్లెత్తు మాట అనలేదు. అని మాత్రం ప్రయోజనం ఏముంది చెప్పు అంతా జరిగిపోయిన తర్వాత! మాకయితే దాని భవిష్యత్ తలచుకుంటూ ఉంటే ఈ దిగులుతోనే చచ్చిపోతామేమోనని అన్పి

స్తోంది. నిజం చెప్పాలంటే జీవితం మీదనే విరక్తిపుడుతోంది" కళ్లల్లో నుండి నీళ్లు జల జల రాలుతుంటే ఏడుపు ఆపుకుంటూ అన్నది.

కూతురివైపు జాలిగా చూశారు వేదమూర్తిగారు. "ఊర్కోతల్లీ! ఒక్కొక్కసారి మనల్ని కర్మసిద్ధాంతం కాపాడినట్లుగా ఏదీ ఆదుకోలేదు! కానీ ఎవరి రాతలు, ఎవరి ఖర్మలు ఎలా రాసిపెట్టి ఉంటే అలాగే జరుగుతాయి. మన చేతుల్లో ఏమీలేదు గౌరీ! తల్లిగా నీ కర్తవ్యం నెరవేర్చావు. డాక్టరుగా నీ కూతురి పరువు కాపాడావు"

"ఏమో నాన్నా! భవిష్యత్ తలచుకుంటూ ఉంటే భయం వేస్తోంది. కనీసం ఆకృతి విషయంలోనైనా" ఇంకేదో చెప్పబోతుంటే ఫోను మోగింది. లేచి వెళ్లి ఫోన్ మాట్లాడి వచ్చి చెప్పింది "మీ అల్లుడుగారు నాన్నా! ఇంకా హాస్పిటల్‌కి రాలేదేమిటని అడిగితే ఈ పూటకు రానని చెప్పాను. మీరొచ్చారని చెప్పాను. ఈ పూట త్వరగా ఇంటికి వస్తానని చెప్పమన్నారు"

గౌరి ఈలోపు పనిమనిషిని పురమాయించి, ఇద్దరికీ నీళ్లు పెట్టించి స్నానంచేసి రమ్మంది. పనిమనిషి సాయంతో వంట మొదలెట్టింది.

పనిమనిషి అంటే ఆ అమ్మాయికి ఇరవయి ఏళ్లు ఉంటాయి. భార్యాభర్తలు, ఇద్దరూ బిజీగా ఉంటారు కాబట్టి, ఆ అమ్మాయిని ఇంట్లోనే ఉంచుకున్నారు. ఆ అమ్మాయి ఇంటి పనితో పాటు, వంట పనిలో కూడా సహాయపడుతు, గౌరీ మనోహరికి చేదోడు వాదోడుగా ఉంటుంది!

భోజనాల ముందు చెప్పారు వేదమూర్తిగారు "సాయంత్రం సింహాచలం వెళ్లి వస్తాం గౌరీ"

"వెళ్లిరండి నాన్నా!" అని చిన్నగా నిట్టూర్చి చెప్పింది "ఏమిటో! విశాఖపట్టణం వచ్చి ఎనిమిది సంవత్సరాలు అవుతోంది!మేము సింహాచలం నాలుగుసార్లు కూడా వెళ్లి ఉండము!"

"అదేమిటి? ఇంట్రస్ట్ లేకనా? " అడిగాడు సాయికృష్ణ.

"అదేం కాదు! కుదరక తీరిక దొరకక, వెళ్లాలని అయితే ఉంటుంది. ఎప్పటికపుడు ఏదో అవాంతరం!"

వేదమూర్తిగారు అన్నారు "లేదు! తీరిక దొరకక, కుదరక అంటే నేనొప్పుకోను గౌరీ. మీ దృష్టి అంతా డబ్బు సంపాదన మీద ఉన్నది! మీ ధ్యాస అంతా ప్రాక్టీసు పెంచుకోవడం మీద ఉన్నది. ఇక సరదా, షికారు అనేవి ఎందుకుంటాయి? సిన్సియర్‌గా చెప్పు"

సమాధానం చెప్పలేనట్లు మొహమాటంగా నవ్వింది గౌరి.

భోజనాలు అయిన తర్వాత మనసులో చాలా బాధపడ్డారు వేదమూర్తిగారు! మనసుకు హాయినిచ్చే కబుర్లతో చేయాల్సిన భోజనాల ముందర, కూతురుని హర్ట్ చేసేలా అనవసరమయిన డిస్కషన్స్‌లోకి దించి తోచిన సలహాలు ఇచ్చి వాతావరణాన్ని అనవసరంగా కలుషితంచేసి, టేబుల్ మానర్స్ పాటించనందుకు తనలో తానే నిందించుకున్నారు.

వాడిపోయిన కూతురు మొహం చూస్తుంటే ఆ ఫీలింగ్ మరీమరీ అన్పించింది. ప్రతి ఇంట్లోనూ పరిస్థితి చూసి మాష్టారులా సలహాలు, సందేశాలు ఇవ్వడమే తన జీవితధ్యేయమన్నట్లుగా ప్రవర్తిస్తున్నాడు తను. వాళ్ల బాధలు చెప్పమని ప్రోత్సహించి, సలహాల రూపంలో మరీ బాధను రెట్టింపు చేస్తున్నాడు తను!

ఉచిత సలహాలు ఇవ్వడం తేలికే కాని ప్రాక్టికల్‌గా ఆచరణలోకి వచ్చేసరికి, అవి ఎంత కష్టసాధ్యమో, అనుభవించేవారికే తెలుస్తుంది.

నదిమధ్యన కొట్టుకుపోతున్న వ్యక్తికి "ఆ కొమ్మపట్టుకో! ఇటువైపురా! నీళ్లు మింగ మాకు!" అంటూ ఒడ్డున కూర్చుని సలహాలు ఇవ్వడం తేలికే!

కానీఅతని పరిస్థితులు కూడా దృష్టిలో పెట్టుకోవాలికదా!

"మామయ్యా!" సాయి కృష్ణ పిలుపుతో ఉలిక్కిపడ్డారాయన.

"ఏమిటి మామయ్యా! ఆలోచిస్తున్నారు?"

"ఎంత కొడుకులు, కూతుళ్లూ అయినా వారి విషయాలలో మితిమీరి చనువు తీసుకుంటున్నానేమో, వారి స్వంత విషయాలలో ఎక్కువగా జోక్యం చేసుకుంటున్నానేమో అనే భయం వేస్తోంది సాయీ!"

"ఛ మీరే ఇలా అంటే చిన్నవాడిని నేను ఏమనుకోవాలి? లేదు మామయ్యా! ఇపుడు మాలాంటి వాళ్లకి కావాల్సింది మీలాంటి పెద్దల సలహాలే! నిజానికి మీరు చాలా సౌమ్యంగా చెబుతున్నారు.కాని ఆ డోస్ కూడా చాలదేమోననిపిస్తోంది మామయ్యా. మీరు చెప్పే ప్రతినిజం ఒక కొరడా దెబ్బలా తగిలితే తప్ప మనుషులు ఊబిలోనుండి బయటపడరు"

"అంతేనంటావా సాయీ" కొంచెం దిగాలుగా అన్నారు.

"అక్షరాలా. మనం కోరుకున్న మార్పు రావాలంటే ఇంతకంటే కఠినవైఖరి అవలంబించడమేకాదు, ఎప్పటికప్పుడు ఎదుటివారి తప్పొప్పులు నిర్మొహమాటంగా బయటపెడుతూ ఉండటమే శ్రేయస్కరం. అంత్యనిష్ఠూరం కంటే ఆది నిష్ఠూరమే ఎప్పటికయినా మంచిది"

వాళ్లు మాట్లాడుతుండగానే వేదమూర్తి గారి అల్లుడు, "డాక్టర్‌మోహన్ ఎమ్మెస్" వచ్చాడు.

అతని వయసు నలభయి అయిదు వరకూ ఉండవచ్చు

మోహన్ ముఖం చూడగానే "డ్రింక్"కి అలవాటు పడ్డాడని ఈజీగా తెలిసిపోతుంది. కళ్లల్లో ఎర్రటి చారికలు, కళ్లకింద ఉబ్బెత్తుగా ఉండి, ఎపుడూ ఆలోచనల్లోపడి కొట్టుకుపోతున్నట్లుగా కొంచెం సీరియస్‌గా ఉండేముఖం, అక్కడక్కడా నెరిసిన జుట్టుపాయలు, గౌరీ మనోహరికి తగినట్లుగా ఎత్తుగా లావుగా ఉన్నాడు.

మోహన్ చిరునవ్వుతో మామగారితో సాయికృష్ణతో ఓ అయిదు నిముషాలు గడిపాడు. పేషెంట్లు, కొత్తరకాల రోగాల గురించి మినహా ఎక్కువగా మిగతా విషయాలు మాట్లాడలేకపోయాడు. మధ్యలో అత్తగారి ఆరోగ్యం గురించి, ఆకృతి చదువు గురించి ఎంక్వయిరీ చేశాడు. సాయికృష్ణ రాకపట్ల ఆనందం, వెలిబుచ్చాడు.

నిజానికి అంతకుమించి ఎక్కువగా మాట్లాడుకోడానికి వాళ్ల మధ్యన వేరే విశేషాలు ఏమీలేవు.

కాసేపు కూర్చుని, భోజనం చేసి తన గదిలోకి వెళ్లి పడుకున్నాడు!

గౌరి ఏవో మెడికల్ జర్నల్స్ తిప్పుతూ ఉండిపోయింది.

వేదమూర్తిగారు కాసేపటికి నిద్రలోకి జారుకున్నారు.

వాతావరణం బాగా చల్లగా ఉండి, సన్నటి తుంపరలు పడుతూ ఆహ్లాదకరంగా ఉంది. సాయంత్రం నాలుగవగానే వేదమూర్తిగారు, సాయికృష్ణ లేచి స్నానాలు చేసి సింహాచలం బయలుదేరారు.

వాళ్లు వెళ్లేటపుడు గౌరి టీపెట్టి ఇచ్చింది. మోహన్ గదిలో నిద్రపోతున్నాడు. సింహాచలంలో దాదాపు రెండు గంటలసేపు గడిపారు ఇద్దరూ. మత్తయిన సింహాచలం సంపెంగల పరిమళం అనుక్షణం వెంటాడుతూనే ఉంది వారిని.

అక్కడినుండి, ఇంటికి రాకుండా సరాసరి కూతురు అల్లుడు ఉండే హాస్పిటల్‌కి వెళ్లారు.

మోహన్ ఎదురుగా నలుగురయిదుగురు పేషెంట్లు ఉన్నారు. మామగారిని, సాయిని చూసి పలకరింపుగా నవ్వాడు. పక్కనే ఉన్న గౌరి రూమ్‌లోకి వెళితే ఆమె ఎదురుగా ఇద్దరు ఆడ పేషెంట్లు ఉన్నారు. తండ్రిని చూడగానే గౌరి వెంటనే లేచి, పేషెంట్లను కూర్చోమని చెప్పి కూతురు ఉన్న గదిలోకి తీసుకెళ్లింది.

ముగ్గురూ గదిలోకి వెళ్లేసరికి,మంచం మీద కళ్లు మూసుకుని పడుకున్న అర్పిత ఉలిక్కిపడి కళ్లు తెరిచింది.

"అర్పితా!" చిన్నగా పిలిచారు వేదమూర్తి గారు.

మొదట అయోమయంగా చూసి తర్వాత గుర్తుపట్టినట్లుగా అన్నది "తాతయ్యా!" ఆ మూడు అక్షరాలకే గొంతు పూడుకుపోయి కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

వెంటనే పక్కకు వత్తిగిలి దిండులో ముఖం దాచుకుంది.

సాయికృష్ణ మౌనంగా ఓ వారగా నిలబడి చూస్తుండిపోయాడు.

వేదమూర్తిగారికి మనవరాలిని ఎలా ఓదార్చాలో తెలియడంలేదు. మంచి రంగులో ఎంతో అందంగా నిండుగాఉండే అర్పిత, సన్నగా చిక్కిపోయి పాలిపోయి నీరసంగా ఉంది.

"అర్పితా కొట్టడానికి చిన్న పిల్లవుకాదు! బుద్ధీ జ్ఞానం కలిగి మెడిసన్ చదువుతున్న తెలివిగల పిల్లవు! ఇంత తేలికగా ఎలా మోసపోయావు పిచ్చిపిల్లా! అని నిందించను! అంత మత్తులో ఎలా మునిగిపోయావు తల్లీ అని మందలించను. ఎందుకంటే చేతులుకాలిపోయాయి. మనకు మిగిలింది పశ్చాత్తాపమే! కానీ అన్నింటికీ ఆ భగవంతుడే ఉన్నాడు అని సర్ది చెప్పుకోవడం మినహా చేయగలిగింది ఏదీ లేదు. పరువూ మర్యాదగల డాక్టర్ల కుటుంబం మీది. నీకు సరైన జ్ఞానం కల్గించలేని ఈ చదువులు మనకు వద్దు అర్పితా. వచ్చేయ్! హాయిగా నీ తల్లితండ్రుల నీడలో బాధ్యతగా జీవించు"

"తాతయ్యా! మోసపోయాను తాతయ్యా! ఆ రాస్కెల్, ఆ స్టుపిడ్ నన్ను దారుణంగా మోసం చేశాడు తాతయ్యా! నన్ను నమ్మించి, ప్రేమిస్తున్నానని నటించి మోసంచేసి నన్ను నన్ను..." ఆ పైన గొంతు పూడిపోయి మాటలు రాక ఆగిపోయింది. "నెల తప్పిందని తెలుసుకుని వాడి అడ్రెస్ ఎంక్వైయిరీ చేసి ఇంటికి వెళితే అపుడు తెలిసింది తాతయ్యా! వాడికి పెళ్లి అయి, ఇద్దరు పిల్లలు కూడానట! నేను మోసపోయాను. దారుణంగా మోసపోయాను తాతయ్యా!" చేతుల్లో ముఖం దాచుకుని రోదిస్తుంటే గబుక్కున మంచంమీద కూర్చుని, అర్పిత చేతిని తన చేతుల్లోకి తీసుకుని, తల నిమురుతూ అన్నారాయన.

"వద్దు! మర్చిపో అర్పితా! జరిగిపోయింది ఒక పీడకల అనుకో! నీ అదృష్టం ఏమిటంటే ఇలాంటి తల్లితండ్రులు ఉండటం! అదే ఇంకొకరయితే నిన్ను ఇంట్లో కూడా అడుగు పెట్టనిచ్చేవారు కాదేమో! కసాయిగా ప్రవర్తించేవారేమో! కాని నీ తండ్రి నిన్ను అర్థం చేసుకుని అక్కున చేర్చుకున్నారు. నీ కడుపులో రేగిన గాయానికి మందువేసి నిన్ను మామూలు మనిషిగా చేసిందమ్మా నీ తల్లి! నువ్వు జన్మజన్మలకి వాళ్లకి ఋణపడి వున్నావు తల్లీ! ఇంత జరిగాక కూడా పెదవి విప్పక, బడబాగ్నిని గుండెల్లోనే నెట్టేసి నీకంటే రెట్టింపు బాధని మౌనంగా భరిస్తున్న నీ తల్లితండ్రుల ఋణం తీర్చుకునే మార్గం ఒక్కటే అర్పితా! నీకు పీడకలగా మిగిలిపోయిన మెడ్రాసు జీవితానికి గుడ్‌బై కొట్టేసి నీ ఇంట్లో నీ తల్లితండ్రుల

నీడలో పాలిపోయిన నీ జీవితాన్ని పచ్చగా మలచుకోవడం!"

"అవును తాతయ్యా! నేనూ అదే నిర్ణయానికి వచ్చాను!"

ఇంతలో చేతిలో ఇంజెక్షన్‌తో నర్స్‌వచ్చి అర్పిత పక్కనే నిలబడింది.

వేదమూర్తిగారు మంచం మీదనుండి లేచి నిలబడి అపుడు గమనించారు, కూతురు ఆ రూమ్‌లో నుండి వెళ్లిపోయిన సంగతి.

వేదమూర్తిగారు వెళ్లబోతూ చెప్పారు. "అర్పితా! ఇంతవరకూ నీకు పరిచయం చేయలేదుకదూ! బహుశా నువ్వు విని ఉంటావు! ఇతను సాయికృష్ణ అని నా చెల్లెలి కొడుకు! అంటే నీకు బాబయ్య అవుతాడన్నమాట! అంతేకాదు అర్పితా!మేము ఒక మంచిపనికోరి మన వాళ్లందరినీ కలుపుకుని వస్తున్నాము! ఎందుకనేది తర్వాత వివరంగా చెబుతాను. కాని ఈ నెలాఖరున ఆఖరి కార్తీక సోమవారం రోజున విజయవాడలో మన ఇంట్లో ఫిక్స్ చేసిన ప్రోగ్రామ్‌ని మాత్రం పొరపాటున కూడా మిస్ చేయవద్దు. ఎందుకంటే అది మన కోసం, మనందరికోసం. మీ కుటుంబ సభ్యులు అందరూ వస్తున్నారు"

"వస్తాను తాతయ్యా! తప్పక వస్తాను. ఈ పీడకలని మర్చిపోవాలంటే కొంతకాలం వాతావరణం, ఊరుమార్పు అవసరం"

"వెరీగుడ్! నీలో ఆ ఆత్మవిశ్వాసం ఉంటే చాలు! ఇక ఉంటాను అర్పితా" అని ముందుకు నడిస్తే సాయికృష్ణ కూడా అర్పితకు చెప్పి ఆయనను అనుసరించాడు.

అంతసేపూ ఓపికగా నిల్చున్న నర్సు ఇంజెక్షన్ చేసి వెళ్లిపోయింది.

వేదమూర్తిగారు, సాయికృష్ణ ఆటోలో ఇంటికి వచ్చేశారు.

కూతురు, అల్లుడు గంట తర్వాత వస్తామన్నారు! ఇంట్లో పనిమనిషి ఒక్కతే ఉంది. ఆ వాతావరణం, ఒంటరితనం చూస్తూ ఉంటే వేదమూర్తిగారికి ఏమిటోగా ఉంది. కూతురుకాని, అర్పితకాని ఇంట్లో ఉండి ఉంటే ఎంత బాగుండేది? అన్పిస్తోంది. అన్నీ ఉండి, విశాలమయిన ఆ ఇంట్లో ఏదో లోపం కొట్టొచ్చినట్లు కన్పిస్తోంది. అది బహుశా ఇంట్లో మనుషుల సందడి లేకపోవడం కావచ్చు

మర్నాడు ఉదయం, కాఫీ, టిఫిన్ అయిన తర్వాత వేదమూర్తిగారు కూతురుని అల్లుడిని కూర్చోపెట్టి తన రాకలో ఉద్దేశ్యం తన ఆశయం గురించి వివరించి ఆ రోజుకి విజయవాడ వచ్చేలా గట్టిగా చెప్పించుకుని మరీ బయలుదేరారు.

తరువాతి మజిలీ రాజమండ్రికి.

★ ★ ★

రాజమండ్రి ప్రయాణంలో ట్రెయిన్‌లో తాము వెళ్లబోతున్న కుటుంబం గురించి చెప్పారు వేదమూర్తిగారు "సాయీ! ఇంతవరకూ మనం వెళ్లింది. నా పిల్లల దగ్గరకి. ఇద్దరు కొడుకులు, కూతురు. ఇపుడు వెళ్లబోతున్నది నా తమ్ముడు భానుమూర్తి దగ్గరకి! వాడి గురించి క్లుప్తంగా వివరిస్తాను. భానుమూర్తి

మొదట్లో అక్కడక్కడా చిన్నా చితకా ఉద్యోగాలు చేసినా తర్వాత చిట్‌ఫండ్ కంపెనీ పెట్టి రాజమండ్రిలోనే సెటిల్ అయిపోయాడు. డబ్బు కూడా బాగానే సంపాదించినట్లున్నాడు. నా మరదలు పేరు ప్రమీల! వాళ్లకి ఒక్కడే కొడుకు చంద్రశేఖర్! అతను, ఇంజనీరు అయి ప్రస్తుతం అమెరికాలో ఉంటున్నాడు. చంద్రశేఖరానికి ఒక్కతే కూతురు.

ఆ అమ్మాయి పేరు రాగచంద్రిక. రాగ చంద్రిక ఉంటున్నది అమెరికాలో అయినా

మన సంస్కృతి సంప్రదాయాలు అంటే మంచి గౌరవం అట. రాగచంద్రికని ఎపుడో దాని ఎనిమిదవఏట చూశాను. అంతే! అదీ మళ్లీ ఇండియా వచ్చినట్లులేదు. అపుడెపుడో భానుమూర్తికి సుస్తిచేస్తే చంద్రశేఖరమే వచ్చి వెళ్లాడట. అంతకు మించిన వివరాలు తెలియవు. ఇక ఇపుడేమయినా కొత్త విశేషాలు మనం వెళితే కానీ తెలియవు''

ఆయన చెప్పేదంతా శ్రద్ధగా వింటూ ఉండిపోయాడు సాయికృష్ణ.

రైలులోనుండి చూస్తూఉంటే, గోదావరి జిల్లా అందాలు కనువిందు చేస్తున్నాయి. అందమయిన ప్రకృతికి ఆటపట్టయిన ఆ పరిసరాలు, మనసుకి హాయిని, ప్రశాంతతని కల్గిస్తున్నాయి.

ఇద్దరూ రాజమండ్రి చేరేటంతవరకూ, ప్రకృతిని ఆస్వాదిస్తూ ఉండిపోయారు. ఇంటికి చేరేసరికి వేదమూర్తిగారి మరదలు ప్రమీల ఒక్కతే ఉంది.

వాళ్లని చూస్తూనే "రండి! బావగారూ" అంటూ ఆహ్వానించింది.

వేదమూర్తిగారు సాయికృష్ణని పరిచయం చేసి, గుర్తుచేశారు.

"అవునవును! చూసి చాలా రోజులయింది" అని గబగబా వంటపనిలో పడింది.

తాను చూసిన వాళ్ళందరిలో బాగా లావుగా ఉన్న ఆకారం ఈ అత్తయ్య అనుకున్నాడు సాయికృష్ణ!

ప్రమీల పేరు నాజూకుగా ఉన్నా, భానుమూర్తి- ప్రమీల పక్కపక్కన నిలబడితే, భర్తకంటే భార్య రెట్టింపు సైజులో ఉంటుంది.

వంట చేస్తూనే, ఇద్దరికీ కాఫీ కలిపి ఇచ్చి మధ్య మధ్యలో వచ్చి కబుర్లు చెబుతోంది.

"ఏడమ్మాయ్! భానుమూర్తి ఇంటికి వచ్చే టైమ్ కాదా? "

"నిజానికి- ఇదే టైము బావగారూ! భోజనం చేసే వేళకూడానూ! కాని ఈమధ్యన మీ తమ్ముడుగారికి, షేర్ల బిజినెస్సు ఎక్కువయిపోయి, ఎప్పుడూ ఆ బ్రోకర్ ఆఫీసుని పట్టుకుని వ్రేలాడుతూ, ఇంటికి ఎప్పుడు వస్తారో, ఎప్పుడు భోజనం చేస్తారో ఆయనకే తెలియదు"

కొత్త క్యారెక్టరు- అనుకున్నాడు సాయి మనసులో!

"ఎలా ఉందేమిటి షేర్ బిజినెస్" అడిగారు ఆయన!

"ఏమో! ఆయనకే తెలియాలి. ఇంట్లో ఉన్న ఆ కాసేపయినా ఏమయినా మాట్లాడతారా? పలుకాడతారా? ఎప్పుడూ న్యూస్ పేపర్లు ముందు వేసుకుని, షేర్ల ధరలు, కొటేషన్లు చూడటంతోనే సరిపోతుంది. అనకూడదుకాని, విసుగొస్తోంది అనుకోండి బావగారూ!"

"అంతేగా మరి!" ఏమనాలో తోచక చప్పరించేశారు వేదమూర్తిగారు.

మధ్యలో వంటింట్లోకి వెళ్ళి కూర కలియపెట్టి వచ్చి మళ్లీ చెప్పింది. "ఇంతక్రితం ఆయన, మధ్యాహ్నం ఖచ్చితంగా టైముకి భోజనానికి వచ్చేవారు కాబట్టి, రోజూ ఆయన వచ్చేవరకూ కూర్చుని ఇద్దరం కలిసి భోజనం చేసేవాళ్ళం హాయిగా! ఇప్పుడు ఎప్పుడొస్తారో ఆయనకే తెలియదు. అందుకే ఆయన కోసం ఎదురు చూడటం మాని, నా పాటికి నేను శుభ్రంగా తినేస్తున్నాను. రాత్రి అయినా ఇదే వరస"

"చంద్రశేఖరం విషయాలు ఏమిటట? అమెరికానుండి ఉత్తరాలు వస్తున్నాయా? "

ఆ మాట రాగానే సంబరంగా చెప్పింది ప్రమీల, "అన్నట్లు మీకు చెప్పనేలేదుకదూ.

నా మనవరాలు రాగచంద్రిక ఇక్కడే ఉంది. ఇండియా వచ్చి వారం రోజులయింది"

ఆయన కూడా ఆశ్చర్యంగా, ఆనందంగా, ఆత్రంగా అడిగారు "రాగచంద్రిక వచ్చిందా? ఏదీ? "

"లైబ్రరీకి వెళ్ళింది. ఏవో నోట్సు రాసుకోవాలిట. మన సంస్కృతి, సంప్రదాయాలు, పండుగలు అన్నింటి గురించి ఏదో అధ్యయనం చేస్తుందట. అమెరికాలో వీటి అన్నింటి గురించి ఏవో ఉపన్యాసాలు ఇవ్వాలిట. ఏవో చాలా చెప్పింది. నాకయితే ఒక్కముక్క అర్థం కాలేదంటే నమ్మండి. చూస్తారుగా! వచ్చే టైమ్ అయింది"

కబుర్లు చెబుతూనే, తమాషాగా వంట పూర్తిచేసి అన్నది ప్రమీల, "ఒకరి కోసం కూర్చోడం అనవసరం. మీరు భోజనాలు కానిస్తే తర్వాత తీరికగా మాట్లాడుకోవచ్చు"

వారికీ అదే నిజమనిపించింది. ఉదయమెప్పుడో తిన్న టిఫిన్. అందుకే ఆకలి కూడా బాగా వేస్తోంది.

ఇద్దరికీ వంటింట్లో పీటలు వేసి, విస్తళ్ళలో వడ్డించింది.

ఇద్దరూ, భోజనాలు చేసి హాల్లోకి వచ్చి కూర్చున్న అయిదు నిముషాలకి ఇంటికి వచ్చింది రాగచంద్రిక.

ఇరవయిఏళ్ల ఆ అమ్మాయిని చూడగానే సాయికృష్ణ కళ్ళముందు మెరుపులు మెరిసినట్లయింది. ఒక్కసారిగా పున్నమినాటి వెన్నెల ఆ గదిలో పరచుకున్నట్లయింది. క్షణంసేపు నోటమాట రానివాడిలా, స్తబ్దుడయినట్లుగా అలాగే ఉండిపోయాడు.

నెమలిపింఛం రంగు పట్టులంగామీద, పాలనురుగులాంటి తెల్లటి ఓణి, జరీ అంచు ఉన్న నీలంరంగు బుట్ట జాకెట్టు, పిరుదుల వరకు వ్రేలాడుతున్న వాలుజెడా జడలో, గుత్తంగా పెట్టిన చేమంతిపూల చెండూ, మొగలిపూల రంగుతో పోటీపడే పసిమి ఛాయ, కొసలు తేలిన కళ్ళకి కాటుక, కనుబొమల మధ్యన ఎర్రటిబొట్టు, అరచేతులకి గోరింటాకు ఎర్రదనం, అందమయిన గుండ్రటి ముఖం.

మూర్తీభవించిన సంస్కృతిలా-

కళకళలాడుతున్న సంప్రదాయంలా-

పదహారణాలా- అచ్చ తెలుగు యువతిలా-

కళ్లెదుట నిలబడి చిరునవ్వుతో, చేతులు జోడించి, 'నమస్తే' చెబుతుంటే...

వేదమూర్తిగారు మనసు నిండుగా ఆశీర్వదించారు.

సాయికృష్ణ కనులనిండుగా పలకరించాడు.

రాగచంద్రిక చేతిలోని పుస్తకాలను భద్రంగా గుండెలకదుముకుని గదిలోకి వెళ్ళిపోయింది.

ఆ మెరుపు తాలుకు షాక్‌నుండి సాయికృష్ణ తేరుకునేలోగానే అతని చిన్న మామయ్య భానుమూర్తి వచ్చినట్లుగా వాకిట్లో లూనా ఆగిన శబ్దం అయింది. మరో రెండు క్షణాల్లో భానుమూర్తి లోపలికి అడుగుపెట్టాడు.

వెంటనే "హలో! అన్నయ్యా" అంటూ పలకరించి, ప్రశ్నార్థకంగా తల తిప్పేలోగానే వేదమూర్తిగారు చెప్పారు. "మన సత్య కొడుకురా, నీ మేనల్లుడు"

భానుమూర్తి ఆయన మాటలను మధ్యలోనే తుంచేస్తూ అన్నాడు "వద్దు! చెప్పవద్దు. నాకర్థమయిపోయింది. నువ్వు చెప్పకముందే గుర్తు పట్టేశాను. ఏరా! సాయీ! ఇన్నాళ్లకి గుర్తుకొచ్చామట్రా నీకు? మీ అమ్మా, నాన్నా ఏమయిపోయారు? నాకయితే మీమీద చాలా కోపంగా ఉంది. అరె! ఎక్కడ ఉన్నది? ఏమయిపోయింది? కనీసం కార్డుముక్క, ఆ మాత్రం ఆచూకీ తెలియకపోతే ఎలా అని? "

సాయికృష్ణ చిరునవ్వుతో చూస్తూ ఉండిపోయాడు.

వేదమూర్తిగారు తమ్ముడి వాక్ప్రవాహాన్ని అడ్డుకుంటూ, "నువ్వేనా? మమ్మల్ని కూడా మాట్లాడనిస్తావా? " అన్నారు.

"అది కాదు అన్నయ్యా"

"ముందు నువ్వు భోజనం చేసిరా! తీరికగా మాట్లాడుకుందాం"

"మీ భోజనాలు అయినాయా? "

అప్పుడే పెరట్లోనుండి వచ్చిన ప్రమీల అన్నది "ఆహా! మీరు ఎప్పుడు వస్తారో తెలియదు. అందుకే నేనే పెట్టేశాను. మీరూ రండి"

భానుమూర్తి బట్టలు మార్చుకుని, వెళ్ళి భోజనంచేసి వచ్చాడు.

రాగచంద్రిక లోపల ఏదో రాసుకుంటూ ఉండిపోయింది.

చాలాసేపు ప్రమీలే ఏవేవో కబుర్లు చెబుతూ, మధ్యమధ్యలో కొడుకు చంద్రశేఖరం అమెరికా కాపురం గురించి పొగుడుతూ మంచి కాలక్షేపాన్ని ఇచ్చింది.

భోజనం అవగానే, భానుమూర్తి ఓ అరగంటసేపు కూర్చుని, లేచి వెళుతూ,

"నేను వస్తానన్నయ్యా! ఆఫీసులో వర్కు చాలా ఉన్నది" అన్నాడు.

వేదమూర్తిగారు సాలోచనగా తల ఊపారు.

షేర్ల పిచ్చిలో మునిగి తేలుతుంటే, మరి, స్వంత ఆఫీసులో వర్కు పెండింగ్ పడక ఏం చేస్తుంది?

ఇంతక్రితం కొంచెం లావుగా, ఆరోగ్యంగా ఉండే భానుమూర్తి ఇప్పుడెందుకో బాగా పాడయిపోయాడు. బాగా నల్లబడిపోయాడు! భుజాలమీద పెనుభారం మోస్తున్నట్లుగా ముందుకి వంగిపోయాడు.

తనూ, భానుమూర్తి పక్కపక్కన నిలబడితే వాడు అన్న, తను తమ్ముడు అనుకునేలా మారిపోయారు.

తమ్ముడు వెళ్ళాక వేదమూర్తిగారు కాసేపు పడుకుని, సాయంత్రంవేళ స్నేహితుడి ఇంటికి బయలుదేరారు.

ఆయనతో సాయికృష్ణ వెళ్ళలేదు. ఉదయంనుండి బద్ధకంగా గడిపిన సాయికృష్ణకి, సరదాగా సినిమాకి వెళ్ళాలి అన్పించడంతో-ఇంటి దగ్గిరే ఉండిపోయాడు.

అటుతిరిగి కూర్చున్న సాయికృష్ణ వెనుకగా విన్పించింది తీయనైన పిలుపు!

"మామయ్యా!"

మొదట ఉలిక్కిపడ్డాడు. తర్వాత చకితుడయినట్లుగా చూశాడు.

గుమ్మం దగ్గర రాగచంద్రిక నిల్చుని ఉంది! భుజంమీదుగా, ముందుకు వేసుకున్న వాలుజడను చేతితో తిప్పుతూ అడిగింది "ఏమిటీ? బోర్ కొడుతోందా? "

దోసెడు మల్లెపూలుతో తలమీద అభిషేకం చేసినట్లుగా, చల్లటి మలయమారుత వీచికలు మనసును తాకినట్లుగా ఫీలయ్యాడు.

తనను వరసపెట్టి పిలిచిన మొట్టమొదటి అమ్మాయి.

"నిన్నే- మామయ్యా"

స్వప్నావస్థనుండి జారిపడి, తేరుకుని అవునన్నట్లుగా తలూపాడు.

"నేను గోదావరి గట్టు దగ్గరకి వెళుతున్నాను! వస్తావా? "

కాదని ఎలా అనగలడు?

ఇంతక్రితం ప్రతి మజిలీలోనూ ఒక విధమయిన 'భావాలతో' గడిపాడు. అవి ఎలాంటివి అంటే తేలికగా నిర్వచించుకోగలిగాడు. ఇబ్బంది, మొహమాటం, చిరాకు, విసుగు, విరక్తి లాంటివి...

కాని- ఈ అమ్మాయి సమక్షంలో మొట్ట మొదటిసారిగా, వాటి అన్నింటికీ అతీతమయిన భావమేదో కలుగుతోంది. మనసును పట్టి కుదుపుతోంది.

ఆ భావాన్ని ఏమంటారో ఊహించలేకపోతున్నాడు.

అత్తయ్యకు చెప్పి, ఇద్దరూ బయలుదేరారు.

అతని జీవితంలో, మరో అమ్మాయితో కలిసి కబుర్లు చెబుతూ, రోడ్డుమీద నడిచి వెళ్ళడమనే అనుభవం ఇదే మొదటిసారి!

అలాంటి అనుభవం, రాగచంద్రికతో అవడం అతనికి తీయని అనుభూతినిస్తోంది.

మనసులో అనుకున్నాడు.

"అందమయిన నా మేనకోడలు"

దాదాపు ఇరవయి నిముషాలు నడిచాక గోదావరి ఒడ్డుకి చేరారు.

గోదావరి నదిమీదనుండి వీస్తున్న పవన వీచికలకు మనసు పులకితమవుతోంది. ఆ గాలితీరు ఎన్నో జన్మల అనుబంధం గల ఆత్మీయులెవరో గుసగుసలాడుతూ, ఆహ్వానిస్తూ, చేతులతో కౌగిలించుకుంటున్నట్లుగా అన్పిస్తోంది.

ఇసుకలో కూర్చున్నారు ఇద్దరూ!

దాదాపు అయిదు నిముషాలవరకూ, మౌనంగా గోదావరిని, పడవలని, లాంచీలని, అందులోనుండి దిగుతున్న ప్రయాణికులని, పడవలలోనుండి దిగుతున్న చేమంతి పూలబుట్టలని, అందమయిన ఆ పరిసరాలను వీక్షిస్తూ గడిపారు.

కాసేపటికి కదిలినట్లయి పిలిచాడు సాయికృష్ణ!

"రాగచంద్రికా!"

తలతిప్పి చూసింది అతనివైపు.

"ఏమిటీ? అమెరికా విశేషాలు? "

అందమయిన పలువరస తళుక్కుమనేలా నవ్వింది.

"జీవితం ఎలా ఉంటుంది? సరదాగా ఎంజాయ్ చేసే అవకాశాలు ఎక్కువనుకుంటాను"

"మామయ్యా! ఆనందం అనేది మనసుకు సంబంధించినది. అది అమెరికాలో ఉన్నా, అనకాపల్లిలో ఉన్నా, మన మనసుకు నచ్చేదే మనం చేసే ఎంజాయ్‌మెంట్! నువ్వు చెప్పినట్లు, అవకాశాలు ఎక్కువగా ఉన్నా, అందుకోవడం అనేది, వారి వారి మనస్థత్వాలపై ఆధారపడి ఉంటుంది. నాకు మాత్రం మన కల్చర్ అంటేనే ఇష్టం. ముఖ్యంగా మనుష్యుల మధ్యన ఉండే మమతానురాగాలు, కుటుంబసభ్యుల మధ్యన బలంగా ఉండే అనుబంధాలు, మన వివాహవ్యవస్థ, నైతిక విలువలకు మనం ఇచ్చే ప్రాధాన్యత..."

చిన్నగా నవ్వాడు సాయికృష్ణ.

అర్థోక్తిలో ఆగి అడిగింది, "ఎందుకు నవ్వుతున్నావు? "

"ఏంలేదు. చెప్పు" సర్దుకుని అన్నాడు.

"ఒకవిధంగా చెప్పాలంటే- నాకు అక్కడికీ ఇక్కడికీ పెద్ద తేడా కన్పించడంలేదు. కారణం చెప్పమంటావా? ఇక్కడి సంస్కృతీ సంప్రదాయాలు. అన్నీ అక్కడ మేము లక్షణంగా పాటిస్తాం. అమెరికాలో ఒక్కో ఏరియాలో ఉండే మన తెలుగు వాళ్ళందరం ఒక అసోసియేషన్‌గా ఏర్పడి, మన పండుగలు, వ్రతాలు అన్నీ ఘనంగా, సరదాగా జరుపుకుంటాం. నెలకొకసారి అందరం కలుసుకుని, అందరం ఒకే కుటుంబసభ్యుల్లా కలిసిమెలిసి ఎంజాయ్ చేస్తాం. మాది 'తెలుగు కుటుంబం' అన్నమాట"

సాయికృష్ణ కళ్ళు మెరిశాయి. అందరూ కలిసి ఒకే కుటుంబసభ్యుల్లా కలిసి మెలిసి గడుపుతాం. అనే రాగచంద్రిక మాటలే అతనిని ఎంతగానో ఆకట్టుకున్నాయి.

ఇండియాలో, ఎవరికివారు విడిపోతుంటే, పరాయిదేశంలో అందరూ, ఒకటిగా కలవడ మనేది గొప్ప విషయం. ఒకవిధంగా అదీ నిజమే! పరాయి రాష్ట్రంలో మన తెలుగు వాడు కన్పిస్తే ఎక్కడ లేని ప్రేమ పొంగిపొర్లుతుంది. అదే మనవాడు పక్కగదిలో ఉన్నా పలకరించబుద్ధి కాదు. అందరూ పరాయివాళ్ళయినప్పుడే మనవాళ్ళ విలువ తెలిసేది. అమెరికాలో జరుగుతున్న ఆ 'కలిసి కట్టుతనం' వెనకగల రహస్యం అదే!

ఆ కలిసి కట్టుతనమే ప్రతి కుటుంబం లోనూ వస్తే ఎంత బాగుండును?

రాగచంద్రిక చెప్పింది. "మామయ్యా! చెబితే నమ్మవు కానీ మీరు మర్చిపోతున్న అట్లతద్ది, కృష్ణాష్టమి, నోములు, వ్రతాలు అక్కడ మేమందరం కలిసి ఎంత ఆనందంగా చేసుకుంటామో తెలుసా? ప్రతినెలా ఎవరో ఒకరి ఇంట్లో ఏ వ్రతమో పూజ అనో ఏదో అకేషన్ సృష్టించుకుని, అందరం కలిసి, మనసువిప్పి మాట్లాడుకుంటాం. కలిసి తిరుగుతాం. తెలుగు సభలను పెట్టుకుంటాం. కూచిపూడి నృత్యోత్సవాలు, సంగీత సభలను మూడు నెలలకొకసారి అయినా ఏర్పాటు చేసుకుంటాం. ఇండియా కల్చర్‌ని పూర్తిగా మేము పాటిస్తాం. దసరా నవరాత్రులు జరుపుకుంటాం. మీరేమో మా దేశాలనుండి అశ్లీలం, హింస పుష్కలంగా ఉండే సినిమా కేసెట్స్ దిగుమతి చేసుకుంటూ ఉంటే మేం మాత్రం మన ఓల్డ్ క్లాసిక్స్‌ని తీసుకెళ్లి వారానికొకసారి అయినా ఎంజాయ్ చేస్తాం. మన ఊళ్లల్లో, ప్రతిషాపు వెతికినా దొరకని బాటసారి, షావుకారు, మల్లీశ్వరి, బంగారుపాపల్లాంటి సినిమాలతో పాటు, అసలు సినిమా మీడియాకి అర్థం చెప్పిన విజయవారి సినిమా కేసెట్స్ మా ప్రతి ఇళ్లల్లోనూ ఉంటాయి.



సాయి అన్నాడు, "నిజమే రాగచంద్రికా! మేం అశ్లీలం పేరుతో బ్లూఫిలింస్‌ని దిగుమతి చేసుకుంటూ ఉంటే మీరు మన సంస్కృతిని అక్కడభద్రపరుస్తున్నారు, కాపాడుతున్నారు"

"అందరూ అలా ఉంటారని అనుకొని, ప్రస్తుతం ఎక్కువ శాతం మన సంస్కృతిని మర్చిపోతున్నారు. అదే నా బాధ! ఆడపిల్లలు, ఫ్యాషన్స్ మోజులోపడి కొట్టుకుపోతూ, అసలయిన మన భారతీయ నృత్య రీతులకు, సంగీతానికి దూరమవుతున్నారు"

"రాగచంద్రికా! నీకు సంగీతం, నృత్యం రెండూ వచ్చునని విన్నాను"

మందహాసం చేసింది రాగచంద్రిక "మరీ అంత గొప్పగా రావు, ఇంట్రస్ట్‌తో నేర్చుకున్నాను, నేర్చుకుంటున్నాను. ఒక అమెరికన్ యువతి, మన భారతీయ నృత్యం, సంగీతం మీది మక్కువతో, అభిమానంతో ఇండియా వచ్చి, ఇక్కడే అంకితభావంతో, తపస్సులా వాటిని సాధనచేసి, తర్వాత అమెరికావచ్చి అక్కడ డాన్స్ అండ్ మ్యూజిక్ స్కూల్ రన్ చేస్తోంది. నేను నేర్చుకున్నది అక్కడే! నాతోపాటు చాలామంది అమెరికన్స్ మన కూచిపూడి డాన్స్‌మీద మంచి ఇంట్రస్ట్ చూపిస్తూ ఎంతగానో సాధన చేస్తున్నారు. మనం వాళ్ళని చూసి నేర్చుకోవాల్సింది చాలా ఉంది"

"అవును చంద్రికా! నువ్వు ఇప్పుడు చెబుతుంటే మరీ మరీ అన్పిస్తోంది. మనవాళ్ల అజ్ఞానంతో మన సంస్కృతికి దూరమవుతుంటే పరాయి దేశంవారు, దానిని జ్ఞాన సంపదగా గుర్తించి, దానిని అందుకోడానికి ప్రయత్నిస్తున్నారు"

సాయంత్రం ఆరు అవుతూనే చీకటి ముసురుకోసాగింది.

కార్తీక మాసపు చలి. చక్కిలిగిలి పెడుతూ, చలి పుట్టిస్తోంది.

రాగచంద్రిక కదిలి అన్నది "చీకటిపడింది. వెళదామా?"

సాయికృష్ణ కూడా లేచాడు.

ఇద్దరూ ఇంటిదారి పట్టారు.

ఇంటికెళ్ళేసరికి, వేదమూర్తిగారు ఆయన స్నేహితుని ఇంటి దగ్గరనుండి వచ్చేశారు. ప్రమీల వంట ప్రయత్నంలో రాగచంద్రిక కూడా సహాయం చేసింది.

రాత్రి ఎనిమిది అయినా భానుమూర్తి ఇంటికి రాలేదు.

ప్రమీల గొణుగుతూనే ఉంది "ఏం మనిషో! ఇంట్లో బంధువులు ఉన్నారనే ధ్యాసేలేదు. కనీసం ఈరోజు అయినా పెందరాళే రావచ్చుగా"

తొమ్మిదయింది.

ప్రమీల బలవంతంమీద, వేదమూర్తిగారు భోజనానికి లేచారు. మరీ ఆలస్యంగా తిన్నా, ఆయనకి అరగదు.

తనూ, తమ్ముడూ కలిసి కూర్చుని భోజనం చేసి చాలా రోజులయింది. అందుకే అంతసేపు వెయిట్ చేశారాయన.

కాని భానుమూర్తి చిట్ ఫండ్ కంపెనీ తాలూకు ఆఫీసు, ఏడున్నరకే తాళంవేసినా, దాదాపు పదింటివరకూ షేర్ కన్ సెల్టెన్సీ ఆఫీసులో, తీవ్రమయిన ఆలోచనల మధ్యన గడిపి ఇంటికి బయలుదేరాడు.

షేర్ బిజినెస్‌కి సంబంధించి, ప్రస్తుతం ఆయన పరిస్థితి బాగా నష్టాల్లో ఉంది. షేర్ మార్కెట్ రోజురోజుకూ డౌన్ అయి పోతుంటే- ఆయన బి.పి. కూడా అదే రేషి యోలో రోజురోజుకూ పెరిగిపోసాగింది.

అది మర్చిపోవడానికే అప్పుడప్పుడు డ్రింక్ చేయడం అలవాటు చేసుకున్నాడు.

బాటిల్ ఇంటికి తీసుకువెళ్ళి, ఏ అర్ధరాత్రో మేడమీదకు వెళ్ళి, ఆ చీకట్లో ఒంటరిగా తాగుతూ, తనకు వచ్చిన నష్టాన్ని మర్చి పోయే ప్రయత్నం చేస్తాడు.

ఇంటికి చేరేసరికే పదిన్నర అయింది.

అప్పుడు గుర్తుకొచ్చారు వేదమూర్తి అన్నయ్య, సాయికృష్ణ.

అప్పటికే భోజనాలు చేసిన ఆ ఇద్దరూ హాలులో పడుకున్నారు. రాగచంద్రిక గదిలో నిద్రపోతోంది.

"సారీ అన్నయ్యా! లేట్ చేశాను" అంటూ గబగబా పెరట్లోకి వెళ్ళాడు. ప్రమీల కూడా పెరట్లోనే ఉంది.

సాయికృష్ణ పడుకుని ఉన్నా నిద్రపట్టకపో వడంవలన, ఈ తతంగమంతా మౌనంగా గమనిస్తున్నాడు.

పెరట్లో- ప్రమీల భర్తని ఏదో అన్న ట్లుంది. భానుమూర్తి కూడా అరిచాడు.

ఇంట్లో బంధువులున్నారనే సంగతి మర్చి పోయి, పెరట్లోనే ఇద్దరూ ఒకరినొకరు నిందించుకున్నారు.

ఆ కోపంలో, భానుమూర్తి భోజనం కూడా చేయలేదు. విసవిసా నడిచివచ్చి హాల్లోనే తనకు కేటాయించిన మంచంమీద ముసుగుతన్ని పడుకున్నాడు. సణు క్కుంటూ, గొణుక్కుంటూ ప్రమీల భోజనం చేసింది.

ఓవైపునుండి వేదమూర్తిగారు కూడా ఇదంతా గమనిస్తూనే ఉన్నారు.

చిన్నగా నిట్టూర్చి, నిద్ర తెచ్చుకోవడానికి ప్రయత్నించసాగారు.

ఆ టైములో, తమ్ముడిని పలకరించడం సబబు కాదనిపించింది.

ఆలోచనలు కట్టిపెట్టి, నెమ్మదిగా నిద్రకు పక్రమించారు.

ఒక అర్ధరాత్రివేళ- అంటే నిశ్శబ్దంగా ఉన్న సమయంలో.

ఎవరో తట్టిలేపినట్లయి, ఉలిక్కిపడి కళ్ళు విప్పారు వేదమూర్తిగారు.

వాతావరణం నిశ్శబ్దంగా ఉంది. దూరంగా కుక్కల అరుపులు, కీచురాళ్ళ రొద

విన్పిస్తున్నాయి.

తలతిప్పి చూశారు.

సాయికృష్ణ, ప్రమీల మంచి నిద్రలో ఉన్నారు.

భానుమూర్తి మాత్రం మంచంమీద లేడు. మంచం ఖాళీగా ఉంది.

క్షణంసేపు ఆయన గుండె దడదడలా డింది.

అంతలోనే తేరుకుని, నెమ్మదిగా మంచం మీదనుండి లేచి, అడుగుల శబ్దం కాకుండా తలుపు దగ్గరకు నడిచారు.

ఆయన ఊహించినట్లుగానే, తలుపు దగ్గ రకు లాగి ఉంది.

నెమ్మదిగా తలుపుతీసి, బయటకు అడు గువేసి మళ్ళీ తలుపు దగ్గరకు నొక్కి వాకి ట్లోకి నడిచారు.

అంతా నిరామయ నిశ్శబ్దం.

నిర్మానుష్య వాతావరణం.

హఠాత్తుగా, అప్పుడు విన్పించింది మేడ మీదనుంచి గ్లాసు శబ్దం.

వేదమూర్తిగారు కనుబొమలు ముడిచి, అనుమానంగా తలెత్తి చూశారు.

స్ట్రీట్ లైట్ వెలుతురు పడి, మేడ పిట్టగో డమీద చెట్లకొమ్మల నీడలు పడుతున్నాయి.

ఆయన నెమ్మదిగా మెట్లుఎక్కి, ఆఖరి మెట్టుమీదకి రాగానే ఎదురుగా ఆ దృశ్యం కనబడి నిశ్చేష్టుడయ్యారు.

స్ట్రీట్‌లైట్ మసక వెలుతురులో, పిట్టగో డకి జారగిలబడి కూర్చుని ఉన్న భాను మూర్తి చేతిలో విస్కీగ్లాసు ఉంది. ఎదు రుగా నేలమీద విస్కీ బాటిలు, ఐస్‌వాటర్ బాటిల్ ఉన్నాయి.

ఆ స్థితిలో, పరిస్థితిలో ఉంది- తన తోడబుట్టినవాడు, తన తమ్ముడేనా?

పెళ్ళి అయ్యేటంతవరకూ తన చేతిని, తన తోడునూ, తన సహచర్యాన్ని క్షణ మాత్రం వదిలి ఉండలేని, తన భాను తమ్ముడేనా? ఇలా ఒంటరిగా, ఏకాకిలా, చీకట్లో, మత్తులో మునిగితేలుతూ-

తమ్ముడూ! నీకేం తక్కువయిందనిరా ఈ ఖర్మ?

ఎందుకు? నీకై నువ్వు శిక్ష విధించుకుం టావు?

గరళంతో గుండెలు నింపుకుని ఎవరిని సాధిద్దామని?

తమ్ముడివైపు అడుగులు వేసి అతని ఎదు రుగా నిల్చున్నారు వేదమూర్తిగారు. తన ఎదురుగా క్రీనీడలా పడేసరికి, నెమ్మదిగా తలెత్తిన భానుమూర్తి అదిరిపడ్డాడు. మత్తు మత్తుగా అన్నాడు, "అన్నయ్యా! నువ్వా... నువ్వా... నువ్వు... ను... నిద్రపోలా?"

వేదమూర్తిగారు సమాధానం చెప్పకుండా, తమ్ముడి ఎదురుగా కూలబడినట్లుగా కూర్చుండిపోయారు.

సూటిగా తమ్ముడి కళ్లల్లోకే చూశారు.

భానుమూర్తి తూటాల్లాంటి ఆ చూపుల్ని తట్టుకోలేనట్లుగా తలవంచుకున్నాడు. వేద మూర్తిగారు కింద పెట్టి ఉన్న ఖాళీగ్లాసుని చేతిలోకి తీసుకుని, భానుమూర్తి ముందుకు జాపి అన్నారు "తమ్ముడూ!"

భానుమూర్తి బరువుగా తలెత్తి చూశాడు.

"ఆ విస్కీని నాకు కూడా పంచరా! కలిసి తాగుదాం"

"అన్నయ్యా" పిడుగులు పడుతున్నట్లు, పిచ్చివాడిలా అరిచాడు భానుమూర్తి.

వేదమూర్తిగారు పేలవంగా నవ్వారు. "అవును మరి! నీతో కలిసి కబుర్లు చెప్పుకో వాలని, కలిసి గోదారి ఒడ్డున నడవాలని, కలిసి భోజనం చేయాలని ఎన్నో కోర్కెలతో అంత దూరంనుండి వచ్చాను. అవి ఎలాగూ తీరలేదు. కనీసం ఈ మందు అయినా కలిసి తాగుదాం. ఆ తృప్తి

అయినా మిగలనీ నాకు"

"అన్నయ్యా! అన్నయ్యా" ఒక్కసారిగా ఏడుపు ముంచుకొస్తే, వేదమూర్తిగారి చేతి లోని గ్లాసు లాగి పడవేసి ఆయన దోసిట్లో ముఖంవాల్చి ఏడుస్తూ ఉండిపోయాడు.

వేదమూర్తిగారు తన చేతులు విడిపించు కుని, తమ్ముడి తల, వీపు ఆప్యాయంగా నిమురుతూ, అతని గడ్డంకింద చెయ్యివేసి తలపైకెత్తి అడిగారు.

"భానూ! ఏమిటిరా? నువ్వు చేయాల్సిన పనేనా ఇది? "

"క్షమించు అన్నయ్యా! షేర్ల ధరలు పడి పోతూ, రోజురోజుకు మార్కెట్ దిగజారిపో తుంటే పెట్టిన పెట్టుబడి నిలువునా ఆవిరై పోతుంటే పిచ్చెక్కిపోతోంది. ఆ టెన్షన్‌కి తట్టుకోలేకపోతున్నాను"

"అందుకు- ఇదా మార్గం? నష్టాలు వస్తా యని తెలిసీ- ఎలా కూరుకుపోయావు? చూడు! ఇంటా బయటా ఎలా లూజ్ అయి పోతున్నావో? "

భానుమూర్తి తల దించుకున్నాడు.

"ఇప్పుడు నేనింత ఉపన్యాసమిచ్చినా ఒక్క ముక్క కూడా నీకు అర్థం కాదు. లే... కిందకు వెళదాం"

భానుమూర్తి మారుమాట్లాడకుండా గోడ ఆసరాతో లేచి నిల్చున్నాడు.

ముందుకు అడుగువేయబోయి ఒక్కసా రిగా తూలిపడబోతే, వేదమూర్తిగారు గభాల్న అతని భుజం పట్టుకుని ఆపారు.

ఈసారి జాగ్రత్తగా అడుగులో అడుగు వేసుకుంటూ మెట్లు దిగాడు భానుమూర్తి.

లోపలికి వెళ్ళి పడుకున్న భానుమూర్తి వెంటనే నిద్రలోకి జారిపోయాడు.

వేదమూర్తిగారు మాత్రం నిద్రపట్టక చాలాసేపు బాధపడ్డారు.

ఒక్కొక్కటే బయటపడుతున్న నగ్నస త్యాలు- ఆయనకి నిద్రని దూరం చేస్తు న్నాయి. కందిరీగల్లా ఆలోచనలు చుట్టుము డుతూ ఉంటే, బలవంతాన మనసు కంట్రోల్ చేసుకుంటూ నిద్ర తెచ్చుకోటానికి ప్రయత్నించి ఓ అరగంటకి సాధించారు.

ఎందుకో- ఓ నడిరాత్రివేళ ఛాతీలో నొప్పిగా అన్పించి మళ్ళీ మెలకువ వచ్చింది.

తలతిప్పి చూస్తే అందరూ గాఢనిద్రలో ఉన్నారు.

అరచేతితో గుండెలమీద రాసుకుంటూ పక్కకి ఒత్తిగిలి పడుకున్నారు. కాని ఆయన అనుకున్నట్లు ఆ నొప్పి వెంటనే తగ్గలేదు.

తెల్లవార్లూ బాధిస్తూనే ఉంది. భయపె డుతూనే ఉంది.

ఆ టెన్షన్‌తోనే, ఓ సమయంలో ఊపిరి అందక, ఆయాసంగా కూడా అన్పించింది. అలాగే బాధతో తెల్లవార్లూ గడిపి, ఉద యమే ఆ విషయం ఇంట్లో చెప్పారు. వెంటనే సాయికృష్ణ, భానుమూర్తి ఆయనని హాస్పిటల్‌కి తీసుకువెళ్ళారు.

డాక్టర్ టెస్ట్‌చేసి, కంగారు పడవలసినది ఏమీలేదని, ఆ వయసులో కంటిన్యుస్‌గా ప్రయాణాలు చేయడంవలన తీసుకున్న స్ట్రెయిన్ వలన వచ్చిన పెయిన్ అని చెప్పి మందులు రాసి, మళ్ళీ సాయంత్రం వచ్చి టెస్ట్ చేయించుకోమన్నారు.

రాత్రి నిద్రలేకపోవడంవలన, ఆ నొప్పి వలన, తమ్ముడి పరిస్థితి చూసిన షాక్‌వ లన వేదమూర్తిగారు ఒక్క రాత్రిలోనే ఎంతో నీరసించిపోయారు. ముఖం వడలి నట్లుగా అయిపోయింది.

ఆ పూటకి బ్రెడ్ పాలు తప్ప ఏం తీసు కోలేదు.

ఏమనుకున్నాడో ఏమో, భానుమూర్తి కూడా ఇంటి దగ్గరే ఉండిపోయాడు. ఆ మధ్యాహ్నంనుండి సాయంత్రంవరకు మంచి

గాఢనిద్ర తీశారాయన. మందుల ప్రభావం వలన కాని, నిద్రపోవడంవలనకాని సాయం త్రానికల్లా నొప్పి తగ్గి మామూలు మనిషి అయ్యారు. ముఖం తేటపడింది. ఆహారం తీసుకోకపోవడంవలన నీరసంగా ఉన్నా రంతే.

సాయంత్రం అన్నయ్యకి కులాసాగా ఉండటంతో భానుమూర్తి తేలికగా ఊపిరి పీల్చుకుని, ఆఫీసుకి వెళ్లాడు.

వేదమూర్తిగారు సాయికృష్ణని తీసుకుని హాస్పిటల్‌కి వెళ్లారు.

డాక్టరు పరీక్షచేసి, ప్రాబ్లెమ్ ఏమీలేదని, ఉదయం రాసిన మందులే వాడమని సలహా ఇచ్చాడు.

ఇద్దరూ రిక్షాలో ఇంటికి వచ్చేసరికి సాయంత్రం ఆరు కావస్తోంది.

వంటింట్లో ప్రమీల, రాగచంద్రిక మంచి బిజీలో ఉన్నారు.

రాగచంద్రిక స్టవ్‌ముందర, ఎత్తయిన పీట వేసుకుని బెల్లం పాకం పడుతోంది.

"ఏమిటే చంద్రికా! విశేషం? " వేదమూర్తి గారు అడిగితే-

ప్రమీల చెప్పింది, "విశేషం ఏమీలేదు బావగారూ! చంద్రికకు వంటలయితే వచ్చు కాని, మన పిండివంటలు అంతగా రావు. అందుకనే నేర్చుకుంటోంది. వచ్చిన రెండు మూడు రోజుల్లో బొబ్బట్లు, కజ్జికాయలు నేర్చుకుంది. ఇదిగో ఇప్పుడు అరిసెలు చేస్తోంది.

గరిటతో పాకం తిప్పుతున్న రాగచంద్రిక తలెత్తి నవ్వింది. "నిజానికి ఇవన్నీ పుస్తకా లలో ఉన్నాయి. కాని తాతయ్యగారూ- ఇలాంటివి ప్రాక్టికల్‌గా ఒకటి రెండుసార్లు చేస్తే తప్ప సరిగా రావు. అందుకే బామ్మని ప్రయోగాలపేరిట ఇబ్బంది పెడుతున్నాను"

"ఇబ్బంది కాదమ్మా! నిన్ను చూస్తూ ఉంటే ముచ్చట వేస్తోంది. ఈ రోజుల్లో ఏ ఆడపిల్లా కనీసం వంటింటివైపు తొంగి చూడటానికి కూడా ఇష్టపడటంలేదు. నా మనవరాళ్లలో ఎవరికీ వంట వచ్చని నేనను కోవడంలేదు. ఎక్కడో అమెరికాలో ఉంటున్నా మన వంటలు, పిండివంటల మీద నీకున్న ఇంట్రస్టు చూస్తుంటే నీలాంటి మనవరాలు ఉన్న నా తమ్ముడిని చూస్తుంటే ఈర్ష్య కలుగుతోంది!"

రాగచంద్రిక నవ్వుతూ అంది, "అప్పుడే పొగిడేసేయకండి. రుచి చూసి అప్పుడు చెప్పండి. చెక్కలే అవుతాయో, అరిసెలే అవుతాయో"

"దేనికయినా శ్రద్ధా, పట్టుదలా ముఖ్యం! నీలో అవి ఉన్నాయి. కాబట్టి చెడిపోతా యని భయపడవలసిన అవసరంలేదు. ఇప్పుడు నిన్ను చూస్తుంటే ఏమనిపిస్తోందో తెలుసా? నిజానికి మేము రేపు ఉదయం వెళ్ళిపోవాలనుకుంటున్నాం. కాని ఆ నిర్ణయం మార్చుకున్నాం రేపు మధ్యాహ్నం నీ చేతివంట రుచి చూసికాని వెళ్ళదలచుకో లేదు"

"తప్పకుండా! కాని మీరు వెళ్ళడానికి అంత తొందరేమున్నది? "

"లేదమ్మా! చాలా పనులున్నాయి"

ప్రమీల అడిగింది "బావగారూ! కాఫీ ఇమ్మంటారా? "

"వద్దమ్మా! ఎలాగూ కాసేపట్లో భోజనం చేస్తాంగా"

"ఈ పూటయినా త్వరగా ఇంటికి రమ్మని చెప్పానులెండి ఆయనకి!"

వేదమూర్తిగారు హాల్లోకి వచ్చి కూర్చు న్నారు. సాయికృష్ణ స్నానానికి వెళ్ళాడు.

వేదమూర్తిగారి ఆలోచనలు రాగచంద్రిక చుట్టూతానే తిరుగుతున్నాయి.

అతిగా అలంకరణలతో వికృతంగా కన బడే వికిత.

నిర్లక్ష్యంగా రోజులు గడిపేస్తున్న చరిత, చకితలు-

అచ్చమయిన తెలుగుతనానికి అర్థం చెబుతున్న రాగచంద్రికని చూసి, కొంతయినా నేర్చుకుంటే బాగుండుననిపిస్తోంది.

ఆయనకి- ఆయన మనవరాళ్ల సమక్షంతో ఇక్కడ పోల్చుకుని చూస్తుంటే ఎంతో తేడా కన్పిస్తోంది.

చాలారోజుల తర్వాత 'వికిత'ని చూస్తూ ఉంటే ఏమీ అన్పించలేదు. ఎలాంటి అభిమానమూ ప్రత్యేకంగా కలగలేదు. తన కొడుకు కూతురు! అంతే!

పైగా ఆ అలంకరణ, స్వభావం చూస్తుంటే విసుగుగా, ఒక్కోసారి చిరాకుగా అన్పించాయి.

చరిత, చకిత విషయంలో కూడా దాదాపుగా అంతే!

జీవితంలో ఎదురుదెబ్బతిన్న అర్పిత గురించి అనుకోడానికి ఏమీ లేదు.

కాని రాగచంద్రికని చూస్తుంటే-

మనసులోనుండి ఆపేక్ష పెల్లుబుకుతోంది.

అనురాగం పొరలి పొరలి వస్తోంది.

ఆప్యాయత తరలి తరలి వస్తోంది.

హృదయం ఉప్పొంగుతోంది.

ఎక్కువగా ఆ అమ్మాయి సమక్షంలోనే గడపాలనిపిస్తోంది.

మరి వికిత, చకిత, చరితలు కూడా మనవరాళ్లే. స్వంత మనవరాళ్లు పైగా. వాళ్లను చూస్తుంటే స్పందించని హృదయం ఈ మనవరాలిని చూస్తుంటే అనిర్వచనీయమయిన అనుభూతితో నిండిపోతోంది. ఈ అమ్మాయి నా మనవరాలు అని గర్వంగా చాటుకోవాలనిపిస్తోంది.

ఎక్కడ ఉన్నది తేడా?

కట్ చేసిన జుట్టులో- జడకుప్పెల వాలు జడలో

పల్చటి నైటీలలో- పట్టు పరికిణీలలో-

బొట్టు లేని నుదురు పెన్సిల్ గీతలకను బొమలలో, ఎర్రటి బొట్టు కళ్ళకి కాటుకలో-

పలకరించే తీరులో- వెల్లివిరిసే ఆప్యాయతలో-

అలవాట్లలో- పిలుపులలో తీరుతెన్నుల్లో-

అన్నింటిలోనూ- ప్రతి విషయంలోనూ ఉన్నది తేడా!

సాయికృష్ణ వచ్చేంతవరకూ ఆలోచనలతోనే గడిపారు ఆయన!

వంటింటిలోనుండి అరిసెలు ఉడుకుతున్న వాసన వస్తోంది.

వేదమూర్తిగారు స్నానం చేసేసరికి, భానుమూర్తి వచ్చేశాడు.

మగవాళ్లు ముగ్గురికీ వంటింట్లో పీటలు వేసి, లేలేత అరిటాకులలో భోజనం వడ్డించారు. అన్నంతోపాటు అరిసెలు కూడా వేసి అడిగింది రాగచంద్రిక.

"ఎలా ఉన్నాయి తాతయ్యా?"

"నోట్లో వేసుకుంటే కరిగిపోతున్నాయే! నీకు కాబోయే మొగుడెవరో కాని ఎంతో పుణ్యం చేసుకుని ఉండాలి" రాగచంద్రికని చూస్తుంటే ముచ్చటే కాదు, ఆప్యాయతతో వేళాకోళం పట్టించాలనిపిస్తోందాయనకు.

సిగ్గుగా నవ్వింది రాగచంద్రిక.

పరికిణి కొంచెం పైకి దోపి, ఓణీ నడుము చుట్టూ దోపి, ఆ పూట వడ్డన కార్యక్రమం అంతా రాగచంద్రికే చేసింది.

తలవంచుకుని భోజనం చేస్తున్న సాయికృష్ణ కళ్ళకి వడ్డన చేస్తున్న రాగచంద్రిక ఎర్రటి గోరింటాకు పారాణితో ఉన్న తెల్లటి పాదాలే మనసులో బలంగా ముద్ర వేసుకున్నాయి.

చాలా రోజుల తర్వాత తన తమ్ముడు, మేనల్లుడు మధ్యన కూర్చుని మనవరాలి వడ్డనతో, మరదలి కబుర్లతో తృప్తిగా భోజనం చేశారు వేదమూర్తిగారు!

భోజనం తృప్తిగా తినాలంటే వంటల రుచేకాదు, ఆరోగ్యకరమయిన వాతావరణం, వడ్డించేవారి ఆదరణ కూడా ముఖ్యం!

వేదమూర్తిగారు మరీమరీ కోరుకునేది అదే!

సాయికృష్ణ ఆశించేది అదే!

బలమయిన అనుబంధానికి పునాది పడేది భోజనాల దగ్గరే!

చాలామంది అర్థంచేసుకోని ఆలోచించని చిన్నగా అన్పించే అతిపెద్ద విషయం ఇది!

తర్వాత ప్రమీల, రాగ చంద్రిక కూడా భోజనాలు చేసి హాల్లోకి వచ్చారు!

అందరూ సమావేశమయిన తర్వాత.

వేదమూర్తిగారు వారింటికి తన రాక వెనకగల ఆలోచన, అందరి మధ్యన మళ్ళీ రాకపోకలను పునరుద్ధరించాలనే తమ ప్రయత్నం గురించి వివరంగా విశదంగా విపులీకరించారు!

ఎపుడు? ఏ రోజుకు విజయవాడ రావలసినదీ అందుకు గల సందర్భం చెప్పారు.

అంతా విని రాగచంద్రిక అన్నది "ఫెంటాస్టిక్ తాతగారు! మీ ఆలోచన, ఆశయం, మీ ప్రయత్నం చాలా గొప్పవి! నిజానికి ఎపుడో రావలసిన ఆలోచన ఇది!"

"నిజమేనమ్మా! కాని మార్పు మనుషులలో అంత త్వరగారాదు! పండు చెట్టు నుండి రాలిపడాలంటే పక్వానికి రావలసిందే!"

చాలాసేపు రాగచంద్రిక అమెరికాలోని తమ జీవన సరళి, పద్ధతులు గురించి వివరిస్తుంటే అందరూ ఆసక్తిగా వింటూ ఉండిపోయారు!

కబుర్లతో టైము త్వరత్వరగా గడిచిపోయి, పదకొండు గంటలకి అందరూ నిద్రపోయారు!

సాయికృష్ణకి అన్పించింది-

వాళ్ళందరి మధ్యన అంతసేపు, కబుర్లు దొర్లిపోయి, మనసులు దగ్గరవడానికి గల కారణం వెనకగల రహస్యం-

వాళ్ళింట్లో టి.వి. చెడిపోయి రిపేరుకెళ్ళడమే!

మర్నాడు ఉదయమే లేచి, వేదమూర్తిగారు గోదావరిలో స్నానం చేసి వచ్చారు. తర్వాత బ్యాగు సర్దుకుంటూ ఉంటే రాగచంద్రిక అన్నది "తాతగారూ! మీరు ఈ పూట ఉంటానన్నారు! నా చేతివంట రుచిచూస్తానన్నారు"

ఆయన నవ్వారు! "లేదమ్మా! ఇక ఇంటికి చేరుకోవాలి! చేయాల్సిన పనులు చాలా ఉన్నాయి! నువ్వు విజయవాడ వచ్చిన తర్వాత రెండు రోజులు ప్రత్యేకంగా మీ బామ్మకి వంట పని నుండి రెస్టు ఇస్తాను! సరేనా!"

వాళ్ళు వెళుతుంటే ప్రమీల కొన్ని అరిసెలు ప్యాక్ చేసి ఇచ్చింది!

సాయికృష్ణ వెళ్ళబోతూ రాగచంద్రికతో అన్నాడు "నువ్వు ఇండియానుండి అసంతృప్తితో తిరిగి వెళ్ళడం నాకిష్టంలేదు! విజయవాడలో- మన కుటుంబసభ్యుల సమావేశం తర్వాత నీలో మళ్ళీ ఆశలు చిగురిస్తాయని నా ఆకాంక్ష!"

నవ్వుతూ అన్నది "వర్తమానమయినా, భవిష్యత్ అయినా మన ఆలోచనలమీద కాదు! ఆచరణ మీద ఆధారపడి ఉన్నది ఏదైనా! చూద్దాం! అందరం ఒక్కమాటమీద నిలబడి ఆ కట్టుబాటుని దాటరని ఆశిద్దాం!"

ఇద్దరూ వెళుతుంటే గుమ్మందగ్గర నిలబడి ప్రమీల, రాగచంద్రిక వీడ్కోలు

ఇచ్చారు!

భానుమూర్తి స్టేషనువరకు వచ్చాడు!

సాయికృష్ణ ఏలూరుకి టిక్కెట్లు తీసుకున్నాడు!

ఏలూరులో

వేదమూర్తిగారి చెల్లెలు, అసలు ఈ యాత్రకి కారణమూర్తి, సాయికృష్ణకి తల్లి అయిన సత్యవతి ఉన్నది!

సాయికృష్ణ తండ్రిపేరు దక్షిణామూర్తి!



హాలులో అడుగుపెట్టారో లేదో, పరుగులాంటి నడకతో ఎదురొచ్చింది సత్యవతి! అన్నయ్యను చూసిన ఆనందంతో నిలువెల్ల తబ్బిబ్బవుతుంటే ఆ పులకింతకు కన్నీళ్ళు వచ్చాయి!

దాదాపు పది సంవత్సరాల తర్వాత అన్నాచెల్లెళ్ళ సమాగమం అది!

"అన్నయ్యా!" పిలవాలనుకొంది! కాని ఒక్క అక్షరం గొంతు దాటిరాలేదు!

వేదమూర్తిగారు కూడా, మాటలు రానట్లుగా మూగగా ఉండిపోయారు!

సాయికృష్ణ, మామయ్య చేయిపట్టుకుని సోఫాలో కూర్చోపెట్టి, తనే లోపలికి వెళ్ళి మంచినీళ్ళు తెచ్చిఇచ్చి, ఆయన చేతిలోని ఎయిర్‌బాగ్ తీసుకువెళ్ళి గదిలో పెట్టాడు!

"అన్నయ్యా! ఎన్నాళ్ళయింది?" ఆనంద భాష్పాలు చెక్కిళ్ళను తడిపేస్తుంటే అడిగింది సత్యవతి!

"ఎన్నేళ్ళయింది?" నవ్వుతూ అన్నారు వేదమూర్తిగారు!

సత్యవతి, అన్నయ్యకి చేరువగా కూర్చుని, ఆప్యాయంగా ఆయన చేతిని తన చేతిలోకి తీసుకుని, స్పృశిస్తూ అన్నది "ఈ పదేళ్ళలో నీలో అంత మార్పేమీ రాలేదు"

నవ్వారు ఆయన "నువ్వు మాత్రం ఏం మారావని? చిన్నప్పుడు ఎలా ఉన్నావో, నా కళ్ళకి ఇపుడూ అలాగే ఉన్నావు!"

"ఈ యాభయి ఏళ్ళ వయసులోనా?" నెరిసిన జుట్టుని, వడలిపోయిన బుగ్గలని స్పృశించుకుంటూ అన్నది!

అంతలో గుర్తుకొచ్చినట్లుగా "ఇపుడే వస్తాను ఉండరా" అంటూ, గబగబా వంటింట్లోకి వెళ్ళి రెండు ప్లేట్లలో బొబ్బట్లు పెట్టి తీసుకువచ్చి ఒకటి వేదమూర్తిగారికి, ఒకటి సాయికృష్ణకి ఇచ్చింది!

"చూడబోతే- నా కోసమే చేసినట్లున్నావే!" అన్నారు వేదమూర్తిగారు.

"అక్షరాలా! నీకోసమే చేశాను! ఈరోజు వస్తావని తెలుసు! మీ రాకకోసం లక్షకళ్లతో ఎదురు చూస్తున్నాను"

"మేము ఈరోజే వస్తామని ఎలా తెలుసు?"

"సాయి ఎప్పటికపుడు ప్రతి ఊరునుండి ఉత్తరాలు రాస్తూనే ఉన్నాడు! విశేషాలు తెలుస్తూనే ఉన్నాయి! నిన్ననే రాజమండ్రినుండి

ఉత్తరం వచ్చింది!"

కొత్త విషయం వింటున్నట్లుగా కళ్ళు పెద్దవిచేసి, ఆశ్చర్యంగా మేనల్లుడివైపు "ఔనా" అన్నట్లుగా చూశాడు!

సాయికృష్ణ నవ్వి "మీరు కబుర్లు చెప్పుకునేలోగా స్నానంచేసి వస్తాను" అని వెళ్ళాడు!

వేదమూర్తిగారు అడిగారు "సత్యూ! బావగారేరి? "

"మొన్నటివరకూ లీవ్ పెట్టి ఇంట్లోనే ఉన్నారు! నిన్ననే డ్యూటీలో జాయిన్ అయారు!"

"ఎలా ఉన్నది బావగారి ఆరోగ్యం? "

చిన్నగా నిట్టూర్చింది. "బి.పి., షుగర్! ఈ మధ్యన మరీ అలసటగా ఫీలవుతుంటే ఇంటిదగ్గరే ఉండిపోయి రెస్ట్ తీసుకున్నారు!'

చెల్లెలు కళ్ళల్లోకి చూస్తూ అడిగారు "నువ్వెలా ఉన్నావు? "

"చూస్తున్నావుగా!" పేలవంగా నవ్వింది!

ఏదో పోగొట్టుకున్నలాంటి భావం ఆమె కళ్ళల్లో లీలగా తొంగిచూసింది!

ఒక బొబ్బట్టు తిని, ఇక తినలేనట్లుగా అన్నారు! అబ్బా! ఇంక తినలేనే! పళ్ళు నొప్పులు పెడుతున్నాయి!"

పకపకా నవ్వింది "అవును మరి! అపుడే అరవయ్యేళ్ళ తాతయ్యవి కదా!"

అపుడు అన్నారు ఆయన. "నిజమే! మేము తాతయ్యలం అయ్యాము! సాయికి కూడా పెళ్ళి చేస్తే నువ్వూ అవుతావు బామ్మవి!"

ఆ ప్రసక్తి రాగానే నవ్వటం ఆపి కొంచెం దిగులుగా చెప్పింది, "నిజమేరా అన్నయ్యా! సాయి కూడా ఉద్యోగంలో సెటిలయినట్లే! నేను పోరు పెడుతూనే ఉన్నాను పెళ్ళి చేసుకోమని! వాళ్ళ నాన్నగారికేమో నలుగురిలో కలిసిమెలిసి తిరిగే చొరవ, లౌక్యం అంతగా లేవు! నేనూ బయటకు వెళ్ళి ఎరగను! సంబంధాలయితే వారానికి ఎనిమిది వస్తున్నాయి! ఏది మంచో, ఏది చెడో నిర్ణయించుకోలేక పోతున్నాము! ఇంకా అసలు మొదలేపెట్టలేదులే! ఇక దిగులు లేదులే! నవ్వు వచ్చేశావుగా! మేనమామవి! మంచి సంబంధం తీసుకువచ్చి పెళ్ళి చేసే బాధ్యత నీదే!"

వేదమూర్తిగారు ఔనన్నట్లుగా గుంభనంగా నవ్వారు!

వేదమూర్తి తర్వాత భానుమూర్తి, ఆఖరున సత్యవతి!

వేదమూర్తిగారికి, సత్యవతికి మధ్యన పది సంవత్సరాల తేడా ఉన్నది! అలాగే సత్యవతికి పెళ్ళి అయిన ఎనిమిది సంవత్సరాల తర్వాత సాయికృష్ణ పుట్టాడు! తర్వాత మళ్ళీ పిల్లలు పుట్టలేదు!

అందుకే, వేదమూర్తిగారు తాతయ్యా అయినా, సత్యవతి మాత్రం అమ్మగానే మిగిలిపోయింది!

సాయికృష్ణ స్నానం చేసివచ్చి మామయ్యతో అన్నాడు "మామయ్యా! మీరు కూడా స్నానం చేసిరండి! వేడినీళ్ళు రెడీగా ఉన్నాయి!"

ఆయన స్నానానికి లేవగానే సత్యవతి బీరువాలోనుండి చలువచేసిన తెల్లటి పంచె టవల్ తీసి ఇచ్చింది.

వాళ్ళు స్నానాలు చేసిరాగానే వంటింట్లో డైనింగ్ టేబుల్ ఉన్నా ఇద్దరికీ కిందనే పీటలు వేసి భోజనాలుపెట్టి, పక్కనే కూర్చుని వడ్డించసాగింది!

"అన్నయ్యా! కాత్యాయని వదిన ఎలా ఉన్నది? ఆరోగ్యం బాగుంటోందా? ఇంతకీ కార్తీక సమారాధన, వనభోజనాలు ఏర్పాటు చేశావట కదా! కృష్ణమూర్తి, సూర్యనారాయణ, గౌరి, జానకి, సులోచన వాళ్ళ పిల్లలు ఎలా ఉన్నారు? బాగా చదువుతు

న్నారా? భాను అన్నయ్య, ప్రమీల వదిన కులాసానా? వాడిమీదనయితే నాకు భలేకోపంగా ఉన్నది! అడ్రెసు కనుక్కొని ఉత్తరం రాసినా నేనే అసలు రాయడంలేదని అభాండాలు వేశాడట కదా తను రాయకపోగా! రాగచంద్రిక ఇక్కడే ఉన్నదట కదా"

"సత్యా మాట్లాడుకోవాలే కాని జీవితాంతం చెప్పుకున్నా తరగని కబుర్లు, ఎన్నో విశేషాలు ఉన్నాయి! ఎన్ని అని చెప్పేది? ఏమని వివరించేది? "

"అన్నయ్యా నీకు ఇష్టమని గోంగూర పప్పు వండాను. ఇంకాస్త వేస్తాను!"

సాయికృష్ణ నవ్వుతూ అన్నాడు "అమ్మా! ఈ పదిసంవత్సరాలు ఈ ప్రేమ ఏమయిపోయిందే? నాకు పులిహోర, గోంగూర ఇష్టమని ఎన్నిసార్లు అడిగినా చేయవేం? "

వేళాకోళంగా ఆట పట్టిస్తున్న కొడుకు నెత్తిమీద సుతారంగా మొట్టి అన్నది!

"ఏమయిపోయినా- తిరిగి గుర్తుకుతెచ్చిందీ, కలిపిందీ నువ్వేగా! "అనురాగం" అనే మల్లెపూలు, "మమకారం" అనే మరువం, 'ప్రేమ' అనే కనకాంబరాలు కలిపి 'అనుబంధం' అనే దారంతో కదంబమాల కట్టింది నువ్వేగా! అన్నీ తెలిసిన నువ్వే ఏమయిపోయాయి? అని ఏమీ తెలియనట్లు అడుగుతావేం? " అని వేదమూర్తిగారి వేపు తిరిగి "అన్నయ్యా ఏమిటీ నవలాభాష అని భయపడుతున్నావా? నీ మేనల్లుడు లైబ్రేరియన్ కదా! వాడు తెచ్చి ఇచ్చే పుస్తకాలు చదివీ, ఒంటపట్టించుకునీ ఇలా మాట్లాడేశాను" అన్నది!

"లేదు సత్యా ఎలా చెప్పినా అందంగా నిజం చెప్పావు! నువ్వు చెప్పినట్లు మల్లెలు మరువం విడివిడిగా ఉంటే అదో పువ్వు ఇదో ఆకు! కాని వాటి మధ్యన బంధం వేస్తేనే కదంబం అందం, చక్కటి పరిమళం!"

"వహ్వా! మామయ్యా మీరే బాగా చెప్పారు!"

"మీ మామయ్య ఎలాగయినా మాష్టారు కదా! ఏదయినా మనసుకు హత్తుకునేలా చెబుతారు! ఇన్ని కబుర్లు చెబుతావు కాని సాయీ రేపు నీ పెళ్ళి అయితే నువ్వు ఎంత గొప్పగా ఈ రిలేషన్స్ మెయిన్‌టెయిన్ చేస్తావో చూడాలి!"

వేదమూర్తిగారు సాయికృష్ణ తరపున మాట్లాడుతూ అన్నారు. "లేదు సత్యా! సాయికృష్ణ అలాంటి మూర్ఖుడు కాదు! నాకు ఆ నమ్మకం ఉంది! నేను ఊహించిన దానిని బట్టి సాయి లైబ్రేరియన్‌గా తన బాధ్యతలు నిర్వర్తించడమేకాక, మంచి సాహిత్యాన్ని జీర్ణించుకున్నాడు! మంచి అలవాట్లు నేర్చుకున్నాడు! చిన్నవాడిని పొగడకూడదు కాని ఆ విజ్ఞత, సంస్కారం అతని మాటల్లోనే తెలుస్తున్నాయి!"

"ఏమో అన్నయ్యా! ఇన్ని రోజులకి మా అందరిని గుర్తుచేసుకున్నందుకు ఇన్ని సంవత్సరాలకి మా అందరిని కలవాలి అనుకుంటున్నందుకు మీరేం అంటారోనని, ఏం అనుకుంటారోనని భయపడ్డాను! ఎవరేం తప్పు పడతారోనని మనసులోనే కుమిలిపోయాను! అనుక్షణం మధనపడ్డాను! సాయికృష్ణ ఉత్తరం చూశాక కొంత ఊపిరి పీల్చుకున్నాను"

"ఎందుకు తప్పు పడతామే పిచ్చిదానా! ఆ మాటకొస్తే నువ్వు మమ్మల్నీ తప్పు పట్టవచ్చు! ఇక తప్పు ఒప్పులను తవ్వుకోడం మానేసి కనీసం ఇప్పటినుండి అయినా, మనందరం ఎలా కలసి ఉండాలని కోరుకుంటున్నామో అలా ఉందాము!"

"అవును అన్నయ్యా! సమర్థించుకోవడం కాదుగాని మన కుటుంబమేకాదు ప్రతి సంసారంలోనూ ఇదే పరిస్థితి! ఒకే కుటుంబంలోని ఏ ఒక్కరి మధ్యనా సత్సంబంధాలు లేకపోవడం! పోట్లాటలు. మనస్ప

ర్థలు, ఆస్తి తగాదాలు, మాటపట్టింపులు, అహంకారాల వలన కొందరి మధ్యన అయితే ఎలాంటి కారణం లేకుండానే తరాల అంతరంవలన మరికొందరి కుటుంబాలలో మనవలెనే!"

వేదమూర్తిగారు మాట్లాడకపోవడం చూసి, సాయికృష్ణ ఆ టాపిక్ మార్చి, రాజకీయాలు, సినిమాలు గురించి మాట్లాడాడు!

భోజనాలు అయిపోగానే సాయికృష్ణ బయట పని ఉందని వెళ్ళిపోయాడు!

వేదమూర్తిగారు హాలులోనే పడక్కుర్చీలో కూర్చుంటే సత్యవతి వచ్చి పక్కనే నేలమీద కూర్చుంది!

"అన్నయ్యా తాంబూలం వేసుకుంటావా?"

ఇవ్వమన్నట్లుగా ఆయన తలూపారు!

సత్యవతి లేచి ఫ్రిజ్‌లో కవర్‌లో పెట్టిన తమలపాకులు తీసుకుని, ఈనెలు తీసి, సున్నంరాసి వక్కపొడి వేసి ఇచ్చింది!

ఆయన తాంబూలం నములుతూ ఉండిపోయారు!

సత్యవతి కూడా ఏదో ఆలోచిస్తున్నట్లుగా, కాసేపు అలాగే ఉండిపోయింది!

ఇద్దరి మధ్యనా దాదాపు అయిదు నిముషాలసేపే నిశ్శబ్దం రాజ్యమేలింది!

కాసేపటికి దానిని భంగపరుస్తూ అన్నది సత్యవతి "అన్నయ్యా! ఇదిగో- భరించలేని ఈ ఒంటరితనంలోనే, ఈ నిశ్శబ్దంలోనే గడుపుతున్నా ఇన్నాళ్ళూ. సాయికృష్ణ చదువు, మీ బావగారి ఆఫీసు పొద్దున్నే హడావిడిగా వంట ప్రయత్నాలు వీటితోనే చూస్తుండగానే ఇన్ని సంవత్సరాలు గడిచిపోయాయి!

సాయి ఉద్యోగంలో సెటిల్ అవడం, ఆయన ఆఫీసుకు సెలవుపెట్టి, ఇంటిదగ్గరే రెస్టు తీసుకోవడం, నా అనారోగ్యం, ఇపుడు గుర్తుకొస్తున్నారు మీరందరూ!

సాయికృష్ణ పరిస్థితి కూడా అదే! ఒక్కడే పిల్లాడు! మొదటినుండీ ఒంటరిగానే పెరిగాడు! స్నేహితులు ఉన్నా సాయంత్రం వరకే! మళ్ళీ ఇంటిదగ్గరికి వచ్చేసరికి ఒంటరితనం, 'నా' అనే ఆత్మీయులు, 'మన' అనే బంధువులు లేకుండా ఇన్నాళ్ళూ ఎలా గడిపామా? అని ఎప్పుడూ అంటూ ఉండేవాడు సాయి! నా ఆలోచన, మావారి అంగీకారం, వాడిప్రోద్బలం, పట్టుదల అన్నీ కలిసి సాయికృష్ణని మీ ఇంటికి వచ్చేలా చేశాయి! బంధాలకంటే బాధ్యత ముఖ్యమంటారు! అసలు బంధాలే లేనపుడు, బాధ్యతలకు గుర్తింపులేదని ఉద్యోగానికి సెలవుపెట్టి మరీ, ఆత్మీయులకోసం, మన రక్త సంబంధీకుల కోసం వెతుక్కుంటూ బయలుదేరాడు! ఇప్పుడు నాకెంతో సంతోషంగా ఉంది! మళ్ళీ ఆరోజులు తిరిగి వస్తున్నాయన్న పిచ్చి ఆనందంగా ఉంది!"

పొడిగా అన్నారు వేదమూర్తిగారు "మళ్ళీ తిరిగి ఆ రోజులు వస్తాయనుకోవడం పిచ్చితనమే అవుతుంది సత్యా! మరీ అంత అత్యాశ కాకపోయినా, కనీసం మనమధ్యన ఉన్న రిలేషన్‌షిప్ గుర్తుంచుకుని, ఒకరిని ఒకరు గుర్తుపట్ట గలిగితే చాలు!"

సత్యవతి అన్నగారి కళ్ళల్లోకి చూస్తూ అలాగే ఉండిపోయింది!

'ఒకరిని ఒకరం గుర్తుపట్టగలిగితే చాలు' అనే ఆయన మాటలే ఆలోచింపచేస్తున్నాయి!

ఆయన కళ్ళు మూతలు పడుతూ ఉండటం గమనించి "అన్నయ్యా! గదిలో పక్కవేస్తాను పడుకో" అంటూ గదిలో మంచంవేసి, పక్కవేసింది!

వేదమూర్తిగారికి కూడా కాసేపు విశ్రాంతి తీసుకోవాలనిపిస్తోంది! పడుకున్న పది నిముషాలలోనే నిద్రలోకి జారిపోయారు!

సత్యవతి వంటిల్లు సర్దుకుని వచ్చి, హాల్లో పడుకుని సాయికృష్ణ లైబ్రరీనుండి తెచ్చి ఇచ్చిన పుస్తకం తీసింది!

వేదమూర్తిగారు నాలుగింటికి నిద్రలేచి, ముఖం కడుక్కుని వచ్చేసరికి ఆయన బావ గారు, సత్యవతి భర్త అయిన దక్షిణామూర్తి వచ్చారు! ఇప్పటికీ దక్షిణామూర్తి ముఖంలో ఆ 'మొహమాటం' తాలూకు ఛాయలు పోలేదు!

దక్షిణామూర్తి ఎంతో ఆదరణగా పలకరించాడు! పక్కనే కూర్చుని, ఆప్యాయంగా చేతిని నొక్కాడు! కుశలప్రశ్నలు వేసారు!

కాని 'ఇన్ని రోజులు దూరం అయినందుకు బాధగా ఉంది' అనే భావం ఎక్కడా బయటపెట్టలేదు ఆయన!

ఆ భావం మనసులో ఉన్నా, బయటపెట్టడానికి మొహమాటం అడ్డువచ్చి ఉంటుంది అని సరిపెట్టుకున్నారు వేదమూర్తిగారు!

రెండురోజుల తర్వాత కలుసుకున్నా, రెండు సంవత్సరాల తర్వాత కన్పించినా, ఇరవయి సంవత్సరాల అనంతరం కలిసినా ఆయన ప్రవర్తన అలాగే ఉంటుందనే సంగతి సత్యవతికీ సాయికృష్ణకీ తెలుసు!

అలాగని మనసులో ఎలాంటి చెడు ఆలోచనలు, దురుద్దేశాలూ ఉండవు! ఆయన స్వభావమే అంతా!

చాలాసేపు బావబావమరుదులు కబుర్లతో కాలక్షేపం చేసారు!

ఆ సాయంత్రం వేదమూర్తిగారు, సత్యవతి దగ్గరలో ఉన్న దేవాలయానికి వెళ్ళి పూజ జరిపించి వచ్చారు!

రాత్రి భోజనాలదగ్గర వేదమూర్తిగారు సాయికృష్ణతో అన్నారు "సాయీ మన టార్గెట్ ఇంక వారం రోజుల్లోకి వచ్చింది! కనీసం నువ్వు నాలుగు రోజులముందరే రావాలి! చాలా పనులు ఉన్నాయి! నేను ఒక్కడినే చేయలేను"

"భలేవారే! మీరు చెప్పాలా మామయ్యా! ఫంక్షన్ సోమవారమయితే గురువారానికల్లా విజయవాడ వచ్చేసేయనూ!"

"మీ బావగారూ, నేను శనివారం సాయంత్రానికల్లా వచ్చేస్తాము అన్నయ్యా" చెప్పింది సత్యవతి!

అంగీకార సూచకంగా తల ఊపి ఊర్కున్నారు దక్షిణామూర్తి!

ఆ రాత్రి దక్షిణామూర్తి, సాయికృష్ణ గదిలో పడుకుంటే, వేదమూర్తిగారు, సత్యవతి హాలులో పడుకుని చాలాసేపు గొంతు తగ్గించి మాట్లాడుకుంటూ ఉండిపోయారు!

మర్నాడు ఉదయం వేదమూర్తిగారిని, బస్‌స్టాండ్‌లో విజయవాడ బస్ ఎక్కించి వచ్చాడు సాయికృష్ణ!



ఇంటికి వచ్చిన వేదమూర్తిగారికి, కాత్యాయనికి మధ్యన ఈ వారం రోజుల ట్రిప్ తాలూకు కబుర్లూ, విశేషాలతో రెండు

రోజులు, రెండు నిముషాలలా గడిచిపో యాయి!

ఆయన ఇంట్లో అడుగుపెట్టగానే ఆకృతి వచ్చి తాతయ్యని చుట్టేసుకుపోయింది! ఆయనని వదిలిపెట్టలేదు!

రెండురోజుల ఫుల్‌రెస్ట్ తరువాత, ఆకృతిని తోడుగా తీసుకుని రేపల్లె వెళ్ళారు! కాత్యాయని చెల్లెలు, తన మరదలు అయిన కామేశ్వరి, ఆమె భర్త హనుమంతరావుకి మరీమరీ చెప్పారు! ఆ దంపతులకి పిల్లలు లేరు!

వారిద్దరూ తప్పకుండా వస్తామని మాట ఇచ్చాక తిరుగు ప్రయాణమయి రాత్రికల్లా విజయవాడ చేరారు!

మర్నాడు ఉదయమే లేచి, భార్యాభర్తలు ఇద్దరూ కూర్చుని, సమారాధన రోజు ఏర్పాట్లు ఎలా చేయాలి? ఏవేం చేయాలి? అందుకు కావలసిన లిస్ట్ మొత్తం ప్రిపేర్ చేశారు!

ఆరోజు ఆయన బ్యాంకునుండి డబ్బు విత్‌డ్రాచేసి తీసుకువచ్చారు!

ఆ సాయంత్రం భార్యాభర్తలు ఇద్దరూ బజారుకెళ్ళి,

మగవాళ్ళందరికీ ఫాంటు షర్టులు, ఆడవాళ్ళకి చీరలు, చిన్నవాళ్ళకి పరికిణీ ఓణీలు, ఆకృతికి గౌను కొన్నారు!

బట్టల పేకెట్లతో రిక్షా నిండిపోయింది!

మర్నాడు బజారు వెళ్ళి సరుకులు, ఇత్యాదులు కొనుక్కు వచ్చారు!

ఇద్దరికీ ఎంతో ఉత్సాహంగా ఉన్నది!

ఇంట్లో ఏదో పెళ్ళి జరగబోతోందన్న సంతోషంగా ఉన్నది!

చాలా రోజులకి తమ వాళ్ళందరూ, కలుసుకోబోతున్నామని సంబరంగా ఉంది!



వేదమూర్తిగారు దగ్గరుండి, పనిమనిషి సహాయంతో, పొగడచెట్టు చుట్టూ ఉన్న చిన్నచిన్న మొక్కలు పీకిపారేయించి, శుభ్రం చేయించారు.

అలాగే పెరడులో ఉసిరిక చెట్టు చుట్టూ ఉన్న ఖాళీ జాగా అంతా శుభ్రం చేయించారు! కాత్యాయని ఇల్లంతా కడిగించి, బూజులు దులిపి, శుభ్రంగా సర్దింది.

భార్యాభర్తలు ఇద్దరూ పోటీలుపడి పనులు చేశారు.

వయసులో ఉన్న వారిలా నడుములు వంచి మరీ పనిచేశారు. ఆకృతికూడా వారితోపాటు చిన్నచిన్న పనులు చేసింది.

ఆరాత్రి...

నడుము నొప్పితో భార్య బాధపడుతుంటే వేదమూర్తిగారు పక్కనే కూర్చుని నడుము మీద అమృతాంజనం మర్దన చేశారు.

"మీకెందుకండీ శ్రమ! మీరు మాత్రం కష్టపడలేదా? " అని భార్య ఎంత వారిస్తున్నా ఊర్కోలేదు ఆయన.

"పిచ్చిదానా! ఈ నడుము నొప్పి నాకు వస్తే పక్కనే కూర్చుని నువ్వు సేవలు చేయవూ! ఆ మాటకొస్తే ఎన్నిసార్లు నా కాళ్ళు పట్టావు? కనీసం ఇలా అయినా నీ ఋణం తీర్చుకోనీ"

భర్త అనురాగానికి ఆమె కళ్ళు తడి అయినాయి.

ఏభయి అయిదేళ్ళ కాత్యాయని భర్త గుండెల్లో తల దాచుకుని మనసులో అనుకుంది...

"రెక్కలొచ్చి పక్షులు ఎగిరి పోతేనేం వెచ్చటి గూడు ఉండగా? "

కాసేపటికి నడుమునొప్పి తగ్గి కాత్యాయని నిద్రలోకి జారిపోయింది. ఆమెకి అటువైపు పడుకున్న ఆకృతి గాఢనిద్రలో ఉంది.

అపుడే... పడుకుని నిద్రకుపక్రమించబో

తున్న వేదమూర్తిగారి ఛాతీలో కలుక్కుమనే బాధ అపుడు మొదలయింది.

ఆ బాధ నెమ్మదిగా గుండెల మొత్తానికి విస్తరించసాగింది.

ఊపిరి బరువుగా వస్తూ శరీరం భారంగా అన్పిస్తోంది. శరీరమంతా చెమటలు పడుతుంటే కంగారుగా తలతిప్పి చూశారు.

తనవైపు వత్తిగిలి తల క్రింద చేతులు పెట్టుకుని పడుకున్న కాత్యాయిని హాయిగా, ప్రశాంతంగా నిద్రపోతోంది.

ఛాతీమీద చేయిపెట్టి అదిమిపెడుతూ నెమ్మదిగా లేచారాయన.

రాజమండ్రిలో డాక్టరుగారు రాసి ఇచ్చిన టాబ్లెట్స్ ఇంకా రెండు తన పర్సులో ఉన్నట్లు గుర్తు.

భారంగా అడుగులువేస్తూ ఆ మసక వెలుతురులోనే గదిలోకి నడిచి అల్మైరా తీశారు.

ఆయన అదృష్టంకొద్దీ పర్సులో టాబ్లెట్ ఉంది.

టాబ్లెట్ వేసుకుని, గోడ ఆసరాగా వచ్చి మంచంమీద పడుకున్నారు.

పగలంతా, శ్రమ చేయడంవలన వచ్చిన నొప్పి అనుకుంటూ వెల్లకిలా పడుకున్నారు.

ఊపిరి అందనట్లుగా అన్పించి ఎడమవైపుకి తిరిగి పడుకుంటే కాస్త రిలీఫ్‌గా తోచింది.

ఏ అర్ధరాత్రికో నిద్రలోకి జారిపోయారు.

మర్నాడు ఉదయానికల్లా సూట్ కేస్‌తో సాయికృష్ణ దిగాడు.

మామయ్యని చూడటంతోనే ఆయన ముఖంలోని మార్పుని చప్పున పసిగట్టాడు సాయి. వేదమూర్తిగారి ముఖం వడలిపోయినట్లుగా, బాధ భరించడంవలన కమిలిపోయినట్లుగా, పీక్కుపోయి నీరసంగా ఉంది.

కాత్యాయని ఆ మార్పు గమనించనే లేదు.

"మామయ్యా! ఏమిటీ అలా ఉన్నారు? " ఆందోళనగా అడిగాడు సాయికృష్ణ.

నీరసంగా నవ్వారు "ఎలా ఉన్నాను. మామూలుగానే ఉన్నానుగా"

"కాదు ఎందుకో బాగా బడలికగా ఉన్నారు"

కాత్యాయని అందుకుని అన్నది "లేదయ్యా! చెప్పినా వినకుండా ఎక్కడలేని పనులన్నీ నెత్తిన వేసుకుని చేస్తున్నారు! పేరుకే పక్కన పనిమనిషి, అంతపనీ ఈయనే చేస్తున్నారు. బజారుపనీ ఇంటిపనీ"

"నేను చేసింది ఏమీ లేదురా! ఇంకా చేయవలసినవి చాలా ఉన్నాయి. సరే ముందర కాఫీతాగి స్నానం చేసిరా" అన్నారు.

కాత్యాయని ఇద్దరికీ కాఫీ కలిపి ఇచ్చింది.

తర్వాత... మేనల్లుడిని వెంటపెట్టుకుని ఆయన చాలా పనులు చేశారు.

ఫొటోగ్రాఫర్‌ని మాట్లాడారు. మిల్క్‌డైరీకి వెళ్లి ముందుగా ఆర్డర్ ఇచ్చారు. పుస్తకాల షాపుకు వెళ్లి సుమతీశతకము, భాస్కరశతకము పదేసి కాపీల చొప్పున కొన్నారు. ఎందుకని సాయికృష్ణ అడిగితే చెప్పారు "అందరికీ పంచి ఇవ్వడానికి కనీసం రెండు రోజులకొకసారయినా ఒక పద్యం చదివితే అందులోని సారాంశం ఒంటపట్టించుకుంటే చాలు వేరే భగవద్గీతలు అవసరంలేదు. మనలోనే చాలా మార్పువస్తుంది"

తర్వాత పురోహితుడి దగ్గరకి వెళ్లారు. ఆయన ఎంతో సంతోషించారు. "అదృష్టవంతుడివయ్యా వేదమూర్తీ! అందరినీ కలుపుకు వస్తున్నావు. చెబితే మాట వినే కొడుకులుండటం నీ అదృష్టం. నాకూ ఉన్నాడు ఒక పుత్రరత్నం. పది తద్దినాలు పెట్టి వాడి

పుస్తకాలు కొని, ఇరవయి పెళ్ళిళ్లుచేసి వాడి ఫీజులు కట్టి వాడినో ప్రయోజకుడిని చేస్తే ప్రస్తుతం హైదరాబాదులో ఉద్యోగం చేస్తున్నాడు. ఒరేయ్ హైదరాబాదు వస్తానురా. ఒక్కసారి ఆ బిర్లామందిరం అవీ చూపించరా అంటే ససేమిరా తీసుకెళ్లలేదు. అదేమంటే నేను వాడి తండ్రి అని చెప్పుకోవడం వాడికి నామోషియట. నా వేషభాషలు వాడికి చిన్నతనమట. తన తండ్రి తద్దినాలు పెట్టే పురోహితుడని తెలిస్తే స్నేహితులముందు వాడి పరువుపోతుందట. అయ్యా వేదమూర్తీ ఇదయ్యా నా పరిస్థితి. కొడుకు పరువుకోసం నా కడుపునింపే నా వృత్తి ధర్మాన్ని ఎలా వదులుకోను? ఎపుడయినా మేము వాడిని చూడాలి అనుకుంటే వాడేవచ్చి దేవుడిలా దర్శనం ఇచ్చి వెళతాడట. నన్ను మాత్రం అక్కడకు రానీయడు. ఎలాగూ వాడికి తల్లితండ్రులను చూడాలని అన్పించదు కాబట్టి వాడూరాడు. అంతే ఇలా రోజులు వెళ్లమారుస్తున్నాను. ఏదో తెలిసిన వాడివని ఉండబట్టలేక నా గోడు వెళ్లబోసుకున్నాను. వేరేగా అనుకోకు"

"ఛఛ! అలా అనుకోను కానీండి మాఇంట్లో హడావిడి అయిపోతే నేనే మిమ్మల్ని హైదరాబాదు తీసుకువెళతాను"

"మాటకే కడుపు నిండిపోయిందయ్యా వేదమూర్తీ" అన్నారు ఆయన. ఆయన దగ్గర సెలవు తీసుకుని, ఆరోజు పనులు ముగించుకుని ఇంటిని చేరారు. ఆ సాయంత్రం సాయికృష్ణ, ఆకృతిని తీసుకుని కనకదుర్గ గుడికి వెళ్లి వచ్చాడు. ఈ లోపల ఎందుకయినా మంచిదని వేదమూర్తిగారు డాక్టరు దగ్గరకి వెళ్లి హెల్త్ చెకప్ చేయించుకున్నారు.

డాక్టరు ఒకటే సలహా ఇచ్చాడు. టెన్షన్స్ తగ్గించుకుని, రెస్ట్ తీసుకోమని. అవసరమయినపుడు వేసుకోడానికి టాబ్లెట్స్ రాసి ఇచ్చాడు.

అప్పటికపుడు కావల్సిన కొన్ని సరుకులు, కూరగాయలు, డైరీనుండి పాల పేకెట్స్ అన్నీ సాయికృష్ణే తీసుకువస్తున్నాడు.

శుక్రవారం... ఆరోజు మధ్యాహ్నం! సాయికృష్ణ ఇంకా బజారునుండి రాలేదు. కాత్యాయని వంటింట్లో పనిలో ఉంది. వేదమూర్తిగారు ఒక్కరే బయట వరండాలో పడక్కుర్చీలో పడుకుని, క్రితంరోజు తెచ్చిన భాస్కర శతకము పఠిస్తున్నారు.

అలాంటి సమయంలో వచ్చాడు పోస్ట్ మేన్.

"మూర్తిగారూ మీకు లెటర్" అని ఆయన కాళ్ల దగ్గర పడేలా విసిరి వెళ్లిపోయాడు. వేదమూర్తిగారు చేతిలోని పుస్తకం పక్కన పెట్టి ముందుకు వంగారు.

ఆయన కాళ్ల దగ్గర పడి ఉన్న పొడవాటి కవర్‌ని చేతుల్లోకి తీసుకున్నారు.

అపుడు మొహమాటపడి చెప్పలేక తనకు రావడం కుదరడంలేదని తన కుటుంబ సభ్యుల్లో ఎవరో రాసిన ఉత్తరం కాదుకదా!

కాని ఆ మాటకి ఇంత కవరు అవసరం లేదే!

కవరు లోపల నాలుగయిదు కాగితాలు ఉన్నట్లుగా బరువుగా తోస్తోంది.

అనుమానంతో కనుబొమలు ముడుచుకున్నాయి.

అనుకోకుండా మనసు తెలియని స్పందనకు గురి అయింది.

గబగబా కవరు చింపి ఉత్తరం బయటకు తీశారు. ఆయన ఊహించినట్లుగానే లోపల నాలుగు పేజీలు పిన్‌చేసి ఉన్నాయి. మొదటి రెండులైన్లు చదవగానే ఆయనకి మొదట అర్థంకాలేదు. చప్పున ఆఖరు పేజీ తిప్పి అక్కడి సంతకం చూశారు.

ఆ మూడక్షరాల పేరుని మనసులోనే మననం చేసుకున్నారు. మళ్లీ మొదటి పేజి తిప్పి చదవడం మొదలెట్టారు.

ఉత్తరం చదువుతున్న ఆయన ముఖంలో గబగబా రంగులు మారసాగాయి. చేతివేళ్ళు వణుకుతూ గుప్పిటలు బిగిసాయి. నుదుట స్వేదం అలుముకుంది. మనసులోపల ఉవ్వెత్తున ఎగిసిన భావావేశం లావాలా పొగలు సెగలు చిమ్ముతూ గుండెల నిండా ప్రవహించసాగింది.

అంతేకాదు... డాక్టరు ఏదయితే కూడదని హెచ్చరించారో అదే విపరీతమయిన టెన్షన్‌కి గురి అవసాగారు.

ఆయన కలలో కూడా ఊహించని సంఘటన అది.

విపరీతమయిన టెన్షన్‌తో చదవడం పూర్తిచేసిన ఆయన ముఖం చివరికి రక్తం చిందేటంత ఎర్రగా, కందగడ్డలా తయారయింది.

"భగవంతుడా!" అప్రయత్నంగా ఆయన పెదవులు ఆ స్వరాన్ని ఉచ్ఛరించాయి.

కాసేపు కళ్ళు మూసుకుని, కుర్చీలో అలాగే వెనక్కి వాలిపోయి పడుకుని ఉండిపోయారు. దాదాపు పావుగంట తర్వాత ఒక నిశ్చయానికి వచ్చినట్లుగా కళ్ళు తెరిచారు.

గుండెల మీద ఉన్న ఆ కవరుని చేతిలోకి తీసుకుని లోపలికి తొంగిచూశారు. లోపల రోటిముందు కూర్చుని కాత్యాయని పచ్చడి నూరుకుంటోంది తాపీగా.

ఆయన నెమ్మదిగా లేచారు. హఠాత్తుగా శరీరం స్వల్పంగా తూలినట్లయి తల తిరిగింది. అది క్షణికం మాత్రమే.

మళ్ళీ శరీరాన్ని స్వాధీనంలోకి తెచ్చుకుని, గదిలోకి వెళ్ళి ఆ కవరుని, బీరువాలో తన ఫైల్స్ అడుగున భద్రపరిచి, గాఢంగా నిట్టూర్చి, ఇవతలకు వచ్చారు.

అపుడే సాయికృష్ణ లోపలికి అడుగుపెడుతున్నాడు. చురుకైన అతని కళ్ళు క్షణంలో పసిగట్టేశాయి.

మామయ్య ముఖంలో మళ్ళీ అదే మార్పు!

చెప్పలేని బాధ అనుభవించిన తర్వాత కలిగే నీరసం! వడలిపోయిన ముఖం! అతనికి అర్థం కాలేదు.

తనే పొరబడుతున్నాడా? లేక మామయ్యే దాస్తున్నాడా?

అయినా అందులో రహస్యమేముంది? ఆరోగ్య విషయంలో దాపరికమేముంది?

వేదమూర్తిగారికి పెరట్లోకి వెళ్ళి చల్లటి నీళ్ళతో ముఖం కడుక్కుంటేకాని మనశ్శాంతి అన్పించలేదు. శరీరం స్వాధీనంలోకి రాలేదు.

భోజనాల దగ్గరకూడా ఆయన ఎప్పటిలా మాట్లాడలేదు. ఏదో ఆలోచిస్తున్నట్లుగా పరధ్యానంగా తిన్నారు.

అది గమనించినా సాయికృష్ణ బయటపడలేదు.

భోజనం తర్వాత మంచంమీద నడుం వాల్చిన వేదమూర్తిగారు సాయంత్రం అయిదింటివరకూ లేవలేదు.

మధ్యాహ్నంపూట అంతసేపు నిద్రపోవడం కాత్యాయని ఎపుడూ చూడలేదు. సాయికృష్ణ గమనించీ గమనించనట్లుగానే పుస్తకం చదువుతూ ఉండిపోయాడు.

కానీ వేదమూర్తిగారు కళ్ళు మూసుకుని పడుకున్నారేకాని నిద్రపోలేదు. మనసులోపల జరుగుతున్న తీవ్ర సంఘర్షణని భరిస్తున్నారు. కనురెప్పల మాటునే ఆయన ఆలోచనలను అదిమిపెట్టారు.

కాసేపు సుమతీ శతకంలోని పద్యాలు స్ఫురణకు తెచ్చుకున్నారు.

భాస్కర శతకం స్మరించుకున్నారు.

దాదాపు మూడు గంటల పోరాటం తర్వాత ఒక ఖచ్చితమయిన నిర్ణయానికి వచ్చారాయన. అపుడు మనసు బరువు తీరినట్లయింది.

అలా అయిదింటివరకూ మంచంమీదనే పడుకుని అపుడు లేచారు. ఆయన లేవడం చూసి సాయి అడిగాడు "మామయ్యా! బాగా బడలికగా ఉన్నట్లున్నారు. అలా పార్కువరకూ వెళ్లివద్దామా"

"లేదు లేరా! నువ్వు వెళ్లిరా. ఎందుకో కొంచెం తలనొప్పిగా ఉన్నది"

సాయి విచిత్రంగా చూశాడు. మామయ్య సాధారణంగా అబద్ధం చెప్పరు. చెప్పారంటే దానివెనుక ఏదో బలమయిన కారణం ఉండే ఉంటుందన్న విషయం వెంటనే పసి గట్టాడు సాయి. మారుమాట్లాడకుండా ఒక్కడే వెళ్లాడు పార్కుకి.

సాయికృష్ణ అటు వెళ్లిన అరగంటకి, వేద మూర్తిగారు రోడ్డుమీదకి వచ్చారు.

టైము చూసుకున్నారు. ఆరు కావస్తోంది. ఆటోని పిలిచి, ఎక్కబోతూ ఎందుకయినా మంచిదని అతనిని అడిగారు. "మెడ్రాస్ హౌరా వచ్చే టైమేకదూ!"

అతను అవునని తలూపి, ఆటో రైల్వేస్టే షన్వైపు పోనిచ్చాడు.

ప్లాట్‌ఫారమ్ టికెట్‌కొని, రైల్వే స్టేష న్‌లో మెట్లు ఎక్కి, తను వెళ్లవలసిన ప్లాట్ ఫారమ్ వైపు మళ్లీ మెట్లు దిగుతుంటే గుండెల్లో స్వల్పంగా నొప్పి వచ్చింది. కాళ్లు వణికాయి.

చేతితో గుండెలమీద నొక్కుకుంటూ క్రిందకి దిగారు. ట్రెయిన్ కోసం ఎదురు చూస్తూ అక్కడే బెంచిమీద కూర్చున్నారు ఒంటరిగా...



శనివారం సాయంత్రానికల్లా సత్యవతి, దక్షి ణామూర్తి రెండు సూట్ కేసులతో దిగారు. సత్యవతి వస్తూనే కాత్యాయనిని కౌగిలించు కున్నంత పనిచేసింది.

"వదినా!" అంటూ కళ్ల నీళ్లు పెట్టుకుంటే కాత్యాయని ఓదార్చింది. సత్యవతి చిన్నపి ల్లలా సంబరంగా, ఇల్లూ, పెరడూ అంతా తిరిగింది. ఆకృతిని ఎత్తుకుని ముద్దాడింది. అలా ఎత్తుకునే పెరడంతా కలియతిరు గుతూ ఏ మొక్క ఎక్కడ ఉన్నదో గుర్తుకు తెచ్చుకుంది.

ఇల్లు ఏం మారలేదు. అదేమాట కాత్యా యనితో అంటే ఆమె అన్నది "పోయిన సంవత్సరం వచ్చిన తుఫానుకి చాలా భాగం దెబ్బతిన్నది. చాలా చెట్లు కూలిపోయినా ఒక్క ఈ పొగడ చెట్టే తట్టుకుని నిలబడ గలిగింది"

"నిజమే వదినా! మా తరతరాలకి ప్రత్య క్షసాక్షి ఈ పొగడచెట్టు. ఈ పొగడచెట్టు కిందనే మా ఆటలు, పాటలు, అన్నాలు,

నిద్రలు, పిల్ల కథలు, పెద్దల కబుర్లు సమస్తం" ఆనందంతో పొగడచెట్టు గట్టుని తడుముతూ, గతాన్ని గుర్తుకు తెచ్చుకుంటూ సంబరపడిపోయింది సత్యవతి.

దక్షిణామూర్తి మాత్రం స్నానంచేసి వాకిట్లో మడతమంచం వేసుకుని హాయిగా కొండగాలి పీలుస్తూ ఈ ప్రపంచంతో తనకు సంబంధం లేనట్లుగా పడుకున్నాడు.

సాయికృష్ణ ఏదో పనిమీద బజారు వెళ్లాడు.

వేదమూర్తిగారు కాసేపు బావగారి పక్కనే కూర్చుని భార్య ఇచ్చిన కాఫీ తాగి, సందుచివర వరకూ వెళ్లారు.

దక్షిణామూర్తికి తాంబూలం అంటే మహా యిష్టం. ప్రతిరోజూ వేసుకుంటాడు. సత్యవతి ఎపుడూ తమలపాకులు కొని ఫ్రిజ్‌లో పెడుతూ ఉంటుంది. ఆ సంగతి గుర్తుకొచ్చే తమలపాకుల కోసం వేదమూర్తిగారు బయటకు నడిచారు.

ఆ రాత్రి గడప దగ్గర కూర్చుని సత్యవతి ఎప్పటెప్పటి కబుర్లో చెబుతుంటే కాత్యాయని వంట పూర్తి చేసింది.

భోజనాల దగ్గర పడుకునే సమయంలో వేదమూర్తిగారు మాట్లాడుతూనే ఉన్నా మనసెక్కడో ఆలోచిస్తోంది.

ఆ సంగతి సాయికృష్ణ దృష్టిని దాటిపోలేదు.

ఏమయింది? ఏం జరిగి ఉంటుంది? అని తీవ్రంగా ఆలోచిస్తూనే ఉన్నాడు.

నిన్న సాయంత్రం తలనొప్పి బయటకు రాలేను అన్న మామయ్య తను బయటకు వెళ్లిన అరగంటకే బజారుపని అంటూ హడావిడిగా బయటకు వెళ్లారని అత్తయ్య చెప్పింది.

ఆయన ప్రవర్తన వెనకగల ఈ మిస్టరీ ఏమిటి?

ఆలోచిస్తూ పడుకున్నాడు.

మర్నాడు... అంటే ఆదివారం ఉదయం... భానుమూర్తి, ప్రమీల, రాగచంద్రిక వచ్చారు.

వాళ్లు వచ్చిన అరగంటకి వరంగల్‌నుండి సూర్యనారాయణ, సులోచన, చరిత, చకిత వచ్చారు.

మరో గంటకి విశాఖపట్టణంనుండి గౌరి మనోహరి, మోహన్, అర్పిత వచ్చారు.

ఆ సాయంత్రం కృష్ణమూర్తి, జానకి వచ్చారు.

వినీల్‌కి, వికితకి ఆ సాయంత్రం ఏవో ముఖ్యమయిన ప్రయివేటు క్లాసులు ఉండటంవలన ఆ రాత్రికి బయలుదేరి, సోమవారం ఉదయంకల్లా వస్తారట.

రాత్రి ఏడు గంటల ప్రాంతంలో...

రేపల్లెనుండి కామేశ్వరి, ఆమె భర్త వచ్చారు. ఇల్లంతా సందడి సందడిగా ఉంది.

పెళ్లిలా ఉంది... పండగలా ఉంది...

కాత్యాయనికి అయితే కాళ్లుచేతులు ఆడనంత ఖంగారుగా ఉంది.

తన వాళ్లందరినీ ఒక్కసారిగా చూస్తూ ఉంటే సత్యవతికి ఉబ్బితబ్బిబ్బు అవుతున్నట్లుగా ఉంది.

మాటిమాటికి కళ్లల్లో నీళ్లూరుతుంటే హడావిడిగా ఆ గదిలోనుండి ఈ గదిలోకి ఈ గదిలోనుండి హాల్లోకి, హాల్లోనుండి వంటింట్లోకి పరుగులు పెడుతూ పనులు చేస్తోంది.

యాభయి ఏళ్ల సత్యవతి ఇరవయి ఏళ్ల అమ్మాయిలా చలాకీగా తిరుగుతూ అందరికీ కాఫీలు, టిఫిన్లు అందచేస్తుంటే,

సాయికృష్ణకే ఆశ్చర్యం వేసింది. అమ్మలో ఇంత శక్తి ఉన్నదా? మనుషుల మధ్యన ఉండే ఆత్మీయతలలో ఇంతటి బలమున్నదా? ఒకరినొకరు పలకరింపులతోనే

చాలాసేపు గడిచిపోయింది.

"బావగారూ! బాగున్నారా? ఎన్నాళ్ళయింది చూసి? ఎలా ఉంది మీ ఆరోగ్యం? "

"వదినా ఏమిటీ అవతారం? అన్నం తింటున్నావా? గాలి భోంచేస్తున్నావా?

"అత్తయ్యా! మీ ఆరోగ్యం ఎలా ఉంది? "

"పెదనాన్నా! వికిత ఎమ్‌సెట్‌కి ప్రిపేరవుతోందా? "

"ఏయ్ చకితా! ఏమిటీ హార్లిక్సు తాగవా? "

"మామయ్యా! ఈమధ్యన ఉర్కినే కళ్లు తిరుగుతున్నాయి. కారణమేమంటావు? "

"దగ్గు మందా! తాతయ్య దగ్గిర ఉంది. అడగవే మేనకోడలా!"

"బావా! జురాసిక్ పార్క్ చూశావా? "

"వదినా మా సంపెంగలు మత్తుగా ఉంటాయి. మీ సింహాచలం సంపెంగలు ఘుమఘుమలాడుతూ ఉంటాయి"

"అన్నయ్యా మొన్న క్రికెట్ మ్యాచ్ చూశావా? "

"అల్లుడుగారూ. మీరు కాకరకాయ తినరనుకుంటాను"

"అక్కయ్యగారూ ఆ కూరలు ఇలా పడేయండి. నేను తరిగిపెడతాను"

"తమ్ముడూ ఏమనుకోకుండా సిగరెట్ ప్యాకెట్ తెచ్చి ఇవ్వవూ"

"అత్తయ్యగారూ నడుము నొప్పికి మందు తీసుకోవడం లేదా? ఇంకా నయం అలా నిర్లక్ష్యం చేస్తే ఎలాగండీ బాబూ! కూతురు, అల్లుడు డాక్టర్లయి ఉండికూడా"

రకరకాల పిలుపులు, పలకరింపులు, కబుర్లు, కాలక్షేపాలు, సరదాలు, సంభాషణలు, ఎగతాళులు, ఆటపట్టింపులు కోలాహలంగా ఉంది వేదమూర్తిగారి ఇల్లు. మగవాళ్లందరికీ గదుల్లో మంచాలు వేశారు. ఆడవాళ్లు, పిల్లలు హాల్లో చాపలు వేసుకుని వరుసగా పడుకున్నారు.

గదుల్లో రాజకీయాలు, ఆఫీసు కబుర్లు, సినిమాల గురించి కబుర్లు దొర్లి పోతుంటే హాల్లో వంటలు, పిల్లలు, పెళ్లిళ్లు, పేరంటాలు గురించిన కబుర్లు జోరుగా సాగిపోతున్నాయి.

ఈ మధుర క్షణాలు శాశ్వతమయిపోతే బాగుండుననుకుంది సత్యవతి.

ఆత్మీయులని చూస్తే మనసు ఇంతగా పులకిస్తుందా అనుకుంది ప్రమీల.

ఇల్లంతా ఇంత సందడి, ఇంత కళ వచ్చి ఎన్ని ఏళ్లు అయింది అనుకుంది కాత్యాయని. వంటపని మర్చిపోయి కబుర్లు చెప్పుకుంటూ ఉంటే హాయిగా ఉంది జానకికి! ఆఫీసు, గొడవ, విసుగు, నీరసం ఇవన్నీ మటుమాయమయిపోయి, ఎంతో రిలీఫ్‌గా ఫీలయి, నాలుగు రోజులు ఇక్కడే గడిపితే బాగుండుననుకుంది సులోచన.

పేషెంట్లు, హాస్పిటల్ వాసన, రొటీన్ లైఫ్‌నుండి నాలుగురోజులపాటు విముక్తి లభించినందుకు సంతోషిస్తోంది గౌరీ మనోహరి!

చరిత, అర్పిత- పక్కపక్కనే పడుకున్నారు.

ఏదో విధంగా, వారి వారి జీవితాలలో దెబ్బతిన్నవారే ఇద్దరూ.

అనుక్షణం మనసును బడబానలం చేస్తున్న లక్షణాలను మర్చిపోయి, ఇద్దరు హాయిగా కబుర్లు చెప్పుకుంటున్నారు.

చరిత, రాగచంద్రికల మధ్యనయితే- సినిమాలు, సాహిత్యం ఒకటేమిటి? అనకాపల్లి నుండి అమెరికావరకూ అన్ని కబుర్లూ ధారాళంగా దొర్లిపోతున్నాయి.

ఆకృతి పరిస్థితి అయితే సరేసరి!

కాసేపు అమ్మ ఒడిలో, నాన్న గుండెల్లో,

అక్కపొట్టలో, తాతయ్య వీపుమీద, అమ్మమ్మ కౌగిలిలో, మామయ్య చేతులలో-

ఉక్కిరి బిక్కిరి అవుతున్నట్లుగా గడపసాగింది.

పిల్లలు లేని దుర్భరమయిన జీవితాన్ని జీవచ్ఛవాల్లా గడుపుతున్న కామేశ్వరికి అడవిలోనుండి నందనవనంలోకి వచ్చిపడ్డట్లుగా అన్పిస్తోంది.

అన్నిరకాల అనుభూతులను పంచుతూ, ఆ రాత్రి రెక్కల గుర్రమల్లే నిముషాలలో తెల్లవారిపోయింది.

ఆరోజే-

కార్తీక సోమవారం.

ఉదయం- ఆరుగంటలకల్లా వినీల్, వికిత కూడా వచ్చేశారు.

ఒక్క భానుమూర్తి కొడుకు, కోడలు మినహా- ఆ కుటుంబంలోని రక్తసంబంధీకులందరితోనూ ఆ ఇల్లు కిటకిటలాడిపోయింది.

ఆరోజు ఉదయమే, వేదమూర్తిగారు అందరినీ ఉద్దేశించి గట్టిగా అన్నారు.

"ఈ క్షణంనుండి దయచేసి నేను చెప్పిన విధంగా పనులు నెరవేర్చండి. వేరేగా అపార్థం చేసుకోవద్దు. నా యీ నిర్ణయాల వెనకగల పరమార్థం నెమ్మదిగా మీకే బోధపడుతుంది"

ఆయన ఆధ్వర్యంలో ఆయన నిర్ణయాల ప్రకారం పనులు జరగసాగాయి.

పెరట్లో, కట్టెల పొయ్యి పెట్టి, కాగుతో నీళ్ల పడేశారు.

నాలుగు గిన్నెలనిండా కుంకుడుకాయ పులుసు కలిపారు.

"తలంటు పోసుకోవడంలోనూ- ప్రేమ అనురాగం దాగివున్నాయి" అనే వేదమూర్తి గారి సలహాని అనుసరించి, బయటకు తీసిన షాంపూ పేకెట్స్‌ని మళ్ళీ ఎవరి సూట్ కేసులలో వారు సర్దేసుకుని, ఆయన నిర్ణయానికి తలవంచారు.

ఆ ప్రకారమే- బాత్‌రూమ్‌లో-

జానకి, కృష్ణమూర్తిని పీటమీద కూర్చోబెట్టి కుంకుడు నురుగుతో తలరుద్దుతూ ఉంటే కృష్ణమూర్తి, భార్య నడుము చుట్టూ చెయ్యివేసి దగ్గరకు లాక్కున్నాడు.

"ఛీ! పోండి! ఏమిటీ చిన్న పిల్లాడిలా!"

ఆ సమయంలో కృష్ణమూర్తి నిజంగా చిన్నపిల్లాడే అయిపోయాడు.

ఆమెను మరింత బలంగా హత్తుకున్నాడు.

యాంత్రిక జీవన ప్రవంతిలోపడి కొట్టుకుపోతున్న, వారి దాంపత్యజీవనంలో చాలా రోజుల తర్వాత "సహజంగా" కలిగిన తీయని స్పందన అది.

పక్కన బాత్‌రూమ్‌లో-

సూర్యనారాయణ, సులోచనా పరిస్థితీ అలాగే ఉంది.

ఉదయం లేచినది మొదలు వంట, ఆఫీసు, ఉద్యోగం-

ఇంటికి వచ్చి అలసట, నీరసం, విసుగు, నిద్ర-

చాలారోజులకి వీటన్నింటిని మర్చిపోయి, పెళ్ళి అయిన కొత్త రోజులను జ్ఞప్తికి తెచ్చుకుంటూ భర్త వీపు రుద్దుతున్న సులోచనని-

సూర్యనారాయణ. అలాగే మీదకి లాక్కున్నాడు.

"ఏమిటీ! తలంటు పోసుకోరా? " చిరుకోపంతో అంది.

నవ్వుతూ- అలాగే ఆమె చేతులను తన భుజాలమీదకి లాక్కున్నాడు.

సులోచన తిరస్కరించలేదు. ఆ ఆనందాన్ని అనుభవిస్తూ అతని వీపుమీద అలాగే వాలిపోయింది.

ఇద్దరి మనసుల్లో "సరికొత్త ప్రేమ"

పొంగి పొర్లుతుంటె-

చిలిపిగా నవ్వాడు సూర్యనారాయణ.

భర్తలకు తలంటుపోసి బయటకు వచ్చిన తోడికోడళ్లు ఒకరిని చూసి ఒకరు సిగ్గుపడి పోయారు. ఇద్దరి బుగ్గలు ఎర్రగా కందిపోయున్నాయి.

ఇద్దరి చీరలూ, పవిటలూ పూర్తిగా తడిసి పోయాయి.

వాళ్ళని చూసిన సత్యవతి వదలలేదు. వేళాకోళం చేయనేచేసింది.

"ఇంతకీ మీరు మొగుళ్లకి తలంట్లు పోశారా? వాళ్లు మీకు స్నానాలు చేయించారా? "

వెనకేవచ్చిన గౌరీ మనోహరి నవ్వుతూ అంది, "రెండూ కాదు! అన్నయ్యలు, వదినలు సరిగంగా స్నానాలు చేశారులే అత్తయ్యా"

సులోచనా, జానకి సిగ్గుగా లోపలికి పారిపోతే సత్యవతి, గౌరి పకపకా నవ్వారు.

తర్వాత వంతు గౌరీ-మోహన్లది.

బాత్‌రూమ్‌లో-

తనకు చేరువగా నిల్చుని తలరుద్దుతున్న భార్య పొట్టమీద ముద్దు పెట్టుకున్నాడు మోహన్!

"మీ వదినమ్మలని వేళాకోళం చేశావుగా! ఇప్పుడు నువ్వెలా తప్పించుకుంటావు" అంటూ.

"ఏయ్ చీర తడిసిపోతుంది!"

"ఫరవాలేదు. తర్వాత ఎలాగూ స్నానం చేస్తావుగా" అంటూ ఆమెను మీదకి లాక్కున్నాడు.

ఎప్పుడూ పేషెంట్లు, హాస్పిటల్, డబ్బు సంపాదన, రాత్రి అయ్యేసరికి డ్రింక్ అంటూ ఆలోచించే మోహన్ మనసులో ఇంత 'ప్రేమ' ఉన్నదా? అని మనసులోనే ఆశ్చర్యపోయింది గౌరి.

ఆమెని ముద్దు పెట్టుకుని మరుక్షణం వదిలేసి "అబ్బా! చేదు" అన్నాడు పెదవులు తుడుచుకుంటూ!

గౌరి నవ్వి వెనక్కి జరిగి అంది. "అవును! ఇన్నాళ్లూ మనం రుచిచూసింది ఈ 'చేదు'నే మోహన్! దీనిని ఈ తలంటుతోనే కడిగేయాలి. మన జీవితాలు ఎప్పుడూ స్వీట్‌గానే ఉండాలని నా ఆకాంక్ష!"

ఆమెని అర్థం చేసుకున్నట్లుగా నురుగు మధ్యనుండి కళ్లెత్తి చూసి నవ్వాడు మోహన్! పక్క బాత్‌రూమ్‌లో.

పీటమీద టవల్ కట్టుకుని కూర్చుని ఉన్నాడు వినీల్.

అతనికి ఒకవైపు చేతిలో కుంకుడు పులుసు ఉన్న గిన్నెతో వికిత నిలబడగా, మరోవైపు చీరపైకి దోపి, కొడుకుకి తల రుద్దుతోంది.

"ఒరేయ్ అన్నయ్యా! తాతగారి పుణ్యమా అని ఇప్పటికి దొరికిపోయావులే! అమ్మా! వదలకు! తరతరాలుగా వస్తున్న ఆ జిడ్డు, మురికి వదిలేంతవరకూ. నీళ్ళు పోయకు" అంటూ మరింత కుంకుడుపులుసు పోసింది వికిత.

"నీ పని ఇప్పుడు కాదు! బయటకురా చెబుతా" నోట్లోకి నురుగు రావడంతో ఆగిపోయాడు వినీల్!

"అబ్బా! ఉండవే!" అంటూ నవ్వుతూ కూతురుని మందలించి, కొడుకుకి ప్రేమగా వీపు రుద్దసాగింది.

ఎన్నాళ్ళయింది? కొడుకుని ఇలా కూర్చోపెట్టి, తన చేత్తో తలంటుపోసి?

మాతృప్రేమతో- మాటిమాటికి ఆమె హృదయం ఉద్విగ్నతకు లోనవుతోంది?

ఇరవయిఏళ్ల వినీల్ ఆ క్షణంలో ఆమె

ముందు పదేళ్ల పసివాడయిపోయాడు.

మొత్తంమీద-

సరదాలు, సరాగాలతో తలంటు స్నానాలు పూర్తిచేశారందరూ!

ఆడవాళ్లు వంట ప్రయత్నంలో పడ్డారు.

వేదమూర్తిగారు కావాలనే వంటమనిషిని పెట్టలేదు.

విశాలంగా ఉన్న ఆ వంట ఇంటిలో-

ఒకవైపు కూర్చుని జానకి, గౌరిమనోహరిలు కూరలు తరుగుతున్నారు.

గౌరికయితే- అరటికాయ చెక్కుతీయడం చేతకావడంలేదు.

ప్రమీల అంది "పేషెంట్ల పొట్టలయితే పరపరా కోసేస్తావే! ఈ అరటికాయలు లొంగట్లేదా గౌరీ!"

అందరూ నవ్వుతుంటే నిస్సహాయంగా చూసింది గౌరి!

"లేదు- పిన్నీ"

"నువ్వు లేచి వేరేపని చూడు" అంటూ ప్రమీల కత్తిపీట ముందు కూర్చుంది.

సులోచన పప్పు రుబ్బితే, సత్యవతి పచ్చళ్లు నూరింది.

కామేశ్వరి పొడిదంచింది.

మొత్తంమీద అందరూ కలిసి కబుర్లు చెప్పుకుంటూ ఛలోక్తులు విసురుకుంటూ పిండివంటలతో సహా పదకొండు గంటలకల్లా వంట పూర్తిచేశారు.

ఈలోపు-

వరండాలో చాపలు వేసుకుని, చరిత, అర్పిత పూలమాలలు కట్టారు.

చకిత, వికిత, పట్టులంగా, ఓణీ వేసుకుని అటూ ఇటూ తిరుగుతూ కబుర్లు చెప్పుకుంటున్నారు.

ఉసిరిక చెట్లకింద, సమారాధనకు కావల్సిన ఏర్పాట్లన్నీ రాగచంద్రిక, సాయికృష్ణలు చేశారు.

మధ్యమధ్యలో ఆకృతి కూడా అవీ ఇవీ అందుకుంది.

పొగడ చెట్టు గట్టుమీద, ఒకవైపు వేదమూర్తిగారు, భానుమూర్తి కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ ఉంటే కామేశ్వరి భర్త వారి పక్కనే కూర్చుని పుస్తకం చదువుకుంటున్నాడు.

మరోవైపు మోహన్, వినీల్ పేకాట ఆడుకుంటున్నారు.

ఒకవైపు సూర్యనారాయణ, కృష్ణమూర్తి కలిసి చదరంగం ఆడుకుంటున్నారు,

ఆ చెట్టునీడలో పడక్కుర్చీ వేసుకుని పడుకున్న దక్షిణామూర్తి పేపరు చదువుకుంటూ తన లోకంలో తను ఉన్నాడు.

మధ్యలో రెండుసార్లు చకిత, వికిత, కలిసి ట్రేలలో పెట్టుకుని, అందరికీ 'టీ'లు అందించారు.

ఆ పని ఇద్దరూ ఎంతో ఉత్సాహంగా చేశారు.

పొగడపూలు, సుగంధం వెదజల్లుతూ, ఆ గట్టుమీద నక్షత్రాల్లా రాలుతున్నాయి.

వేదమూర్తిగారు ఆశించిన దానికంటే వేగంగా అందరి మధ్యనా పరిచయాలు పెరిగి, స్నేహం ఏర్పడింది.

ఆ స్నేహమే బలమయిన అనుబంధంగా మారితే బాగుండునని గాఢంగా కోరుకున్నాడు ఆయన తృప్తిగా. అందరినీ పరకాయించి చూస్తూ.

మరో పావుగంటలో పురోహితుడు వచ్చారు.

దానితో-

అందరూ పనులూ, ఆటలు చాలించి లేచి వచ్చారు.

అప్పటికే వంట అయిపోయింది కాబట్టి,

ఆడవాళ్లు పట్టుచీరలు కట్టుకుని రెడీ అయిపోయారు.

పురోహితుడి సలహామీద, పూజకి కూర్చునేవారందరూ పంచెలు కట్టుకున్నారు.

ఆ సంగతి ముందే తెలుసు కాబట్టి, తెల్లటి పంచెలు అందరికీ ముందుగానే సిద్ధంచేసి ఉంచారు వేదమూర్తిగారు.

భానుమూర్తి, దక్షిణామూర్తి తేలికగానే పంచెలు కట్టుకున్నారు.

కృష్ణమూర్తి కొంచెం కష్టపడ్డా అందంగానే కట్టుకున్నాడు.

తర్వాత-

మోహన్ భానుమూర్తి సహాయంతో, సూర్యనారాయణ- దక్షిణామూర్తి సహాయంతో పంచెలు కట్టుకున్నారు.

ఆ విషయంలో కూడా వారి మధ్యన అనుకోకుండా ఆత్మీయతా భావాలు బయటపడ్డాయి. ఎప్పుడూ మోహమాటస్థుడు అనుకునే దక్షిణామూర్తి ఛలోక్తులు విసురుతూ, నవ్విస్తూ, సూర్యనారాయణకి స్వయంగా తనే కట్టి, గోచీ దోపాడు.

భానుమూర్తి అయితే మరీ! చక్కిలిగిలి పెడుతూ, నవ్విస్తూ పంచెకట్టాడు మోహన్‌కి. పట్టుచీరలు కట్టుకుని అలంకరించుకు వచ్చిన ఆడవాళ్లు-

పంచెకట్లతో, పెళ్ళికొడుకుల్లా ఉన్న తమ భర్తల్ని చూడగానే సంతోషం, సిగ్గు కలిగాయి.

మాటిమాటికి పంచె సర్దుకుంటూ, గోచీ దోపుకుంటూ, పెళ్ళికొడుకులా సిగ్గుపడుతున్న మోహన్‌ని చూసి పకపకా నవ్వింది గౌరి.

తలంటు పోసుకుని వదులుగా వేసుకున్న జడలో, నిండుగా కదంబమాలతో, పట్టుచీరలో, హాయిగా, స్వచ్ఛంగా, పకపకా నవ్వుతున్న భార్య ముఖంలో కొత్త అందాలు కన్పించాయి మోహన్‌కి.

మెడలో స్టెత్‌తో, గంభీర వదనంతో, సీరియస్‌గా ఉండే డాక్టర్ గౌరీమనోహరికి హాయిగా నవ్వుతూ, తుళ్లుతూ ఉన్న ఈ గౌరికి చాలా తేడా కన్పించింది అతనికి.

ఎప్పుడూ లుంగీలో తప్ప, పంచెకట్టులో తండ్రిని చూడని, చరిత, చకితలు నవ్వుముఖాలతో చూశారు.

కృష్ణమూర్తి అయితే పంచెకట్టులో ఎంతో హుందాగా, అందంగా ఉన్నాడు.

ఆరుగురు దంపతులూ చెట్టు చుట్టూ కూర్చుని సమారాధన మొదలెట్టారు. వేదమూర్తిగారి ఆదేశంతో, కామేశ్వరి, ఆమె భర్త కూడా వచ్చి కూర్చున్నారు. వారికి దూరంగా, పిల్లలందరూ చాపలు వేసుకుని కూర్చుని చూడసాగారు.

పురోహితుడు వేదమంత్రాలు వల్లిస్తుండగా-

అందరూ పూజ చేయసాగారు.

ఇక్కడ భక్తిభావంకంటే, తమ మధ్యనే ఉండే బలీయమైన బంధం గుర్తుకొస్తోంది గౌరికి.

భార్య చేతిని, తన చేతిలోకి తీసుకుని సూర్యనారాయణ ఆమె చేతికి తోరం కడుతూఉంటే, కొత్త పెళ్ళికూతురిలా పులకరించిపోయింది సులోచన!

మెకానికల్ లైఫ్‌లో, రొటీన్ జీవితంతో విసుగెత్తిపోయిన ఆ దంపతులకు ఇలా పక్కపక్కనే ఒకరిని ఆనుకుని ఒకరు కూర్చుని-

పవిత్రమయిన మనసులతో పూజ చేస్తుంటే-

ఏదో అందమయిన, అనిర్వచనీయమయిన అనుభూతి కల్గుతోంది.

ఎవరికివారే- కొత్త దంపతుల్లా ఫీలవుతున్నారు.

అసలు-

భార్యాభర్తలు, ఆదర్శ దంపతులు- అనే మాటలకు అర్థం తెలుసుకున్నట్లుగా, కళ్ళ ముందు ఏవో పొరలు విడిపోతున్నట్లుగా అన్పిస్తోంది.

అందరి హృదయాలలోనూ విచిత్రమయిన స్పందన!

ఎవరికివారే అనుకున్నారు. "ఇన్నాళ్లూ- ఈ స్పందన, అనుభూతి ఏమయిపోయాయా? "

దూరంగా కూర్చున్న పిల్లలకు కూడా తమ తల్లిదండ్రులు అలా పక్కపక్కనే కూర్చుని పూజ చేస్తుంటే కొత్తగా, ఎంతో ముచ్చటగా, తృప్తిగా అన్పిస్తోంది.

వినీల్ కూడా బుద్ధిగా కూర్చుని నవ్వు ముఖంతో చూడసాగాడు. అతని ఒడిలో ఆకృతి కూర్చుని ఉంది.

అతనివైపు చూసిన జానకి ఆశ్చర్యపోయింది. "ప్రేమలాంటి భావం- కరుడు కట్టిపోయిన తన కొడుకేనా ఆకృతిని ఒడిలో కూర్చో పెట్టుకుని, బుద్ధిగా తనవాళ్ళ మధ్యన కూర్చున్నది? ఇదే హైదరాబాదులో అయితే అసలు మనిషి కంటికి కనిపించేవాడేనా? భగవంతుడా! కార్తీక దామోదరా! నిండుమనసుతో నిన్ను కోరుకునేది ఒక్కటే! మా కుటుంబాల మధ్యన ఈ అనుబంధాలు శాశ్వతం చేయి!" దాదాపు ప్రతి ఒక్కరూ అదేవిధంగా కోరుకున్నారు.

పూజ దాదాపు గంటసేపు పట్టింది.

పూజ అయిపోయిన తర్వాత, వేదమూర్తిగారు అంత తేలికగా వదిలిపెట్టలేదు.

ఆయన ఆదేశానుసారం-

భార్యలు- భర్తల పాదాలకి-

పిల్లలు- తల్లిదండ్రుల పాదాలకి-

చిన్నవాళ్లు- పెద్దవారికి-

నమస్కరించగా-

పక్కనే పురోహితుడు వేదమంత్రాలు చదువుతుండగా-

వారు ఆశీర్వదిస్తూ, అక్షింతలు చల్లారు!

వేదమూర్తిగారు ఊహించిన దానికంటే ఎక్కువగా విజయవంతమయింది ఆ కార్యక్రమం.

కాళ్ళకి నమస్కరించి తలెత్తిన గౌరి తల మీద అక్షింతలు జల్లిన మోహన్, అప్రయత్నంగా ఆమెను గుండెలకు హత్తుకున్నాడు.

నిజంగా- అతను కావాలని అలా చేయలేదు. అతని హృదయంలో ఒక్కసారిగా పెల్లుబికిన ప్రేమ అతనిచేత అలా చేయించింది.

అందరూ చప్పట్లు కొట్టి కేరింతలు కొడితే, సిగ్గుపడి భార్యను వదిలేశాడు.

అక్షింతలు జల్లి, భార్య భుజాలు పట్టి పైకి లేపిన సూర్యనారాయణ కళ్ళల్లో, సులోచన అంతులేని తృప్తిని, అనిర్వచనీయమైన ఆనందాన్ని చూడగలిగింది.

పక్కపక్కనే కూర్చుని అశ్లీలపు సినిమాలు చూసిన కృష్ణమూర్తి.

తన పాదాలు తాకి తలెత్తిన వికితపై అక్షింతలు జల్లి, చప్పున అక్కున చేర్చుకున్నాడు.

ఆ దృశ్యం చూసి కదిలిపోయింది జానకి!

తన పాదాలు స్పృశించిన వినీల్ ని లేవనెత్తి తల నిమురుతుంటే, చాలా రోజులకి మనసారా పిలిచాడు వినీల్ "అమ్మా" అని.

అర్పితను లేవనెత్తి, ఆ అమ్మాయి కళ్ళల్లోకి చూసిన గౌరిమనోహరి కళ్లల్లో నీళ్లు తిరిగాయి. 'అమ్మా' అంటూ అల్లుకుపోయింది అర్పిత.

భర్తకంటే తను తక్కువ అనే భావం అతనిలో సైకలాజికల్ గా కల్పించడం ద్వారా అతని మనసు దోచుకోవడం- అనే పాయింట్ ని మనసులోనే అనుకున్నారు వేదమూర్తిగారు.

అందరి హృదయాలలోనూ ఏదో తెలియని భారం పట్టి పట్టి కుదుపుతోంది. తెలియని అనుభూతి పెల్లుబుకుతోంది.

చెట్లతో నిండివుండి చల్లగా ఉన్న ఆ పెరడు ముందరే శుభ్రం చేశారు కాబట్టి పూజా కార్యక్రమం అయిపోగానే-

అందరూ భోజనాల కార్యక్రమానికి ఉపక్రమించారు.

అర్పిత, చరిత, చీపుళ్ల తీసుకుని గబగబా చిమ్మారు.

చకిత, వికిత, చాపలు వేశారు.

సులోచన వరుసగా అరిటాకులు వేస్తుంటే, ఆకృతి నీళ్ల జల్లింది.

గౌరి గ్లాసులు పట్టుకుంటూ వెళ్తే, రాగచంద్రిక మంచినీళ్ల పోసింది.

ఆఖరున కాత్యాయని, కామేశ్వరి, ప్రమీల, సత్యవతి జానకి వడ్డనలు చేశారు.

ముందర బ్యాచ్‌లో మగవాళ్ల, పిల్లలు కూర్చున్నారు.

సత్యవతి, అందరినీ పేరుపేరునా అడుగుతూ, కొసరి కొసరి వడ్డించింది.

ఛలోక్తులతో, సరదా కబుర్లతో, పురోహితులవారి పద్యపఠనంతో, అందరూ తృప్తిగా భోజనాలు చేశారు.

అన్న-తమ్ముడు, తండ్రి, కొడుకు, బావ-బావమరిది, బాబాయి, కొడుకులు, మనవలు, మనవరాళ్ల, పిల్లలు, అందరూ, తనవారందరూ పక్కపక్కనే కూర్చుని భోజనం చేస్తుంటే ఆ దృశ్యం చూస్తూఉంటేనే కడుపు నిండిపోయింది వేదమూర్తిగారికి.

రాగచంద్రిక స్టీలు ట్రేలో తమలపాకులు, సున్నండబ్బా, వక్కపొడి పెట్టుకువచ్చింది.

కృష్ణమూర్తి- దక్షిణామూర్తికి తాంబూలం చుట్టి ఇవ్వడం-

సూర్యనారాయణ, కృష్ణమూర్తికి

భానుమూర్తి- వేదమూర్తిగారికి

వినీల్- సూర్యనారాయణకు-

సాయికృష్ణ- వినీల్‌కి

దక్షిణామూర్తి- కామేశ్వరి భర్తకి

రాగచంద్రిక- సాయికృష్ణకి-

తమలపాకుల- చిలకలు చుట్టి ఇచ్చారు!

ఆఖరున-

వేదమూర్తిగారు తాంబూలంలో దక్షిణ పెట్టి పురోహితుడికి ఇవ్వగా, ఆశీర్వదించి ఆయన వెళ్ళిపోయారు.

కబుర్లు చెప్పుకుంటూ, వంటరుచుల గురించి చర్చిస్తూ, ఆడవాళ్ళు గంటకుపైగానే భోజనాలు చేశారు.

తర్వాత-

అందరూ- రాత్రికివలెనే కొందరు గదుల్లో మిగతావారు హాలులో, పిల్లలు వరండాలో సర్దుకుని పడుకున్నారు.

అప్పటికే మూడు దాటుతోంది.

చూస్తుండగానే నాలుగయింది.

అందరూ లేచి ముఖాలు కడుక్కుంటుంటే సత్యవతి, కాత్యాయని కలిసి 'టీ' కలిపి ఇవ్వగా, వికిత, చకిత అందరికీ సర్వ్ చేశారు.

పెరట్లో పూసిన సన్నజాజులూ, కనకాంబరాలు, మాచిపత్రి చరిత కోసుకొస్తే, అర్పిత, మాలలు కట్టింది.

వినీల్ అడిగాడు "ఇంతకీ- రాత్రికి కాలక్షేపం ఏమిటి? సినిమానా? "

వికిత అరిచింది "కాదు, వి.సి.పి. తెచ్చుకుందాం"

వేదమూర్తిగారు అన్నారు, "ఓసి నీ- సినిమాలపిచ్చి బంగారం కానూ; రోజూ చూసే సినిమాలే! ప్రతి క్షణం వీక్షించే టి.వి.నే! ఇప్పటికే వాటి కోరల్లో చిక్కుకుని మన విలువయిన కాలాన్ని పణంగా పెడు

తున్నాం. ఇలాంటి తరుణంలో అసలే వద్దు. రాత్రికి కాలక్షేపం ఏమిటో నేను ముందరగానే ఆలోచించాను. అందరం కలుసుకున్న ఈ శుభతరుణాన, అందరూ మంచి మాటలు చెప్పుకోవడం, మనసులు పంచుకోవడం, ఇలాటివన్నీ జరగాలి. రాత్రి ఏడు గంటలకల్లా మన సమావేశం పొగడ చెట్టు దగ్గర వేదిక"

వెంటనే ఆడవాళ్ళందరూ గబగబా వంట పనిలో పడ్డారు.

మిగతావాళ్లు ఒకరి తర్వాత ఒకరు స్నానాలు చేయడం మొదలెట్టారు.

స్నానాలు అయిన తర్వాత-

చకిత- అర్పితచేత

చరిత- గౌరి మనోహరిచేత-

అర్పిత- జానకిచేత

వికిత-చరితచేత

రాగచంద్రిక- సులోచనచేత

వరసగా కూర్చుని జడలు వేయించుకున్నారు.

అందరూ రెడీ అయ్యేసరికి వంట కూడా అయిపోయింది.

ఏడింటికల్లా- అందరూ పొగడ చెట్టు కిందకి చేరారు.

ఎత్తుగా వేదికలా ఉన్న పొగడ చెట్టు గట్టుకి ఇవతలగా వరుసగా చాపలు, దుప్పట్లు పరిచి అందరూ వరుసగా కూర్చున్నారు.

సాయికృష్ణ అంతక్రితమే వైరులాగి ట్యూబ్‌లైట్ ఎరేంజ్ చేశాడు. నిజంగా స్టేజీ లాగానే ఉంది. "అన్నయ్య చాలానే ఆర్భాటం చేశాడే" అనుకున్నది సత్యవతి.

ముందరగానే వేసుకున్న ప్లాన్ కాబట్టి సాయికృష్ణ ముందరగానే కావలసిన కాసెట్స్ రెడీచేసి ఉంచాడు.

తర్వాత ఒక పక్కగా టేప్ రికార్డర్ పెట్టాడు.

వేదమూర్తిగారు అన్నారు "మన కుటుంబ సభ్యులందరూ చాలా రోజుల తర్వాత కలుసుకున్న శుభతరుణంలో ఏర్పాటు చేసుకున్న ఈ సమావేశంలో మొట్టమొదటి అయిటమ్ మన రాగచంద్రిక కూచిపూడి నృత్యం"

ఆ మధ్యాహ్నమే వేదమూర్తిగారు చెప్పి ఉండటంచేత రాగచంద్రిక సాధ్యమయినంత వరకూ ఆ స్టైయిల్‌లో అలంకరించుకుంది.

ఆకుపచ్చ పట్టుచీర, జరీ అంచు ఆకుపచ్చ జాకెట్టు, జడగంటలు పెట్టి అల్లుకున్న పొడవాటి జడలో నిండుగా పెట్టుకున్న కదంబ మాల, కళ్లనిండుగా కాటుకతో కొసదేలిన కళ్ళు, కనుబొమల మధ్యన ఎర్రటి బొట్టు, ముక్కుకి తళతళలాడే ఎర్ర రాయి ముక్కుపుడక, మెడలో గుండెల వరకూ వేలాడుతున్న గొలుసు, అప్పటికప్పుడు గౌరీ మనోహరి ఇచ్చిన ముత్యాలు, రత్నాలు పొదిగిన నెక్లెసు, నడుముచుట్టూ ముత్యాల వడ్డాణం, చేతులనిండుగా ఎరుపు ఆకుపచ్చ గాజులు, కాళ్లకి గజ్జెలు, ఘల్లుఘల్లుమంటూ నడిచి వేదిక ఎక్కుతుంటే అందరూ క్షణంసేపు రెప్పవేయడం మర్చిపోయారు.

భువినుండి దిగివచ్చిన దేవతలా, చెక్కిన శిల్పంలా మనోహరంగా ఉంది రాగచంద్రిక. సాయికృష్ణ కేసెట్ పెట్టి టేప్ రికార్డర్ ఆన్ చేశాడు. ముందర విఘ్నేశ్వర స్తుతితో ప్రారంభమయింది ఆ కేసెట్. శృతికి అనుగుణంగా లయబద్ధంగా అడుగులు వేస్తూ చక్కగా నర్తిస్తున్న రాగచంద్రికని చూసి బుగ్గలు నొక్కుకుంది సత్యవతి.

గొంతు తగ్గించి చెప్పింది ప్రమీల "మరే! అక్కడెవరో అమెరికా అమ్మాయి ఇండియా వచ్చి నేర్చుకుని వెళ్లి అక్కడ డాన్సు స్కూలు పెడితే మన ఇండియా నుండి వెళ్లిన మన రాగచంద్రిక ఆ అమెరికా అమ్మాయి దగ్గర

నేర్చుకున్నదట. మరి విడ్డూరం కాకమరే మిటి? ”

తర్వాత బాలగోపాల తరంగం... దశావ తారాలు... మహిషాసుర మర్ధిని నృత్యాలు వరుసగా నర్తించింది.

ఎంతో అందంగా చక్కటి అభినయంతో నర్తించిన ఆ అమ్మాయి ప్రోగ్రామ్‌ని ప్రతి ఒక్కరూ మనస్ఫూర్తిగా మెచ్చుకున్నారు.

తర్వాత సాయికృష్ణ వచ్చి ఎనౌన్స్ చేశాడు “తరువాతి అయిటమ్ మన వినీల్ బ్రేక్

డాన్స్”

చాపమీద కూర్చున్న వినీల్ ఉలిక్కిప డ్డాడు.

అపుడేదో సరదాగా చెప్పాడనుకున్నాడు కాని నిజంగా ఇపుడు ఇలా తన చేత డాన్స్ చేయిస్తాడనుకోలేదు.

కంగారుగా ఏదో చెప్పబోతుంటే పక్కనే కూర్చుని ఉన్న సూర్యనారాయణ వినీల్ చేయిపట్టి లేపితే, మోహన్ అతనిని వేదిక వైపు తోశాడు.

భయం భయంగా వేదిక ఎక్కాడు... నీలంరంగు జీన్స్‌లోకి, గోధుమరంగు షర్ట్ టక్‌చేసి, పైకి దువ్విన జుట్టు గాలికి ఎగు రుతుంటే. క్షణంసేపు కొత్తకొత్తగా అందరి వైపూ చూశాడు వినీల్. తల్లితండ్రి, తాతయ్య, వికిత, చకిత అందరూ ప్రోత్సహి స్తున్నట్లుగా, డాన్స్ చేయమన్నట్లుగా నవ్వు ముఖాలతో సైగలు చేస్తూ చేతులూపుతు న్నారు. సాయికృష్ణ కేసెట్ పెట్టి ఆన్ చేశాడు.

నెమ్మదిగా డ్రమ్స్ బీటింగ్‌తో మొదల యింది మ్యూజిక్. ఆటోమేటిక్‌గా వినీల్ శరీరం మ్యూజిక్‌కి అనుగుణంగా స్టెప్స్ వేయడానికి సిద్ధం అవసాగింది.

మ్యూజిక్ మొదలయిన రెండు క్షణాలకి వినీల్ ఆ మ్యూజిక్‌లో లీనమవుతూ స్టెప్స్ వేయసాగాడు. నెమ్మదిగా వేగం పెంచుతూ రకరకాల విరుపులతో డాన్స్ చేస్తున్నాడు. చూస్తుండగానే స్పీడ్‌గా మెరుపులా, పాములా మెలికలు తిరిగిపోతూ మెడని, చేతులని ఒకే పొజిషన్‌లో వంచి, కాళ్లని ఆపోజిట్ పొజిషన్‌లో తిప్పుతూ రకరకాల ఫీట్స్ చేస్తున్నాడు.

జానకి, కృష్ణమూర్తి తమ కళ్లని తామే నమ్మలేకపోతున్నారు. ఉదయం వెళ్లి, ఏ అర్ధరాత్రో వచ్చి తలుపు బంధించుకుని ఎపుడూ గదిలోనే ఒంటరిగా కాలక్షేపం చేసే వినీలేనా ఇలా గాలికంటే వేగంగా శరీ రాన్ని కదిలిస్తూ డాన్స్ చేస్తోంది?

డాన్స్ చేస్తాడని తెలుసు. కాని అంత బాగా చేస్తాడని ఊహించలేదు సాయికృష్ణ. దాదాపు ఇరవయి నిముషాలసేపు సాగింది అతని డాన్స్

డాన్స్ అయిపోగానే అందరూ హర్షధ్వా నాల మధ్యన అతనిని అభినందనలతో ముంచెత్తారు.

కృష్ణమూర్తి మొట్టమొదటిసారిగా కొడు కుని తల్చుకొని గర్వంగా ఫీలయ్యాడు.

తర్వాత... అర్పిత దేవులపల్లి వారి భావ గీతం, సాయికృష్ణ జానపదగీతం, ఆకృతి మా తెలుగుతల్లికి మల్లెపూదండ పాడగా ఆఖరున చరిత, వికిత కలిసి ‘ఛోలీకే పీఛే క్యాహై’ పాడారు.

పాట ఎలాంటిదయినా వాళ్లలో అంతటి ఆర్ట్ ఉన్నందుకు వేదమూర్తిగారు మెచ్చుకు న్నారు.

ఆఖరున... క్విజ్ ప్రోగ్రామ్... రాగచం ద్రిక, చకిత, వినీల్ ఒక గ్రూప్

అర్పిత, చరిత, వికిత మరో గ్రూప్

ఆ గట్టుమీదనే అటు ముగ్గురు, ఇటు ముగ్గురు కూర్చోగా మధ్యలో సాయికృష్ణ కూర్చుని క్విజ్ ప్రోగ్రామ్ కండెక్ట్ చేస్తే పక్కనే కాగితం పెన్ను పట్టుకుని మార్కులు

వేయడానికి గౌరీమనోహరి కూర్చుంది. వాచి చూస్తూ బెల్లుకొట్టే బాధ్యత సులోచ నది.

సాయికృష్ణ ముందరగా మాట్లాడాడు "నిజానికి ఈ క్విజ్ ప్రోగ్రామ్‌లోని ప్రశ్నలు తయారుచేసింది వేదమూర్తి మామయ్య గారు. మన గ్రూపుల్లోని వికిత, చరితలు చాలా క్విజ్ ప్రోగ్రామ్స్‌లో పార్టిసిపేట్ చేశా రని, అంతే కాదు చాలాసార్లు బహుమ తులు కూడా పొందారని మనంతరికీ తెలుసు.

అంతేకాదు అవన్నీ జనరల్ నాలెడ్జ్, సబ్జెక్ట్ బేస్‌డ్‌గా సాగిన ప్రోగ్రామ్స్. కాని మన ఈ క్విజ్ మాత్రం అందుకు దూరం. పూర్తి వెరయిటీ... ఒక్కో ప్రశ్నకి ఒక్కో గ్రూప్ తీసుకోవలసిన సమయం కేవలం అర నిముషం"

రెండు గ్రూపులూ సిద్ధం అయాయి. సాయికృష్ణ చేతిలోని పేపర్‌తీసి మొదటి ప్రశ్న చదివాడు.

"ఏ గ్రూప్‌కి- అత్తకి మేనత్తకి గల తేడా ఏమిటి? "

అలాంటి ప్రశ్న ఊహించని ఏ గ్రూపు మొదట తడబడ్డా తర్వాత సర్దుకుని రాగచం ద్రిక చెప్పింది.

"రెండో గ్రూపుకి... మేనత్తకి వేలు విడి చిన మేనత్తకి గల తేడా ఏమిటి? "

పెద్దవాళ్లు నవ్వుతూ చూస్తున్నా చిన్న వాళ్లు ఆలోచనల్లో పడ్డారు.

బి గ్రూప్ కూడా ఆలోచించినా చెప్పలేక పోయింది.

సులోచన ఠంగ్‌మని బెల్లు మ్రోగించింది.

ఆ ప్రశ్నే మొదటి గ్రూపుకి వేయబడింది. రాగచంద్రిక కూడా సరిగ్గా చెప్పలేకపో యింది.

సాయికృష్ణ చెప్పాడు... "ప్రశ్నలు అన్నీ రాసే ఉన్నాయి కాబట్టి వీటికి ఆన్సర్లు వెంటనే చెప్పటముకాక ఈ ప్రోగ్రాము అయిన తర్వాత వేదమూర్తి మామయ్య ఎవరికి ఎవరు అని వివరంగా చెబుతారు" తర్వాతి ప్రశ్నలు ఇలాసాగాయి...

రామాయణం, భారతం, భాగవతాలలోని చాప్టర్స్ పేర్లు, రామాయణంలో కాండలు, భారతంలో పర్వాలు అని చెప్పి భాగవ తంలో చెప్పలేకపోయింది వికిత.

ఘటోత్గజుని తల్లిపేరు, మాయాబజార్‌లో కర్ణుడి పాత్రధారి పేరు, మల్లీశ్వరి చిత్రం ఫొటోగ్రాఫర్ పేరు, పై మూడింటికి రాగ చంద్రిక ఆన్సర్ చేసింది.

ఆఖరున సాయికృష్ణ వేసిన ప్రశ్నలే అందరినీ కన్‌ఫ్యూజన్‌లో ముంచెత్తాయి.

అవి... ఆకృతికి భానుమూర్తి ఏమవు తారు?

చకితకి సాయికృష్ణ ఏమవుతాడు.

అర్పితకు రాగచంద్రిక తండ్రి చంద్రశేఖర్ ఏమవుతాడు?

ప్రమీలకు సులోచన ఏమవుతుంది?

మోహన్ వినీల్ మధ్యనగల కనెక్షన్ ఏమిటి?

కాత్యాయనికి రాగచంద్రిక ఏమవు తుంది?

దక్షిణామూర్తికి రాగచంద్రికకి మధ్య సంబంధం?

ఈ కన్‌ఫ్యూజన్‌లో ఆఖరుకి ఆకృతికి, గౌరీమనోహరి ఏమవుతుంది? అని అడి గితే అందరూ తెల్లమొహాలు వేశారు.

వీటిల్లో కొన్ని రాగచంద్రిక ఆన్సర్ చేసింది. చాలావరకూ కన్‌ఫ్యూజ్ అయ్యారే తప్ప కరెక్టుగా చెప్పలేకపోయారు.

మొత్తంమీద ఆ క్విజ్ ప్రోగ్రామ్ అయ్యేస రికి అరగంట పట్టింది. అపుడు వేదమూర్తి గారు ముందే సిద్ధం చేసుకుని ఉంచిన

చార్టుని తనచేతిలో అందరికీ కనబడేలా విప్పదీసి పట్టుకుని వివరించసాగారు.

అందులో క్లియర్‌గా... పైన వేదమూర్తి, భానుమూర్తి, సత్యవతిల కుటుంబాలు

ఆతర్వాత కొడుకులు, కోడళ్లు, కింద మనవలు, మనవరాళ్ళు, పేర్లు వంశవృక్షంలా రాసి ఉన్నాయి.

దాని ఆధారంగా... ప్రతి వ్యక్తికి రెండో వ్యక్తితోగల సంబంధం వారి మధ్యన ఉన్న వరుస క్లియర్‌గా అర్థమయ్యేలా వివరించారు.

దాదాపు ఆ కార్యక్రమమే అరగంటపైగా పట్టింది.

ఈ లోపు చకిత, వికితలు అందరికీ టీలు సర్వ్ చేశారు. వేదమూర్తిగారు టీ వద్దని మంచి నీళ్లు తాగారు.

అందరూ కిందికి దిగి చాపలమీద కూర్చుంటే వేదికమీద ఆయన ఒక్కరే మిగిలారు.

క్షణంసేపు అందరు నిశ్శబ్దంగా ఉండిపోయారు.

వేదికమీద కూర్చున్న వేదమూర్తిగారు క్షణంసేపు తన ఎదురుగా చాపల మీద కూర్చుని తనవైపే చూస్తున్న ప్రేక్షకులని వీక్షించారు.

తన ఎదురుగా తన భార్య, పిల్లలు. వారి పిల్లలు, తమ్ముడు, చెల్లెలు వారివారి పిల్లలు...

తను ఆశించిన అపూర్వమయిన సమావేశం అది.

తను కలలుగన్న అద్భుతమయిన సభ అది.

క్షణంసేపు ఆయన గుండె సముద్రంలా ఉప్పొంగింది.

తన నోటినుండి రాబోయే మాటలకోసం, చెవులు రిక్కించి ఉత్కంఠతో ఎదురు చూస్తున్నారు ప్రేక్షకులు.

అపుడు... అదొక కుటుంబ సమావేశంలా లేదు... చెట్టు కింద జరుగుతున్న క్లాసులా ఉంది.

వేదికమీద కూర్చున్న వేదమూర్తిగారు చేతిలో బెత్తం పట్టుకుని పాఠం చెబుతున్న మాష్టారులా ఉన్నారు.

కింద కూర్చున్న సభ్యులు, బుద్ధిగా చేతులు కట్టుకుని, ఆయన చెప్పబోయే నీతి పాఠాలను వినడానికి సిద్ధంగా ఉన్న విద్యార్థుల్లా ఉన్నారు.

వేదమూర్తిగారు ఒకసారి అందరివైపు . సి గొంతు సవరించుకున్నారు.

ి సభా ప్రతి సమావేశం ఒక నినాదంతో ప్రారంభమయి, ఒక సందేశంతో ముగుస్తుంది. నేను ఈ సభని ప్రారంభిస్తూ ఇచ్చే నినాదం... 'కుటుంబ సభ్యులారా! ఏకం కండి! రక్త సంబంధీకులారా! కలిసిరండి!!' ఇది నా ఒక్కడి ఆవేదన కాదు. నా ఒక్కడి ఆక్రోశంకాదు. ప్రతి కుటుంబంలోనూ ప్రతి కుటుంబ కర్తలోనూ జరుగుతున్న అంతర్మథనం! పైకి చెప్పుకోడానికి ఇష్టపడని, చెప్పుకోలేని అంతర్యుద్ధం.

నిన్నటివరకూ మీలో ఎవరు ఎవరో తెలియదు. అయిదు నిముషాలక్రితం వరకూ మీలో ఎవరికి ఎవరు ఏమవుతారో తెలియదు. కానీ అందరం ఒకే కుటుంబం నుండి వచ్చినవాళ్లం. అందరిలోనూ ప్రవహిస్తున్న రక్తం ఒకటే.

ఈ పరిస్థితి ఎందుకు వచ్చింది? ఏవిధంగా రూపుదాల్చింది? సమాధానం ఒకటే!

మనమే! మన నిర్లక్ష్యమే, మన అశ్రద్ధే, మన అజ్ఞానమే ఈ పరిస్థితిని ఇంత దూరం తీసుకువచ్చాయి.

పిల్లలు కలిసికట్టుగా ఉండాలంటే ముందర తలిదండ్రుల్లో ఆ కలిసికట్టుతనం

ఉండాలి. తల్లితండ్రులనుండే పిల్లలు క్రమంగా వారుచేసే అలవాట్లతోనే వారు రూపుదిద్దుకుంటారు.

భార్యభర్త మధ్యనుండే పరస్పర అవగాహనే పిల్లల మధ్యన ఆరోగ్యకరమయిన అనుబంధానికి దారితీస్తుంది.

అపుడే ఆ కుటుంబం మధ్యన చక్కటి బంధం ఏర్పడి మిగతా తనవారితో సరియైన రిలేషన్‌షిప్ .మెయిన్‌టయిన్ చేయగలుగుతారు.

తన కుటుంబంలోనే నలుగురువి నాలుగు దారులయితే అందరూ ఒకే మాట మీద కలిసి రావడం సమస్యగా మిగిలిపోతే ఇక మిగతావారితో సత్సంబంధాలు ఏవిధంగా కొనసాగించగలరు?

ఇవన్నీ చెప్పబోయేముందు నాదొక చిన్న మాట.

ఇపుడు నేను చెబుతున్న విషయాలు మీలో ఏ వ్యక్తినీ ఉద్దేశించి వేలుపెట్టి చెపుతున్నవి కాదు.

జనరలైజ్ చేసి ప్రస్తుత సమాజంలోని మన కుటుంబ వ్యవస్థ తీరుతెన్నులు చెబుతున్నాను.

ఆ రోజుల్లో ప్రతి ఒక్కరూ ఉద్యోగరీత్యా దూరంగా ఉండకతప్పదు. అలాగని తన కుటుంబ సభ్యులకు దూరమయి పోవాలని కాదుగా!

తమ మధ్యనగల బంధాన్ని ఉత్తరాల ద్వారానో, ఫోన్లద్వారానో, అపుడపుడు ఇంటికి వచ్చి వెళుతూ ఉండటంద్వారాను కొనసాగించవచ్చు

అపుడేకద కన్నవారికి కొండంత తృప్తి.

చాలారోజుల తర్వాత ఇంట్లో అడుగుపెట్టిన కొడుకుని తల్లి చూడగానే హృదయంలో ప్రేమ ఉప్పొంగాలి.

తండ్రిని చూడగానే మనసులో మమకారం పెల్లుబుకాలి. చెల్లెలిని చూడగానే అనురాగంతో కళ్లు చెమర్చాలి. తమ్ముడిని చూడగానే ఆప్యాయతతో ఆనందం తన్నుకు రావాలి. అన్నయ్యను చూడగానే ఉత్సాహం, సంతోషం పొరలిపొరలి రావాలి.

మరి.. ఇవన్నీ వస్తున్నాయా? లేదు!

ఈ కమర్షియల్ సమాజంలో, డబ్బు ప్రపంచంలో బతుకు ఈడుస్తున్న మన మనసుల్లో ఆ భావాలు ఇంకిపోయాయి.

ఆ ప్రేమానురాగాలు ఆవిరైపోయాయి.

అనురాగం, మమతల్లాంటి ఫీలింగ్స్ మాడిమసి అయిపోయాయి.

రాక తప్పదు కాబట్టి ఏ సంవత్సరానికో మొక్కుబడిగా బలవంతంగా వస్తాము.. కృతకంగా తల్లితండ్రులని పలకరిస్తాము.. అసహజంగా అన్నా చెల్లెళ్లతో నవ్వుతాము.

దృష్టి అంతా తండ్రి పంచబోయే ఆస్తి మీద, ధ్యాస అంతా తనకు రాబోయే వాటా మీద. ఇక మనుషులలో ఈ భావాలు ఏం వెల్లివిరుస్తాయి? డబ్బు లేకుండా బతకలేమనుకోవడం భ్రమ. జీవితానికి ప్రేమానుబంధాలే శాశ్వతం. ఎక్కడున్నా మనకు అండగా నిలిచి ఆదుకునేవి అవే!

చూడండి... మన విషయానికివస్తే, ఎన్ని రోజులు దూరం దూరంగా గడిపాము? అడ్రెసులు తెలిసి కొందరితో; అడ్రెస్‌లు తెలియక కొందరితో మూర్ఖత్వంగా దూరంగా గడిపాము. దీనివలన మనం సాధించినది ఏమిటి? మనసుమీద చెయ్యి వేసుకుని చెప్పండి! ఎప్పటికపుడు బిజీ... తీరికలేదు... కుదరదు ల్లాంటి ఆత్మవంచనలతో మనల్ని మనమే విడగొట్టుకుని మన చెట్టుకొమ్మల్ని మనమే నరికేసుకుని ఏం సాధించాము?

ఒంటరితనం, మానసిక క్షోభ, తోడు లేకపోవడం, అవసర సమయాలలో అండ లేకపోవడం, ఆపత్సమయాలలో ఓదార్పు

# సచిత్ర విచిత్రం





## ఆవిడే ఇతడు!

అమెరికాలోని శాన్‌ఫ్రాన్సిస్కో పోలీస్‌శాఖలో దశాబ్దం పైగా పనిచేస్తున్న మిస్ 'స్టెఫనీ' అనే ఈవిడగారు సెక్స్‌మార్పిడి ఆపరేషన్ చేయించుకుని మిస్టర్ 'స్టెఫాన్'గా మారిపోయింది. మన రూపాయల్లో 2 లక్షల 25 వేలు ఖర్చయినాగానీ, ఈవిధంగా "మగాణ్ణిగా పుట్టి ఉంటే ఎంత బాగుండేదోగదా" అని లక్షలసార్లు అనుకున్న ఈవిడగారి కోరిక శుభ్రంగా తీరిపోయింది. ప్రస్తుతం ఈమె ఆ పోలీస్ శాఖలోనే మగపోలీసన్నమాట.

కోల్పోవడం, అందరూ ఉండి అనాథలా మిగిలిపోవడం, ఆరోగ్యకరమైన వాతావరణానికి దూరమయి అశ్లీల వాతావరణానికి దగ్గరవడం, ఇంతకంటే ఏం సాధించలేదు. మహా అయితే డబ్బు, కీర్తి సంపాదించి ఉండవచ్చు.

సాయికృష్ణ చిన్నవాడయినా ఒక సందర్భంలో అన్నాడు ఏమని? మనుష్యుల మధ్యన, కుటుంబాల మధ్యన దూరం పెరగడానికి కారణాలు, 'మన'ని మర్చిపోయి 'నా' అనుకోవడమేకాదు, ఆర్థిక పరిస్థితులు, ఆస్తి తగాదాలే కాదు, స్వార్థం, ఈర్ష్య, అసూయలు కూడా.

అన్నకొడుకుకి ఉద్యోగం వచ్చి తమ్ముడి కొడుకుకి రాకపోతే తమ్ముడు భరించలేక అకారణంగా అన్నయ్యకు దూరమయి పోతాడు.

తమ్ముడి కూతురికి పెళ్లి అయి తన కూతురికి కాకపోతే సహించలేక, అనవసరంగా అన్న తమ్ముడికి దూరమయిపోతాడు.

ఇలా లేనిపోని కారణాలు సృష్టించుకుని విడిపోయేవారు కొందరు. నిజానికి మనమధ్యన అలాంటి బాధలు ఎవరికీలేవు!

డబ్బుకోసం వెంపర్లాడవలసిన పరిస్థితి ఎవరికీ లేదు. మనందరం సమాజంలో మంచి హోదా, స్థితిగతులు కల్గినవాళ్లమే.

అయినా ఈ గేప్ మన మధ్యన ఎలా వచ్చిందీ ఖచ్చితంగా చెప్పలేకపోతున్నాను.

బహుశా... ఎవరి వ్యక్తిగత సమస్యలతో వారు సతమతమవుతూ ఆ గొడవల్లో పడిపోయి ఉండవచ్చు.

ఊహించని ఎదురుదెబ్బలు అనుకోని సంఘటనలతో దూరంగా ఉండిపోయి ఉండవచ్చు.

కానీ నేను చెప్పేది ఒకటే! దయచేసి కష్టసుఖాలని కలిసి పంచుకుందాము. ఒకరి దుఃఖాన్ని అందరం భరిద్దాము. బాధ్యతలను సమానంగా పంచుకుందాము. ఇందులో డబ్బు ప్రమేయంలేదు. కేవలం ఆత్మీయతాభావం! అనుబంధం అంతే. నీ కష్టాన్ని నీ వాళ్లు కాక పరాయివాళ్లు ఎందుకు పంచుకుంటారు? అసలే పెదవులతో నవ్వుతూ నొసటితో వెక్కిరించే మనుషులున్న సమాజం మనది. మన కష్టాన్ని పరాయివారికి చెప్పి వారి నుండి ఓదార్పు కోరడం సులభమే! ఏదో నాలుగు మాటలు చెప్పి ఉచిత సలహా ఇచ్చి తప్పుకుంటారు.

తాత్కాలికంగా మన బాధ ఉపశమించినా శాశ్వతంగా వాళ్ల దృష్టిలో తేలికయిపోతాము.

అది గ్రహిస్తేచాలు మన కష్టాలు, మనపరువు గడపదాటి వెళ్లవు.

"ఇంటి గుట్టు- రోగంరొష్టు" అని మన కష్టాల్ని మనందరం కలిసి మనమే అనుభవించాలి. సుఖాన్ని కూడా అందరం కలిసి ఎంజాయ్ చేయాలి. కానీ ఆ పంచడం పంచుకోవడంలోనే ఉన్నది విజ్ఞత! ఐక్యత

ఆ ఐక్యతకోరి స్థంభించిపోయిన మన కుటుంబాల మధ్యన రాకపోకలు పునరుజ్జీవింప చేయగోరి నేను చేసిన ఈ ప్రయత్నంలో గమనించింది ఒకటే!

అందరిలోనూ మంచితనమున్నది, అందరిలోనూ ప్రేమ, అనురాగాలు ఉన్నాయి.

కాని-

కానీ ఎవరూ వాటిని ఎదుటివారి దగ్గర ప్రదర్శించటంలేదు!

ఎవరికి వారు మనసులోనే పెట్టుకుని ఉండిపోయారు!

రెండు చేతులు కలిస్తేనే చప్పట్లు-

రెండు హృదయాలు కలిస్తేనే ప్రేమ-

పది మందీ కలిస్తేనే సమావేశం,

మరి చూడండి ఇన్నాళ్ళు ఎవరికి వారే

వీళ్ళకు ప్రేమలులేవు! అభిమానాలు లేవు అనుకున్నాం! అపోహపడ్డాం!

కాని అందరం కలిశాం!

మనమధ్యన ఉన్న అనుబంధం ఏమిటో అందమయిన ఆత్మీయతా భావాలేవిటో ఎంత చక్కగా బయటపడినాయో చూడండి!

అందరం కలవకపోవడంవలన ఏర్పడిన అపోహ ఇది!

ఇక,

ప్రతి రోజూ ఈ కలయిక అనేది అసాధ్యం!

రెండురోజులు పోతే ఎవరి పనులు వారివి, ఎవరి బాధ్యతలు వారివి!

కాని ఎవరి కుటుంబం వారికి శాశ్వతం కదా!

నాలుగు కుటుంబాలు కలిసి అనుబంధం పెంచుకునే ముందు, ఎవరి కుటుంబం వారు పటిష్టపరుచుకోవాలి!

ఆ కట్టుబాటుతనం అనేది ముందు వారి కుటుంబంలో సాధించాలి!

ఎలా? "

వేదమూర్తిగారు కాసేపు ఆగారు!

కాత్యాయని సైగతో చకిత లేచి మంచి నీళ్ళు ఇచ్చింది ఆయనకు!

ఆయన గ్లాసెడు నీళ్ళు గటగట తాగి మళ్ళీ కొనసాగించారు.

"ఎలాగంటే

జీవితంలో మన మధ్యన జరిగే దినవారీ చర్యలలో అతి ముఖ్యమయిన భాగాన్నే మనం నిర్లక్ష్యం చేస్తున్నాం!

మనం జీవించాలి అంటే అందుకవసర మయిన శక్తి కావాలి!

మనకి ఆ శక్తినిచ్చేది ఆహారం అంటే భోజనం!

ప్రతి వ్యక్తీ ఏదయినా మానగలడుకాని ఆహారానికి దూరం కాలేడు!

అంటే మన చర్యలలో అతిముఖ్యమయిన భోజన కార్యక్రమం గురించి కాసేపు వివరిం చదలుచుకున్నాను.

ఇంట్లో కుటుంబసభ్యులందరూ కలవగ లిగే అవకాశం ఒక్క భోజనాలదగ్గరే!

ఉదయం పూట ఎలాగూ కుదరదు! కాలే జీలు, స్కూల్స్, ఆఫీసు హడావిడిలో ఎలాగూ కుదరదు!

కనీసం రాత్రిపూట అయినా అందరూ కలిసి కూర్చుని భోజనం చేయడం అల వాటు చేసుకోవాలి!

చెప్పడానికి, వినడానికి 'చిన్నవిషయం'గా అన్పించినా కలిసి కూర్చుని తినడంలోని 'శక్తి' అనుభవించేవారికే తెలుస్తుంది!

ఎందుకంటే కబుర్లు, సరదాలు, ముఖ్యంగా అన్నం ఆత్మీయత రెండూ 'పంచుకోవడం' అనేది అక్కడే జరుగు తుంది!

కుటుంబసభ్యులందరూ కలిసి కూర్చుని భుజిస్తే వచ్చే తృప్తి హోటల్‌లో ఫ్రెండ్స్‌తో కలిసి చేసుకునే పార్టీలలో ఎలా వస్తుంది? ఇది 'అనురాగం' అది 'అవసరం'!

పిల్లలు తల్లితండ్రులతోనే కలిసి కూర్చోవా లనే అలవాటు 'క్రమశిక్షణ'లా చిన్నప్పటి నుండీ అలవాటు చేయాలి!

అలా అలవాటు చేయాలంటే ముందర ఆ తల్లితండ్రులు కలిసి భోజనం చేయాలి! అపుడే ప్రేమ అనురాగం పంచుకోబడేవి!

ముందర మగవాడయిన భర్తకి వడ్డించి 'తర్వాత ఒంటరిగా తను' అనే ఛాదస్తపు సాంప్రదాయానికి స్వస్తిచెప్పాలి!

బయటకు వెళ్ళిన భర్తకి రాత్రివేళకి తన కోసం తన భార్య ఎదురుచూస్తూ ఉంటుం దనే ఆలోచన త్వరగా ఇంటికి వచ్చేలా చేస్తుంది!

అలాగే షికార్లు కొట్టి ఏ అర్థరాత్రో వద్దా

మనుకునే కొడుకుకి ఇంటి దగ్గర "తను వెళితే కాని తన వాళ్ళు భోజనం చేయరు! వెయిట్ చేస్తుంటారు" అనే భావం బాధ్య తను గుర్తుచేసి సమయానికి ఇంటికి రప్పి స్తుంది!

అందరూ కలిసి కూర్చొని, కలిసి వడ్డించు కుని తింటే ముఖ్యంగా ఆహార విషయంలో 'వేస్టేజ్' అనేది ఉండదు!

ఏరోజు ఎవరు తింటారో, ఎవరు బయటే తినివస్తారో, ఎవరు అసలు తినరో తెలియక మిగిలిపోయిన పదార్థాలు 'పనిమనిషి'పాలు చేసే బాధ ఇల్లాలికి తప్పుతుంది.

అనుకుంటాంగాని రోజు కబుర్లు, కాలక్షే పాలు ఎక్కడనుండి వస్తాయని? ఎందుకు రావూ?

అవి మనం సృష్టించుకోవడంలో ఉంటుంది!

అలాగే భోజనాల విషయాలలో సరదాగా వెరయిటీ కూడా ఉండాలి!

ఎలాగంటే!

ఒకరోజు తల్లి వంటచేస్తే, మరో రోజు కూతురు చేస్తుంది!

ఒకరోజు తండ్రి వడ్డిస్తే, మరోరోజు కొడుకు వడ్డిస్తాడు!

కూతురు కంచాలు, గ్లాసులు కడిగితే, కొడుకు అన్నీ అమరుస్తాడు!

ఇందులో పని 'పంచుకోవడమే' కాదు "నేర్చుకోవడం" కూడా జరుగుతుంది!

రోజూ- ఉదయం ఆఫీసులో బజారులో ఇంట్లో బయటా ఎన్నో సమస్యలతో, ఎన్నో ఆందోళనలతో టెన్షన్స్‌తో గడిపి ఇంటికి వస్తాము!

అన్నీ మర్చిపోగలిగినది. ఒక్క కుటుంబ సభ్యులందరూ కలిసి చేసే భోజనాల దగ్గరే అని మర్చిపోకండి! కుటుంబ సభ్యుల మధ్యన బలమయిన అనుబంధానికి పునాది పడేది భోజనాల దగ్గరే!

అన్నింటికంటే ముఖ్యమయిన విషయం.

భోజనాల దగ్గర సమస్యలని చర్చించుకో కపోవడం ముఖ్యమయితే,

రెండోది. టి.వి. ముందు కూర్చుని భోజ నాలు చేయడం పెద్ద సమస్య!

దృష్టి దానిమీద కాన్ సన్ట్రేట్ చేసి ఎవరికి వారు ఆ ప్రోగ్రామ్‌లో లీనమయిపోతే అందరూ కలిసి కూర్చున్నా, ఎవరికివారే యమునా తీరే అవుతారు.

ఇంతసేపూ నేను చెప్పినదానికి అర్థం లేదు!

కాబట్టి ఆ సమయంలోనైనా కనీసం టి.వి.ని దూరంచేసి మీ మనసులను దగ్గర చేయండి!

అలాగే-

ఉదయం చెప్పినట్లు కనీసం రెండు వారా లకయినా

భర్తలు- భార్యల ముందర,

కొడుకులు, తల్లుల ముందర,

తలంటు పేరుతో తల వంచగలిగితే,

అపోహలు, సమస్యలు వారిముందు ఎపుడూ తలెత్తవు!

అలాగే

పిక్నిక్‌లు, సరదాలు!!

ప్రతి వారం- లేదా ప్రతి నెలా స్నేహితు లతోనో, కాలేజి ఫ్రెండ్స్‌తోనో, ఆఫీస్ కొలీ గ్స్‌తో పిక్నిక్‌లకనో, పార్టీలకనో, ప్రతి ఒక్కరూ వెళ్ళక తప్పడంలేదు!

మరి అదే పిక్నిక్- అదే పార్టీ మన కుటుంబ సభ్యులతో కలిసి చేసుకుంటే ఎంత బాగుంటుంది? ఆలోచించండి!

నెలకొక సారయినా మీ కుటుంబసభ్యు లందరూ కలిసి సరదాగా, దగ్గరలో ఉన్న ఏ యాత్రాస్థలమో, చారిత్రాత్మక స్థలమో, ఏదో

ఒకటి మీ యిష్టం దర్శించండి! ఇంటి దగ్గర అమ్మచేసి తీసుకొచ్చిన పులిహోర, జంతికలు కలిసి తింటూ, కబుర్లు చెప్పుకుంటూ చేసే ఆ విహారయాత్రలో మీకు తెలియకుండానే మీమధ్యన ప్రేమానురాగాలు వెల్లివిరుస్తాయి!

అలాగే వారానికొకసారి వంటింటికి తాళంవేసి కుటుంబ సభ్యులందరూ కలిసి హోటల్లో పార్టీ చేసుకోండి!

దానివల్ల మీమధ్యన అనుబంధం పెరగడమేకాక బయటపార్టీలు తగ్గుతాయి!

అంతేకాదు,

ఈరోజున ప్రతి ఇంట్లోనూ చూస్తున్నాను కదా!

చేతికి ఎదిగి వచ్చిన కొడుకు ఉంటాడు!

ఖాళీగా బజార్లని కొలుస్తూ షికార్లు కొడతాడే కాని,

మార్కెట్‌కి వెళ్ళి కూరలు తీసుకురాడు! బజారుకు వెళ్ళి సరుకులు తీసుకురాడు! ఇంటిపనంతా చేసుకుని తల్లి అయినా వీధి నపడాలి! లేదా, ఆఫీసులో పనిచేసి, అలసి ఇంటికివచ్చే తండ్రి అయినా కష్టపడాలి!

కాని అది తప్పు! అర్థంచేసుకోండి!

మన యింట్లో జరిగే ప్రతి విషయం లోనూ ప్రతి ఒక్కరి "ఇన్‌వాల్వ్‌మెంట్" ఉండాలి! ప్రతి విషయంలోనూ అందరి ప్రమేయం ఉండాలి!

ఒక విధంగా చెప్పాలంటే 'డివిజన్ ఆఫ్ లేబర్' అన్నమాట!

కుటుంబంలో నలుగురు ఉంటే ఇద్దరు కష్టపడి ఇద్దరు ఎంజాయ్ చేయడమనేది తప్పు!

దానివలన కూడా ఒకరిమీద ఒకరికి కోపం పెరిగి అంతరాలు ఏర్పడతాయి!

అందరూ కలిసి పనిచేయాలి! కలిసి 'ఎంజాయ్' చేయాలి!

కొడుకు మార్కెట్‌కెళ్ళి కూరలు, బజారు పనులు చేయాలి!

కూతురు అమ్మకి వంటపనిలో సహాయం చేయాలి!

అలాగని చదువులను పక్కకు నెట్టేయాలని కాదు నా అభిప్రాయం!

పద్ధతి ప్రకారం అలవాటుపడితే దేనికి ఏదీ అడ్డురాదు! ప్లానింగ్ ముఖ్యం!

అలాగే ట్యూషన్లు!

ఇంట్లో చదువుకున్న తల్లితండ్రులు ఉంటే- అనవసరంగా పిల్లలను ట్యూషన్స్‌కి తరమక కొంత సమయం వారి చదువుకి కేటాయించాలి!

అక్కడే పిల్లలకి తల్లితండ్రులపట్ల 'భయభక్తులు' ఏర్పడే క్రమశిక్షణ నేర్పాలి! ఖాళీగా తిరిగే అన్నయ్య చెల్లెలికి ట్యూషన్ చెప్పవచ్చు!

సాధ్యమయినంతవరకు బయటవారి ప్రమేయం తగ్గించుకుని, మన సమస్యలను మనమే పరిష్కరించుకోవాలన్నదే నా సారాంశం!

పైదంతా జనరల్‌గా చెప్పాను!

ఇక మన గురించి!

మళ్ళీ మనమధ్యన రాకపోకలు సాగించాలంటే ఒకటే మార్గం!

కష్టమయినా, బద్ధకమయినా, నిర్లక్ష్యం చేయకుండా నెలకొకసారి ప్రతి కుటుంబానికి ఉత్తరాలు రాయడం!

కనీసం రెండు నెలలకొకసారి కలుసుకోవడం!

ఈ సందర్భంలో ముఖ్యమయిన విషయం ఒకటి చెబుతున్నాను! రాకపోకల గురించి!

ప్రతి రెండు నెలలకూ ఒక్కోచోట 'అందరం' కలుసుకోవడం అసాధ్యం! ఎందుకంటే ఎపుడూ సెలవుపెట్టి హైదరాబాదు

నుండి విశాఖపట్టణం రావడమో, లేదా విశాఖపట్టణం నుండి విజయవాడ రావడం కుదరని పని!

దగ్గర వాళ్ళు కలుసుకోవాలి!

అంటే వరంగల్ హైదరాబాదులలోని కుటుంబాలు

విశాఖపట్టణం రాజమండ్రిలోని కుటుంబాలు

ఏలూరు విజయవాడలలోని కుటుంబాలు,

కలుసుకోవడం పెద్ద కష్టమేమీకాదు!

అవేమంత దూరప్రయాణాలు కాదు! వాటికోసం సెలవలూ పెట్టనవసరంలేదు! కాని ప్రతి సంవత్సరము మాత్రం ఎవరో ఒకరి ఇంట్లో ఏదో ఒక అకేషన్ కల్పించుకొని అందరం ఖచ్చితంగా కలవాలి!

అసలు ఈ అకేషన్స్ అనేవి మనమే కల్పించుకోవాల్సి రావడం నిజంగా దురదృష్టకరం!

నిజానికి మన కుటుంబాలలో ప్రతి సంవత్సరం విధిగా వచ్చే అకేషన్స్ కొన్నయినా ఉన్నాయి!

మనవాళ్లు దీపావళి వెళ్ళిన తర్వాత వచ్చే 'భగినీహస్త భోజనం' రోజున అన్నదమ్ములు, చెల్లెళ్ళ దగ్గరకో, అక్కయ్యల దగ్గరకో వెళ్లి వారి చేతి భోజనం తినాలని చెప్పారు!

కాని, మనవాళ్ళు ఆ విధంగా కలుసుకోవడం మానేసారు!

అసలు, మన సంప్రదాయాల వెనకగల నిగూఢ రహస్యం మనుష్యుల మధ్యన అనుబంధం పెంచటమే!

కాని, దురదృష్టం కొద్దీ మనవాళ్ళు అసలు సంప్రదాయాలనే విస్మరిస్తూ, ముఖ్యమయిన పండగలకి సైతం దూరమవుతున్నారు!

అంతవరకూ ఎందుకు?

మన కాలాన్ని మింగేస్తున్న టి.వి.ల గురించి ఇంత క్రితమే కదా అనుకున్నాము! టి.వి.లలో వచ్చే యాడ్స్‌లో సైతం ప్రేక్షకులను ఎక్కువగా ఆకర్షించేవి, వినియోగదారులపై ఎక్కువగా ప్రభావం చూపేవి అయిన ఎడ్వర్‌టయిజ్‌మెంట్స్ ఎక్కువగా "కుటుంబ సభ్యుల మధ్యనగల అనుబంధం" అనే సబ్జెక్ట్‌మీద చిత్రీకరించినవే!

మీరు తరచూ పేపర్లలో చదువుతూనే ఉండి ఉంటారు!

పట్టుబడిన ఉగ్రవాదులు చెబుతున్న కథనం ప్రకారం వారు అలా మారడానికి కారణం మొదటినుండి కుటుంబంలో వారు అనుభవించిన ఒంటరితనం, తల్లి దండ్రుల నిరాదరణ, పెంపకం పట్ల నిర్లక్ష్యం, సరియైన భద్రతా భావాన్ని కల్పించకపోవడం అన్నిటికీ మించి వారి కుటుంబంలో సరియైన అనుబంధం లేకపోవడం! ఉంటే ఆ బాధ్యతలనుండి దూరంగా ఎందుకు పారిపోతాడు?

అందుకే మనుష్యుల మధ్యన బంధాలు పెరగాలంటే రాకపోకలు కూడా పెరగాలి!

అలాగే,

తరచూ కలుసుకోవాలి అన్నాను కదా అని ఒకరి ఇంటికి ఎపుడూ 'విజిట్స్' చేస్తూ రోజుల తరబడి తిష్టవేయడం కూడా సబబుకాదు!

ఎంత ఉన్నవాళ్లయినా ఒకరికి ఇద్దరయితే, ఈ రోజుల్లో రెండురోజులు భరించాలన్నా కష్టమే! అందరూ ఉద్యోగం చేసుకునే వాళ్ళే! ఎవరినీ ఇబ్బంది పరచడం మన ధ్యేయం కాకూడదు!

మన ఆశయమల్లా ఒకటే!

మన లిమిట్స్‌లో మనం ఉంటూ, మన వారితో సత్సంబంధాలు కొనసాగిస్తూ, ఆ అనుబంధాలను జీవితాంతం నిలుపుకోవడం!

మనలో ఎవరయినా పనిమీద ఏ విజయవాడో హైదరాబాదో విశాఖపట్టణమో వెళ్ళినపుడు పనిచూసుకుని పరిగెత్తుకురాకుండా మనవాళ్ళని కనీసం పలకరించి రావాలి!

ఏది ఏమయినా-

మన మధ్యన ఒకే చెట్టు కొమ్మలమయిన మన కుటుంబ సభ్యుల మధ్యన ఉండే ప్రేమ, అనురాగం సహజంగా ఉండాలి! కమర్షియల్ కాకూడదు!

ఆఖరుగా,

మనమధ్యన అనైక్యతవలన, పత్యక్షంగా నాకు జరిగిన అనుభవమేమిటో చెప్పి ఈ సభ విరమిస్తాను!

ఈ ఇంటికి మనం సమావేశమయింది దక్షిణంవైపు!

అటువైపు ఉత్తరంవైపు ఖాళీజాగాలో రకరకాల మొక్కలతో, పూలచెట్లతో, 'కాశ్మీర్' అంత పచ్చగా, అందంగా ఉన్నది గమనించారా?

పోయిన సంవత్సరం వచ్చిన తుఫానుకి అటువైపు పిట్టగోడ పడిపోయింది! మనకు ఎలాగూ ఈ పెంకుటిల్లు స్థానంలో మేడ కట్టుకునే అభిప్రాయం ఉంది కదా అనే ఉద్దేశ్యంతో ఇపుడు వెంటనే పిట్టగోడ కట్టించడం ఎందుకులే అని తాత్కాలికంగా దడి కట్టి ఊర్కున్నాను!

మన ఇంటికి ఆ ఉత్తరంవైపు ఉన్నవాడు అది 'ఎడ్వాంటేజ్'గా తీసుకుని, ఇటువైపుకి వచ్చేలా కట్టెలు, దూలాలు వేయడం ప్రారంభించాడు!

అదేమిటి? అని అడిగితే తీసేస్తానన్న మనిషి నెలక్రితం ఏమన్నాడో తెలుసా?

ఆ జాగా కూడా తన స్థలంలోనిదే అని వాదించాడు! వాడి ఇంట్లోని పెళ్ళాంబిడ్డలతో సహావచ్చి పోట్లాడాడు!

ఆక్రమించుకున్న స్థలం మనదే అని తెలిసినా,

ఎదురుతిరిగి పోట్లాడలేకపోయాను! గట్టిగా నిలబడి వాదించలేకపోయాను! ఎందుకంటే ఒంటరివాడిని, బలహీనుణ్ణి!

నా వెనక బలగంలేదు! కావలసిన అండ లేదు!

అందుకే సభాముఖంగా చెబుతున్నాను. ఆ ఆక్రమణనుండి వాడిని ఎలా తరిమికొడతారో మీ యిష్టం!

ఆ స్థలం నా ఒక్కడిదీకాదు! అందరిదీ! మనందరిదీ!

పది కర్రలు కలిస్తే కాని పందిరి కాదు!

అనుబంధం అనే మల్లెతీగ ప్రాకితేనే కాని,

మల్లె పందిరి కాదు!

అపుడే ఆ గాలి మలయమారుతము! మనసులు నవనీతము!

స్వస్తి!!"

వేదమూర్తిగారు దీర్ఘమయిన ఆ ఉపన్యాసం ముగించినా,

అందరూ నిమిషంసేపు అలాగే నిశ్శబ్దంగా, ఆలోచనలో పడికొట్టుకుపోతున్నట్లుగా, ఎవరికి వారు కళ్ళప్పగించి చూస్తూ ఉండిపోయారు!

ఆ నిశ్శబ్దంలోనుండి,

ఆకృతి తన చిన్ని చేతులు కలిపి చప్పట్లు చరిచింది!

ఆ వెంటనే అందుకున్నట్లుగా వానలా, జడివానలా చప్పట్లతో మార్మోగిపోయింది ఆ స్థలం!

అందరూ లేచి కుర్చీలలో సర్దుకున్నారు, లోపలికి వెళ్ళారు!

ఏవో పనులయితే చేస్తున్నారు కాని అందరి మనసుల్లోనూ తెలియని 'మధన' జరుగుతోంది!

ఆయన చెప్పింది "తన గురించే"నని ఎవరికి వారు అనుకుంటున్నారు! వాళ్లని ఆలోచించుకోడానికి అరగంటసేపు 'గేప్' ఇచ్చారు వేదమూర్తి!

చాలు,

వారిలో అంతర్మధనానికి అంకురం పడింది!

నెమ్మదిగా అదే మొలకెత్తుతుంది!

తన ఆశయం నెరవేరుతుంది!

మరీ ఆ గంభీరమయిన వాతావరణం కొనసాగడం ఇష్టంలేక ఆయన సాయికృష్ణని పిలిచి ఏదో చెప్పారు!

సాయి వెంటనే వరండాలో టేప్‌రికార్డర్ పెట్టి సినిమా పాటల కేసెట్ పెట్టాడు!

ఆ పాటలతో,

నెమ్మదిగా అందరూ మామూలు ప్రపంచంలోకి రాసాగారు!

కళ తప్పిన వారి ముఖాలు మళ్ళీ మామూలు స్థితికి రాసాగాయి! పాలిపోయిన వారి ముఖాలలోకి రక్తం ప్రవహించసాగింది!

తొమ్మిది గంటలకి,

హాలులో వరసగా చాపలు వేసి భోజనాలు వడ్డించారు!

రెండు బ్యాచెస్‌గా తిన్నారు!

భోజనాలు అయిన తర్వాత,

సత్యవతి పొగడగట్టుమీద కూర్చుని ఆడపిల్లలందరికీ వరుసగా గోరింటాకు పెట్టింది!

అందరికీ పెట్టి తన చెయ్యి చూసుకొంటే ఎర్రగా పండి ఉంది! ఎదుటివారికి పంచితేనే తన మనసులో కూడా 'ప్రేమ' వెల్లివిరిసేది! ఆ రోజు సమారాధన సమావేశం కబుర్లతో రాత్రి గడిచిపోయింది.



మర్నాడు ఉదయం,

కాఫీ టిఫిన్లు అవగానే సూర్యనారాయణ, మోహన్ రైల్వేస్టేషన్‌కి వెళ్ళారు! రాత్రికి వాళ్ళిద్దరి కుటుంబాలకికాక, కృష్ణమూర్తి కుటుంబానికి, హైదరాబాదుకి కూడా టికెట్స్ రిజర్వ్ చేయించారు!

సత్యవతి, భానుమూర్తి కుటుంబాలు, ఆ రోజల్లా ఉండి మర్నాడు వెళతామన్నారు!

ఈలోపు వినీల్, సాయికృష్ణని తీసుకుని పక్క యింట్లోకి నడిచి, వాకిట్లో నిలబడి అరిచాడు "ఓయ్! ఎవడ్రా ఇంట్లో!"

ఆ పిలిచిన తీరుకి, లోపలినుండి ఓ నడివయసాయన, ఆయన భార్య వచ్చి నిలబడ్డారు "ఏమిటీ? ఎవరు కావాలి?" గద్దిస్తూ అడిగాడు!

"భజగోవిందం అంటే నువ్వేనా?"

"నేనే! అయితే ఏమిటట?" ఛాతీ విరుచు

కుని అడిగాడు!

వినీల్ అతనికి దగ్గరగా నడిచి కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అన్నాడు "చూడు నీ దక్షిణంవైపు ఉన్నదే పెంకుటిల్లు, ఆ యింటి వారసుడిని నేను"

"అయితే ఎవడికి కావాలోయ్!"

"నాకే కావాలోయ్!" అని జేబులో చెయ్యి పెట్టి స్టయిల్‌గా అడిగాడు వినీల్,

"ఏమిటీ కథ! మా స్థలంలోకి నువ్వే జొరబడి అది నీదేఅని వాదిస్తున్నావట!"

"అవును, నాదే! కాదని ఎవడన్నాడో రమ్మను రమ్మను ఆ మగాడిని నాముందుకు రమ్మను" మీసం మెలితిప్పుతూ అరిచాడు!

"ఎవరో ఎందుకు? అసలు సిసలయిన మగాడ్ని నీ ఎదురుగానే ఉన్నాను మామా" అన్నాడు.

అంతసేపూ కిటికీలోనుండి తొంగిచూస్తున్న భజగోవిందం కూతురు సిగ్గుపడి లోపలికి తప్పుకుంది!

సాయికృష్ణ- వినీల్‌లోని యాక్షన్ చూస్తున్నాడు.

వినీల్ కూల్‌గా చెప్పాడు, 'చూడు గోవిందం! నీకు తెలియదేమో! నేనో మాఫియాలో మెంబర్ని! పాతబస్తీ గూండాని. చెయిన్ బ్యాచ్‌లో నాలుగో సభ్యుడిని! నేను తలచుకుంటే శాల్తీనే గల్లంతు చేస్తాను"

అంటూనే జేబులోనుండి బటన్‌నైఫ్ తీసి, బటన్ నొక్కగానే కస్సుమంటూ బయటకు వచ్చింది కత్తి.

"ఎ... ఎ... ఏవిటీ! నాకు అర్థం కావడం లేదు" వణికిపోతూ అన్నాడు భజగోవిందం!

"నీకు- అర్థం కాకపోతే- వెనకే ఉన్న "ఆంటీ" అర్థమయ్యేలా చెబుతుందికదూ ఆంటీ!"

భజగోవిందం భార్యకి నిలువుగుడ్లు పడ్డాయి. కాళ్లు చేతులు వణికిపోయి, అరచేతుల్లో చెమటలు పడుతుంటే మొగుడిని ఉద్దేశించి అన్నది "ఈ గూండాలతో మనకెందుకండీ గొడవ! ముందర ఆ దూలాలు తీసి ఇటు పడేయండి"

వినీల్ యాక్షన్‌కి, వాళ్ళ అవస్థకి సాయికృష్ణ నవ్వు ఆపుకోలేకపోతున్నాడు.

"అ... అ... అలాగే అబ్బాయ్- తీసేస్తాగా. తీసేస్తాగా. ముందు ఆ కత్తి తీస్తే!"

వినీల్- కత్తి మడిచేసి జేబులో పెట్టుకుంటూ అన్నాడు. "ఎప్పుడో కాదు- కేవలం అరగంటలో. మొత్తం ఖాళీచేసి ఇటువైపు పడేయాలి. లేకపోతే ఏం జరుగుతుందో తెలుసుగా. అసలే మాఫియామెంబర్ని"

కాలర్ ఎగరేసి- బయటకు నడిచాడు వినీల్.

"కంగ్రాట్స్- అద్భుతం" సాయికృష్ణ భుజం తట్టాడు.

"మరి మెత్తగా చెబితే వింటారా! కత్తి చూపిస్తే తప్ప పనులు కాని రోజులు ఇవి!"

పక్కసందులో ఏవో శబ్దాలు అవుతుంటే- ఏవిటా? అని కిటికీలోనుండి తొంగిచూశారు వేదమూర్తిగారు.

ఉత్తరంవైపు దడి దగ్గర-

చెమటలు కక్కుతూ, ఆయాసపడుతూ- కట్టెలూ, దూలాలు భుజాలమీద మోసి అటువైపు పడేస్తున్నారు భజగోవిందం ఆయన కుటుంబసభ్యులు.

ఒక్కపూటలోనే ఇంత రియాక్షనా? అని ఆశ్చర్యపోయారాయన!

బయటనుండి ఎవరో పిలవడంతో బయటకు వచ్చారు వేదమూర్తి.

ఫొటోగ్రాఫర్ నిలబడి ఉన్నాడు!

"సాయంత్రం నాలుగింటికల్లా రెడీగా ఉండాలి. లేకపోతే షేడ్ పోతుంది" చెప్పాడు.

వేదమూర్తి అలాగేనని తలూపారు.

అప్పుడు మొదలయింది మనసులో అల జడి.

ఈ రెండు రోజులూ సరదాగా, పెళ్ళిలా, పేరంటంలా గడిచిపోయాయి.

సాయంత్రం-

ఏ పిడుగే పడనుందో! ఏ బాంబే బద్దల వ్వనుందో!

అప్పుడు-

ఈ మనుషులందరి ముఖాలు ఎలా ఉంటాయి?

ఈ అనుబంధం, ప్రేమ ఇలాగే నిలుస్తాయా!

మౌనంగా మనసులోనే రోదించారాయన.

"భగవంతుడా! సాయంత్రం బద్దలవబోయే ఆ నిజాన్ని భరించే శక్తి- నా కుటుంబసభ్యులకి ఇవ్వు! ఆ సంఘటన- ఇప్పుడిప్పుడే ముడులు వేసుకుంటున్న మా అందరి మధ్య ఉన్న అనుబంధానికి ఎలాంటి అవరోధం కలుగకుండా చూడు"

అప్పుడే స్నానంచేసి బయటకు వచ్చిన కృష్ణమూర్తి- గుమ్మం దగ్గరే ఆలోచనల్లో నించుండిపోయిన తండ్రిని చూసి "ఏవిటి నాన్నా? ఆలోచిస్తున్నారు? " అంటూ అడిగాడు.

"అహా! ఏం లేదు" అంటూ తల విదిల్చి గబగబా గదిలోకి వెళ్ళిపోయారు.

కృష్ణమూర్తి ఆశ్చర్యంగా చూస్తుండిపోయాడు.

ఆ మధ్యాహ్నం భోజనాల దగ్గర చెప్పారు వేదమూర్తి! "సాయంత్రం నాలుగు గంటలకి మనందరి గ్రూప్‌ఫోటో ఉంది. కాబట్టి ఎవరూ బయటకు వెళ్ళవద్దు"

ఆ వెంటనే సత్యవతి అంది నవ్వుతూ, "అలాగే నేను కూడా ఒక విషయం అందరికీ చెప్పదలచుకున్నానర్రా! వచ్చే నెలలో ఏలూరులో మా ఇంట్లో అందరం కలుసుకోవాలి. అకేషన్ ఏదో ఉండాలి కాబట్టి- వచ్చే నెల ఇరవయినాలుగున మా పెళ్ళిరోజు. అదేపండుగ అనుకుని అందరూ రావాలి!"

కొందరు తప్పక వస్తామన్నారు.

మళ్ళీ వెంటనే సెలవు పెట్టి రావడం కుదరదని కొందరన్నారు.

ఆ టైముకి ఆఫీసులో 'ఆడిటింగ్' ఉంటుంది కాబట్టి కుదరదని మరికొందరన్నారు.

ఏది ఏమయినా-

తప్పించుకునే ప్రయత్నం చేయక, సిన్సియర్‌గా ఎవరికి వీలయితే వారు తప్పక వస్తామన్నారు.

వేదమూర్తి అన్నారు. "ఎవరు వచ్చినా రాకపోయినా మా దంపతులం మాత్రం వస్తాం. ఈ వయసులో మాకు అంతకుమించిన కాలక్షేపం ఏముంటుంది? ఎవరు ఏ అకేషన్‌కి పిలిచినా మా హాజరు తప్పక ఉంటుంది"

"ఆది దంపతులు! మీరు లేకుండా ఫంక్షన్స్ మేం మాత్రం ఎలా చేసుకుంటాం తాతయ్యా!" అంది అర్పిత.

"మా ఇంట్లో ప్రోగ్రామ్ తర్వాత- ఎవరి ఇంట్లో కలుసుకోవాల్సిందీ అక్కడే డిసైడ్ చేస్తాం" సాయికృష్ణ అన్నాడు.

వేదమూర్తి అన్నారు, "ఒరేయ్! ఒరేయ్! మరీ అంత వేగం వద్దు. అతిసర్వత్రా వర్జయేత్ నెలనెలా ప్రోగ్రామ్స్ అంటూ ఫిక్స్ చేసుకుంటూపోతే ప్రతినెలా అంత దూరాల నుండి ఛార్జీలు పెట్టుకుని, సెలవలు వేస్ట్ చేసుకుని ఎవరు మాత్రం వస్తారు? అందుకే స్లో అండ్ స్టడీ! మొదట్లో నాలుగు

నెలలు ఉత్సాహంగా ఉన్నా తర్వాత విసుగు పుట్టి అది కూడా రొటీన్‌లా తయారయి మొహం మొత్తే ప్రమాదముంది. రాకపోకలనేవి బలవంతంగా, ఇష్టం లేకుండా తప్పనిసరిగా జరగకూడదు. ఉత్సాహంగా, ఆనందంగా, తనవారిని కలుసుకోవాలనే ఆత్రతగా జరగాలి! అంటే కనీసం- ఒక ఫంక్షన్‌కి మరో ఫంక్షన్‌కి ఆరు నెలలయినా తేడా ఉండాలి! సరే! సత్యవతి ముందుగా డిక్లేర్ చేసేసింది. తన ఆనందం, ఉత్సాహం ఎందుకు కాదనాలి? ఈసారికి మాత్రం అక్కడ కలుసుకుని తర్వాత ఆరునెలల గాప్‌తో ఫంక్షన్స్ ఎరేంజ్ చేసుకోవాలి! తెల్సిందా?."

అర్థమయిందన్నట్లుగా తలూపాడు సాయికృష్ణ!

మిగతా అందరూ "హమ్మయ్యా" అని తేలికగా ఊపిరి పీల్చుకున్నారు.

ఇంతటి పరస్పర అనుబంధాల మధ్యన కూడా-

వేదమూర్తిగారి దృష్టికి రాని కొన్ని సంఘటనలు జరిగిపోయాయి.

మోహన్, వినీల్ కలిసి బయటకు వెళుతుంటే-

"వినీల్- కాస్త మనుషులలో పడుతున్నాడు! బాగుపడుతున్నాడు" అని కృష్ణమూర్తి సంతోషించాడు.

కాని వాళ్లిద్దరూ వెళ్ళింది- బార్‌కి.

కబుర్లు చెప్పుకుంటూ- హాయిగా 'ఎంజాయ్' చేశారు.

ఎవరింట్లో కలిసినా ఇద్దరూ బార్‌కి వెళ్ళి డ్రింక్ చేయాలని ప్రమాణాలు కూడా చేసుకున్నారు.

చకిత, తనతోపాటు బ్యాగ్‌లో పెట్టుకుని తీసుకువచ్చిన డిటెక్టివ్ సాహిత్యాన్ని వికితకి పరిచయం చేసింది.

చకిత, వికిత దూరంగా జామచెట్లకింద చాప వేసుకుని, బుద్ధిగా చదువుతుంటే దూరంనుండే ముచ్చటపడిపోయింది జానకి!

వాళ్ళు పఠిస్తున్నది- ఎలాంటి సాహిత్యమో- ఆమె ఊహకి కూడా అందలేదు.

ఈసారి తన ఇంట్లో జరగబోయే ఫంక్షన్‌లో ఖర్చు ఎంతవుతుందో తల్చుకుని కొట్టుకునే గుండెలతో తప్పుకుని, తప్పుకుని తిరుగుతున్నాడు భానుమూర్తి!

వీళ్లందరూ వచ్చి నాలుగురోజులు ఉంటే తన ఏకాంతానికి భంగం వాటిల్లుతుందని ఇప్పటినుంచే భయపడుతున్నాడు దక్షిణామూర్తి.

చాపకింద నీరులా వ్యాపిస్తున్న ఇలాంటి ఆలోచనల మధ్యన-

టైమ్ చకచకా గడిచిపోయి- చూస్తుండగానే మూడు అయింది.

వేదమూర్తిగారి హెచ్చరికతో-

అందరూ ఎక్కడివాళ్ళక్కడ లేచి- మొహాలు కడుక్కోడాలు, అలంకరించుకునే ప్రయత్నాలలో పడ్డారు.

ఈ లోపల సాయికృష్ణ బజారు వెళ్ళి- చిన్న కవరు నిండా- అందరికి సరిపడా కదంబమాలలు తీసుకొచ్చాడు.

మనసులోని ఆలోచనలను పక్కకు పెట్టి-

అందరూ- నవ్వుతూ, తుళ్ళుతూ, పాతరోజులు జ్ఞాపకం తెచ్చుకుంటూ- రెడీ అవుతుంటే-

వేదమూర్తిగారు ఒంటరిగా గదిలో పడక్కుర్చీలో పడుకుని కళ్ళు మూసుకుని ఉండిపోయారు.

గడిచే ఒక్కొక్క క్షణం- ఆయనకి సమ్మెటపోటులా ఉంది.

మనసు టెన్షన్‌కి గురి అవుతోంది.

గుండె తీవ్రంగా స్పందిస్తోంది.

తను తీసుకున్న ఈ నిర్ణయం- ఎలాంటి

సంఘటనలకు దారి తీస్తుందోనని- మానసిక ఒత్తిడికి గురి అవుతున్నారాయన.

ఒకసారి లేచి- బీరువా తలుపు తీసి- ఫైల్ అడుగున పడేసిన ఆ పొడవాటి కవర్‌ని తడుముతుంటే- మనసు తీవ్రంగా కంపించింది. చేతులు వణికాయి.

తలెత్తి చూశారు.

మూడున్నర దాటుతోంది!

హాలులో అందరూ నవ్వుతూ రెడీ అవుతున్నారు.

నవ్వులతో, కేరింతలతో హాలు మార్మోగుతోంది.

నాలుగు దగ్గర పడుతోందంటే-

ఆయన ఊహలు రకరకాలుగా పరిగెత్తుతున్నాయి.

ఈ నవ్వులు, తుళ్ళింతలు ఒక్కసారిగా ఆగిపోయి- ఒక్కసారిగా భయంకరమయిన నిశ్శబ్దం పేరుకుంటుందా? శ్మశాన వాతావరణం నెలకొంటుందా?

భగవంతుడా- ఈ గండాన్ని గట్టెక్కించు! మనసులోనే పదేపదే మొక్కుకున్నారు.

ఆకృతి- పరిగెత్తుకొచ్చింది, "తాతయ్యా! అందరం రెడీ, నీదే ఆలస్యం"

"వస్తున్నానమ్మా" అంటూ హాలులోకి నడిచారాయన!

అప్పటికే ఫొటోగ్రాఫర్ వచ్చాడు.

పెరడులో ఎండ పడుతున్నవైపు- ఎరేంజ్ చేయసాగారు.

కుర్చీలలో- వేదమూర్తి ఆయన తమ్ముడు, అల్లుడు, కొడుకులు, బావగారు!

ఆ వెనక- వారి వారి భార్యలు నిల్చోడం.

వారి వెనక వేసిన బెంచీలమీద- పిల్లలందరూ నిల్చునేలాగా ఏర్పాటుచేశారు.

ఆకృతి మాత్రం, చిన్నపిల్ల కాబట్టి ముందు వరసలో తండ్రి ఒడిలో కూర్చుం

మధ్యలో వేదమూర్తి, భానుమూర్తి, దక్షిణామూర్తి- వారికి ఎడమవైపు మోహన్, కుడివైపు సూర్యనారాయణ, చివరికి కృష్ణమూర్తి కుర్చీలలో కూర్చున్నారు.

ఎవరి భార్యలు వారి వెనకకి వచ్చేలా నిల్చున్నారు.

వెనక బెంచీలమీద ఎవరి తల్లిదండ్రుల వెనకగా వాళ్ళు వచ్చేలా పిల్లలు నించుని మగవాళ్ళందరూ ఒకరిభుజాలమీద ఒకరు చేతులు వేసుకున్నారు.

ఫొటోగ్రాఫర్ పొజిషన్ చూసుకుంటున్నాడు.

మధ్యలో కూర్చున్న వేదమూర్తిగారికి అరచేతుల్లో చెమటలు పడుతున్నాయి.

అప్పుడు సమయం- నాలుగయింది అన్నట్లుగా...

హాలులో గడియారం కొడుతున్న గంటలు విన్పించసాగాయి!

ఆ వెనకే-

వాకిట్లో ఆటో ఆగిన శబ్దం. ఒక్క వేదమూర్తిగారికి మాత్రమే విన్పించింది.

అందరూ ఎవరి గొడవల్లో వారు ఉన్నారు.

కృష్ణమూర్తి అయితే మాటిమాటికి జేబులోనుండి దువ్వెన తీసి తల దువ్వుకుంటుంటే, గౌరి- నిముష నిమిషానికి పవిట సర్దుకుంటోంది.

అప్పుడు-

బయట గేటు కిర్రుమంటూ శబ్దంచేస్తూ తెరుచుకుంది.

అందరి దృష్టి అటువైపు మరలింది.

తెరుచుకున్న గేటులోనుండి- ఒక పాతికేళ్ళ యువతి లోపలికి అడుగుపెట్టింది. మళ్ళీ వెనుతిరిగి, గడియవేసి, తమవైపే నడి

చివస్తున్న ఆ అమ్మాయిని అందరూ ఆశ్చర్యంగా చూడసాగారు.

ఆకుపచ్చరంగు బిన్నీ సిల్క్‌చీర, అదే రంగు జాకెట్టు, మెడలో ముత్యాల గొలుసు, చెవులకు బుట్టలు, పొడవుగా ఉన్న జడ, నుదుట దోసగింజ బొట్టు, కాలిపట్టాలు ఘల్లుఘల్లుమనేలా నెమ్మదిగా నడిచివస్తోంది ఆ యువతి!

తెల్లటిరంగు, అందమయిన ముఖం, కొసదేలిన కళ్లు- ఎప్పుడూ చిరునవ్వు తొణికిసలాడే కోలముఖం- సన్నగా, పొడవుగా సన్నజాజి మొగ్గలా ఉన్న ఆ అమ్మాయి మీదనుండి ఎవరూ దృష్టి మరల్చుకోలేకపోయారు.

అందరి- మనసుల్లోనూ ఒకే ప్రశ్న!

ఎవరీ అమ్మాయి?

అందరి మెదడుల్లోనూ ఒకే సందేహం-

ఈ సమయంలో ఇక్కడికి ఎందుకు వచ్చింది?

ఎవరూ చెప్పకుండానే, ఎవరినీ అడగకుండానే-

ఆశ్చర్యంతో కళ్లు పెద్దవిచేసి, ఎక్కడి వారక్కడ కొలువుతీరిన బొమ్మలల్లే నిల్చుండిపోయి, సందేహంగా, అనుమానంగా ఆ అమ్మాయివైపు చూస్తుండగా-

ఆ అమ్మాయి- సరాసరి నడిచివెళ్ళి-

కృష్ణమూర్తి వెనకగా- జానకిని ఆనుకుని నిల్చుంది.

సూర్యనారాయణ, గబుక్కున తండ్రివైపు తిరిగి "నాన్నా- ఈ గ్రూప్ ఫోటో మన కుటుంబసభ్యులవరకే కదా!" అన్నాడు

ఆయన ప్రశాంతంగా చిరునవ్వు నవ్వి అన్నారు.

"ఆ అమ్మాయి మాత్రం మన కుటుంబసభ్యురాలు కాదని ఎవరన్నారు"

ఒక్కసారిగా-

అందరి మధ్యన బాంబు బద్దలయింది.

గొప్ప విస్ఫోటనం జరిగి- ఆ పొగకి ఉక్కిరిబిక్కిరి అవుతున్నట్లుగా- అందరూ ఒక్కసారిగా ఏదో అడగబోయారు.

అప్పటికే వేదమూర్తిగారు, ఎవరికీ ఎలాంటి అవకాశం ఇవ్వకుండా ఫొటోగ్రాఫర్‌వైపు చూసి సైగ చేశారు.

"స్టడీ" పెద్ద పొలికేక పెట్టాడతను.

అంతే!

సందేహాలను, అనుమానాలను, భయాలను, ఆశ్చర్యాలను బలవంతాన లోపలికి దిగమ్రింగి అందరూ బొమ్మల్లా బిగుసుకుపోయారు.

ఫొటోగ్రాఫర్ రెండు స్నాప్స్ తీసి "థాంక్యూ" అనేంతవరకూ ఎవరూ కదలలేదు.

ఒక్కసారిగా-

అందరిలోనూ చైతన్యం వచ్చినట్లుగా, గోలగోలగా, గొడవ గొడవగా మాట్లాడసాగారు.

అందరూ కుర్చీలలోనుండి లేచి నిల్చున్నా- ఒకవ్యక్తి మాత్రం- అగాధాలలోకి కూరుకుపోతున్నట్లుగా, లేవడానికి శక్తిలేనివాడిలా కుర్చీలో అలాగే కూర్చుండిపోయాడు.

అతని ముఖంలో రక్తం ఇంకిపోయినట్లుగా తెల్లగా పాలిపోయింది.

అతను ఎంతటి షాక్‌కి గురి అయ్యాడో- అతని కళ్లే చెబుతున్నాయి.

ఆ వ్యక్తి-

కృష్ణమూర్తి!

ఆ అమ్మాయి చుట్టూ అందరూ గుమిగూడి వింతగా చూస్తూ, సవాలక్ష ప్రశ్నలతో సందేహాలతో జడివాన కురిపిస్తున్నారు.

అందరి మధ్యనుండి నిస్సహాయంగా వేద మూర్తివైపు చూసి పిలిచింది ఆ అమ్మాయి.

"తా...త...య్యా..."

వెంటనే వేదమూర్తి- ఆ అమ్మాయి ముందుకు వచ్చి "రా! శ్రీదేవి? " అంటూ చెయ్యి పట్టుకుని ముందుకు తీసుకువెళ్ళారు.

అప్పటికే కొంతమంది ఊహించేశారు.

అందరూ ఆయన వెంటే లోపలికి నడిచారు.

ఆఖరున మిగిలిపోయిన కృష్ణమూర్తి భుజంమీద బరువుగా చేయిపడితే- ఉలిక్కిపడి తలెత్తాడు.

"జానకీ- ఇక్కడే ఉన్నావా? "

బరువుగా పలికింది ఆమె స్వరం "ఒకటి అయినా- రెండు అయినా... మీ భార్యనే కదా! నేనెప్పుడూ మీ వెనకే ఉంటాను. పదండి! లోపలికి వెళదాం"

కృష్ణమూర్తి ముఖం వడగాడ్పు కొట్టినట్లుగా అయింది.

బలవంతంగా లేచాడు.

అతని చేయి పట్టుకుని- లోపలికి తీసుకెళ్ళింది.

అప్పటికే హాలులో ఉత్కంఠ భరితమయిన వాతావరణం నెలకొనిఉంది.

జీవచ్ఛవంలా నడుస్తూ వచ్చిన కృష్ణమూర్తి చేయి అందుకుని లోపలికి తీసుకువెళ్ళారు వేదమూర్తి.

ఆయనకి కుడివైపున శ్రీదేవి కూర్చుని ఉంది. ఎడమవైపు కృష్ణమూర్తి కూర్చున్నాడు. జానకి ఆయన వెనకే నిల్చుంది.

వినీల్, వికిత అయితే వాడిపోయిన ముఖాలతో చూస్తున్నారు.

వీళ్లందరి మధ్యనా బెదిరిపోయిన లేడిపిల్లలా తలవంచుకుని కూర్చుంది శ్రీదేవి!

సూదిపడితే వినిపించేటంత భయంకరమయిన నిశ్శబ్దం- నెలకొన్నది ఆ హాలులో! కాసేపటికి గంభీరంగా, మంద్రంగా- వేదమూర్తిగారి కంఠం వినిపించింది.

"కష్టసుఖాలు, పగలు చీకటి, ఆనందవిషాదాల సమ్మిళితమే జీవితం! అన్నింటినీ సమానంగా భరించగలగడమే మనం చేయవలసినది! నిజానికి ఈ సంఘటన నేనూ ఊహించలేదు. కాని చాలా నాటకీయంగా జరిగిపోయింది. వీటి అన్నింటికి ముందర చెప్పాల్సింది నాలుగు రోజులక్రితం నాకు వచ్చిన ఉత్తరం గురించి! ఆ ఉత్తరం మద్రాసునుండి ఈ అమ్మాయి తల్లి ఆఖరిక్షణాలలో వ్రాసిన ఉత్తరం! ఆ ఉత్తరం ద్వారా నాకు కథ అంతా తెల్సింది.

కృష్ణమూర్తి చదువు అయిపోయిన తర్వాత- ఉద్యోగం వేటలో ఉన్న రోజులలో- మా వీధి చివరనే ఉన్న గంగాధరంగారి కూతురుతో, కలిసి తిరగడం గురించి నేనూ విన్నాను అప్పట్లో! తప్పని మందలించాను కూడా! గంగాధరంగారు వాళ్ళు అప్పటికి బాగా ఉన్నత స్థితిలో ఉన్నారు. అంతేకాదు వాళ్ళ కులం కూడా వేరు. కాబట్టి ఎవరూ వీళ్ళ పెళ్ళిని అంగీకరించలేదు. తర్వాత గంగాధరంగారు హఠాత్తుగా ట్రాన్స్‌ఫర్ అయి వెళ్ళిపోయారని మాత్రమే తెలుసు! కాని- దానికిముందు వారి అమ్మాయి శారద- కృష్ణమూర్తి కలిసి తిరగారని అంతే కాదు... వారి ప్రేమఫలం ఆ అమ్మాయిలో ఊపిరి పోసుకుంటోందని ఎవరికీ తెలియదు. ఇది పాతికేళ్లక్రితం మాట. వాళ్లు వెళ్ళిన నాలుగు నెలలకే కృష్ణమూర్తి ఉద్యోగంలో చేరడం జరిగింది. వెంటనే జానకితో పెళ్లి కూడా నిశ్చయం చేశాం. కాని అప్పట్లో పెళ్లి వద్దని ఎందుకు గొడవ చేశాడో ఇప్పుడర్థమయింది.

శారదకి పెళ్ళి ప్రయత్నాలు చేయబోతే శారద తండ్రిని ఎదిరించి బయటకు వచ్చి కృష్ణమూర్తి కోసం వస్తే-

అప్పటికే కృష్ణమూర్తికి పెళ్ళిఅయి పదహారురోజులు!

పదహారురోజుల పండగనాడు కృష్ణమూర్తి ఎందుకలా ప్రవర్తించాడు. ఎందుకంత మూడీగా ఉన్నాడో ఇప్పుడర్థమవుతోంది.

అలా బయటికి వచ్చిన శారద తిరిగి తండ్రి దగ్గరకి వెళ్ళలేదు.

మరి- అప్పుడు కృష్ణమూర్తి- శారదకి ఏ ప్రమాణాలే చేశాడో, ఏ ధైర్యమే చెప్పాడో-

ఆ శారదకీ, కృష్ణమూర్తికీ- ఆ భగవంతుడికే తెలియాలి!

తాను మెడ్రాస్‌లో ఉద్యోగం చేసినన్నాళ్లూ- శారదని కూడా మైలాపూర్‌లో ఉంచి రెండు రోజుల కొకసారి వెళ్లేవాడట!

అక్కడే పుట్టింది- ఈ శ్రీదేవి.

తర్వాత శారద అక్కడే ఏదో ప్రయివేటు కంపెనీలో ఉద్యోగం చేస్తూ సెటిలయిపోయింది. కృష్ణమూర్తి కూడా అప్పుడప్పుడు డబ్బు పంపిస్తూ ఉండేవాడు.

తర్వాత- కృష్ణమూర్తికి హైదరాబాద్ ట్రాన్స్‌ఫర్ అవడం-

వినీల్, వికిత పుట్టడం-

అయినా నెలకోసారి మెడ్రాస్ వెళ్ళివస్తూనే ఉన్నాడు.

కాని ఇంతాచేసి- శారదని తన భార్యగా శ్రీదేవిని తన కన్నకూతురుగా సమాజానికి పరిచయం చేయలేదు.

ప్రతిష్ట మంట కలుస్తుందని భయపడ్డాడు. పరువుకోసం ప్రాకులాడాడు.

చివరి చివరికి ఆ విషయమై ఇద్దరి మధ్యన గొడవలు రేగి, మనస్పర్ధలు వచ్చి దూరమయిపోయారు.

కృష్ణమూర్తి- మళ్ళీ ఆమెవైపు, శ్రీదేవివైపు తిరిగి చూడలేదు.

అప్పటికే జబ్బుపడి మంచాన ఉన్న శారద- ఆ దిగులుతోనే కృంగి కృశించి పోతూ ఈమధ్యన- నేను రిటైర్ అయిన సందర్భంగా నాకు జరిగిన సన్మాన కార్యక్రమం గురించి ఫొటోతో సహా పేపర్‌లో పడినప్పుడు ఆ అడ్రెస్ ఆధారంగా నాకు ఉత్తరం రాస్తూ.

శ్రీదేవిని విజయవాడ పంపిస్తున్నట్లుగా రాసింది.

నేను మొన్ననే శ్రీదేవిని రిసీవ్ చేసుకుని నా ఫ్రెండ్ ఇంట్లో ఉంచాను.

ఎందుకంటే ముందరగా ఆ అమ్మాయి వస్తే,

మనందరి కలయికకు నేను చేసిన ప్రయత్నాలన్నీ విఫలమవుతాయి.

ఈ వాతావరణం వచ్చిఉండేద్ది కాదు.

కాని-

ఒకటి మాత్రం నిజం!

నేను బహిరంగంగా శ్రీదేవిని తీసుకువచ్చి అందరిముందు పరిచయంచేసి నా కన్నకొడుకు పరువే తీశానో-

అభం శుభం తెలియని- ఈ అమ్మాయికి అండగా నిలవాలని- మంచిపనే చేస్తున్నానో- ఆ భగవంతుడికే తెలియాలి.

ఆ రోజున నేను ఎంతో ఆలోచించాను!

ఎంతగానో అంతర్మధనానికి గురిఅయ్యాను!

శ్రీదేవి చూపిస్తున్న ఆల్బమ్‌లోని ఫొటోలను చూస్తూ ఉంటే ఈ ప్రపంచమే గిర్రున తిరిగినట్లయింది!

ఒకవైపు చూస్తే వాడి సంసారం!

మరోవైపు శారదా శ్రీదేవి!

ఆఖరున నేను ఒకటే నిర్ణయానికి వచ్చాను!

శ్రీదేవిలోనూ ప్రవహిస్తున్నది మన

రక్తమే!

శారదకి తాళికట్టకపోయినంత మాత్రాన శ్రీదేవి నా మనవరాలు కాకపోతుందా? కృష్ణమూర్తి అన్యాయమే చేశాడో శారదకి అన్యాయమే జరిగిందో తప్పొప్పులు ఎటు వైపు ఉన్నా-

ఏ పాపమూ ఎరుగని ఈ అమాయకురాలు ఎందుకు బలిఅవ్వాలి?

పాతికేళ్ళ తర్వాత గతం తవ్వుతూ ఒకరిని ఒకరు నిందించుకుని ప్రయోజనంలేదు!

ఈ రోజున,

మనం మనవాళ్ళం నా కూతురు, నా మనవరాలు, నా కోడలు అని బంధాలు ఆత్మీయతలు అనుకుంటున్నామే!

అలాగే శ్రీదేవి కూడా 'తన' వారికోసం ఇలాగే పరితపించిపోయింది!

వాళ్ళిద్దరు చేసిన పనికి సమాజంలో అనాథగా ఒంటరిగా ఎలాంటి స్థానంలేకుండా మిగిలిపోయింది!

ఆ అమాయకురాలు ఏం పాపం చేసిందని ఈ శిక్ష?

తన తల్లి మెడలో కూడా ఆ 'తాళి' అనే తాడు పడిఉంటే ఈ రోజున శ్రీదేవి కూడా మనతోపాటు గర్వంగా సంతోషంగా ఈ ఆనందాన్ని పంచుకుని అనుభవించి ఉండేది కాదా!

సమాజంలో ఆ అమ్మాయి స్థానాన్ని నిర్ణయించిన ఆ తాడుకి ఇచ్చిన విలువ రక్తమాంసాలతో ప్రేమానురాగాలకోసం వెంపర్లాడే, ఈ ప్రాణికి ఎందుకు ఇవ్వరు?

అందుకే,

ఎవరు ఏమయినా ఏమనుకున్నా,

ఎవరు అంగీకరించినా అంగీకరించకపోయినా,

శ్రీదేవిని నా మనవరాలిగా మన కుటుంబసభ్యులందరి మధ్యన ఆమె కన్నతండ్రివెనక ఫోటోలో శాశ్వతంగా స్థానం కల్పించాను!

జరిగిపోయినదేదో జరిగిపోయింది! కృష్ణా నీ తండ్రిగా చెబుతున్నాను మనం కలలు కంటున్న అనుబంధాన్ని ఆ అమ్మాయికి నీ కూతురుకి దూరం చేయకురా! లేదంటే మన ఈ సమావేశానికే అర్థంలేదు!

ఆస్థి, వాటాలు ఈ ఆలోచనలు మాని శ్రీదేవిని నీ కూతురిగా అందరిముందరా అంగీకరించు!

అమ్మా జానకీ! చిన్న దానివయినా చేతులెత్తి నమస్కరిస్తున్నాను! పెద్ద మనసుతో నీ పెద్ద కూతురిని ఆశీర్వదించు తల్లీ! ఏ పాపమూ ఎరుగని ఆ అమ్మాయిని మన మూర్ఖత్వాలతో దూరం చేయకు!"

జానకి చిత్తరువులా ఉండిపోయింది!

కృష్ణమూర్తి అయితే స్థాణువులా ఏం చేయాలో తెలియని పరిస్థితిలో కొట్టుమిట్టాడుతున్నాడు!

అపుడు లేచి నిల్చున్న శ్రీదేవి కృష్ణమూర్తి ఎదురుగా నిల్చుని "నాన్నా" అని పిలిచింది!

"అమ్మా! శ్రీదేవి నన్ను క్షమించు ప్లీజ్"

కళ్లల్లో నీళ్ళు నిండుతూ ఉండగా అన్నాడు, కృష్ణమూర్తి.

జానకి ఆలోచనల్లోనుండి తెప్పరిల్లినట్లయి నెమ్మదిగా కదిలి శ్రీదేవి భుజంమీద చేయి వేసింది!

వేదమూర్తిగారు తేలికగా ఊపిరి పీల్చుకున్నారు!

ఏది ఏమయినా అందరూ ఆ మార్పుని త్వరగా అంగీకరించలేకపోయారు!

శ్రీదేవిని అంటీ ముట్టనట్లుగానే పలకరించారు!

వినీల్, వికిత అయితే ముఖాలు మాడ్చు

కుని దూరంగా ఉండిపోయారు!

మొట్టమొదట శ్రీదేవిని పలకరించింది సాయికృష్ణ, తర్వాత రాగచంద్రిక!!

ఆ రాత్రి ఎవరూ భోజనాలు చేయలేదు!

జానకీ, కృష్ణమూర్తి ముభావంగా ఉన్నారు!

ఆ పరిస్థితి ఊహించినదే కాబట్టి వేద మూర్తిగారూ ఎవరినీ బలవంతం చేయ లేదు!

వేదమూర్తిగారి ఆదేశానుసారం, శ్రీదేవి ఆయన ఫ్రెండ్ ఇంట్లో ఉంచిన సూట్‌కేస్‌ని తెచ్చేసుకుంది!

ఆ రాత్రి కాత్యాయనితో చెప్పారు ఆయన!

"ఆకృతి కూతురి కూతురయితే శ్రీదేవి కొడుకు కూతురు!"

కాత్యాయని నవ్వి అన్నది "పెద్ద మనవ రాలన్నమాట!"

ఆ మాటకే ఆయన కనులు చెమర్చాయి "నా మనసెపుడూ అర్థం చేసుకునే నీలాంటి భార్య దొరకడం నా అదృష్టం"

అందరూ బయలుదేరబోతుంటే,

అందర్నీ వరుసగా కూర్చోబెట్టి-

కాత్యాయని, వేదమూర్తి అందరికీ బట్టలు పెట్టారు. సుమతీశతకం, భాస్కర శతకం కాపీలు పంచిపెట్టారు!

కాత్యాయని, వేదమూర్తి, సత్యవతి, ఆకృతి, శ్రీదేవి మినహా మిగతా అందరూ స్టేషన్‌కి వెళ్ళి కృష్ణమూర్తి, సూర్యనారా యణ, గౌరీమనోహరి కుటుంబాలకి వీడ్కోలు ఇచ్చారు. తర్వాత ఆయన మర దలు కామేశ్వరి, ఆమె భర్త బయలుదేరబో తుంటే వారికి కూడా బట్టలు పెట్టి సాగనం పారు!



మర్నాడు ఉదయం భానుమూర్తి, రాగచం ద్రిక, ప్రమీల వెళ్ళిపోయారు!

వెళ్ళబోయేపుడు వేదమూర్తి కావాలని మనవరాళ్ళు అందరికీ పరికిణీ ఓణీలు పెట్టి తప్పకుండా కట్టుకోవాలని మరీమరీ చెప్పారు!

రాగచంద్రికకి ఆ విషయం చెప్పవలసిన అవసరంలేదని తెలుసాయనకి!

తరువాత సత్యవతి కుటుంబం బయలుదేరబోతుంటే,

అపుడు వచ్చింది ఆ టెలిగ్రామ్ మద్రాసు నుండి

"శారద ఎక్స్‌పైర్డ్ స్టార్ట్!"

కబురు వింటూనే శ్రీదేవి వేదమూర్తిగా రిని చుట్టేసుకుపోయి బావురుమంది! వెంటనే సాయికృష్ణ తల్లితండ్రులని మాత్రం పంపి తను ఉండిపోయాడు!

వెంటనే కృష్ణమూర్తికి ఫోన్ చేశాడు!

గబగబా నాలుగయిదు బట్టలు ఎయిర్‌బాగ్‌లో సర్ది వేదమూర్తి, సాయికృష్ణ, శ్రీదేవి మద్రాసు బయలుదేరారు!

వాళ్ళు మెడ్రాస్ చేరేసరికి రాత్రి అయింది!

ఆ అర్ధరాత్రి రెండింటికి కృష్ణమూర్తి, జానకి వచ్చారు!

వేదమూర్తిగారు ఊహించని విషయం అది!

కొడుకు ఒక్కడే వస్తాడనుకున్నారు కాని, జానకి కూడా వస్తుందనుకోలేదు! తల్లి శవం పక్కనే కూర్చుని ఏడుస్తున్న శ్రీదేవిని జానకి దగ్గరకి తీసుకుని ఓదార్చింది!

ఆ దృశ్యం చూసి సాయికృష్ణ, వేదమూర్తికి కళ్ళు చెమర్చాయి!

అంతసేపూ బిగపట్టుకున్నా కృష్ణమూర్తి కూడా కన్నీళ్ళు ఒక్కసారిగా బయటికి ఉబికాయి!

అక్కడి కార్యక్రమం అంతా పూర్తిచేసుకుని,

మర్నాడు రాత్రికి వెనుతిరిగారు అందరూ!

సాయికృష్ణ సాయంతో, శ్రీదేవి, అక్కడి సామాను, దుప్పట్లు అన్నీ విజయవాడకి పార్సిల్ చేసింది!

రెండు రోజులు ఉండి సాయికృష్ణ వెళ్ళిపోయాడు!

★ ★ ★

రోజులు నెమ్మదిగా గడుస్తున్నాయి!

శ్రీదేవి నెమ్మదిగా ఆ యింట్లో అలవాటు అవసాగింది! కాత్యాయనికి వంట పనిలో సాయంచేస్తూ, ఆకృతికి చదువు చెబుతూ వేదమూర్తిగారితో అపుడపుడు బజారుకి, హాస్పిటల్‌కి తోడువెళుతూ త్వరగానే ఆ యింట్లో కలిసిపోయింది!

వారం రోజులకే రాగచంద్రిక అమెరికా వెళ్ళిపోయింది!

అనుకున్నట్లుగానే వారానికల్లా.

అందరి మధ్యనా ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగాయి!

వేదమూర్తిగారికయితే సోమవారానికల్లా ఎనిమిది ఉత్తరాలు వచ్చాయి!

వేదమూర్తిగారు అందరికీ బదులిస్తూ ప్రతి ఉత్తరంలోనూ శ్రీదేవి గురించి ప్రత్యేకంగా రాశారు!

ఈలోపల ఒకసారి సాయికృష్ణ,

రెండుసార్లు భానుమూర్తి వచ్చివెళ్ళారు!

రెండువారాలకి అమెరికానుండి అన్ని కుటుంబాలకి ఉత్తరాలు అందాయి!

సత్యవతి పెళ్ళి జరిగిన రోజు ఫంక్షన్ నాడు,

సత్యవతి భారీ ఎత్తునే ఎరేంజ్‌మెంట్స్ చేసింది!

అందరికంటే ముందు వేదమూర్తి కాత్యాయని దిగారు వాళ్ళింట్లో వారితోపాటు శ్రీదేవి, ఆకృతి వెనక రిక్షాలో దిగారు!

అయితే అనుకున్నట్లుగానే అందరూ రాలేదు!

కృష్ణమూర్తి ఇంటినుండి ఎవరూరాలేదు!

సూర్యనారాయణ ఇంటినుండి సూర్యనారాయణ, చకిత వచ్చారు!

విశాఖపట్టణంనుండి అర్పిత,

రాజమండ్రినుండి భానుమూర్తి, ప్రమీల వచ్చారు!

ఇప్పుడు వాళ్ళిద్దరే అవడంతో, ఎక్కడ ఎవరు పిలిచినా తప్పక హాజరవుతున్నారు! అంతకుమించిన కాలక్షేపం వారికి మరొకటి దొరకటంలేదు!

మొత్తంమీద అక్కడ కూడా, సరదాగా, కబుర్లతో అందరూ కలిసిపోవడమే కాక శ్రీదేవిని కూడా కలుపుకున్నారు!

అందరికి బట్టలు కొనేటపుడు సత్యవతి గుర్తుంచుకుని మరీ శ్రీదేవికి కూడా చీర

తీసుకుంది!

ఆరాత్రి అనుకోకుండా,

మళ్ళీ వేదమూర్తిగారు ఛాతీలో నొప్పితో చాలాసేపు బాధపడ్డారు!

మంచంమీదనే అటూఇటూ దొర్లారు!

కాని ఎప్పటిలా వేళ తప్పి తినడం ప్రయాణపు బడలిక వలన అని సరిపెట్టుకో లేదు.

మొట్టమొదటిసారిగా భయంవేసింది!

తెలియని ఒంటరితనంతో ఫీలయ్యారు!

కాని ఎందుకో ఎవరినీ లేపలేదు ఆయన! పనుల బడలికతో ఆదమరిచి నిద్రపోతున్న వాళ్ళని డిస్టర్బ్‌చేసి కంగారుపెట్టదలచుకో లేదు.

ఆరాత్రి అంతా మౌనంగా బాధని భరిస్తూ ఉండిపోయారు!

మర్నాడు ఉండమని సత్యవతి గొడవచేసినా ఆయన ఉండలేదు!

బయలుదేరబోతుంటే నిష్ఠూరంగా అన్నది.

“అయినా ఇపుడు అంత కొంపలు మునిగిపోయేటంత పనులు, బాధ్యతలు ఏమున్నాయని ఆ పరుగులు? నువ్వయినా చెప్పు వదినా!”

కాత్యాయని పెదవి విప్పలేదు కాని, వేదమూర్తిగారు అన్నారు గంభీరంగా!

“ఇపుడు నా భుజస్కంధాలమీదన పెద్ద బాధ్యతే ఉన్నది సత్యవతి!”

“బాధ్యతా? ఏమిటది? ” ప్రమీల అడిగింది!

నెమ్మదిగా అన్నారు “శ్రీదేవి పెళ్ళి!”

బ్యాగ్ సర్దుతూ, ప్రయాణానికి సిద్ధం అవుతున్న శ్రీదేవి ఉలిక్కిపడి తలెత్తింది.



క్షణంసేపు అందరి దృష్టి శ్రీదేవి మీదపడి, మళ్ళీ ఆయనవైపు సారించారు!

“అన్నింటికంటే పెద్ద బాధ్యత! నా ఒక్కడిదే కాదు. మీరు కూడా దయచేసి ఎంక్వయిరీ చేయండి! ఇది సమిష్టి బాధ్యత!”

ఖచ్చితంగా చెబుతున్న ఆయనకి ఎవరూ సమాధానం చెప్పలేదు!

అలాగేనని తలలూపి ఉండిపోయారు!

వేదమూర్తిగారు, కాత్యాయని, ఆకృతి, శ్రీదేవి వెళ్ళిపోయారు!

వెళ్ళగానే వేదమూర్తిగారు ముందర డాక్టరు దగ్గరికి వెళ్ళారు!

తర్వాత పెళ్ళిళ్ళ పేరయ్య దగ్గరికి వెళ్ళారు!

ఆయన భయమల్లా ఒకటే,

ఆ అమ్మాయి విషయంలో తను తీసుకున్న నిర్ణయం శ్రీదేవి భవిష్యత్ పాలిట శాపం కాకూడదు!

శ్రీదేవి పెళ్ళి గురించి అందరూ పట్టించుకుంటారనే నమ్మకం లేదు!

ఆ ఫీలింగ్స్ వాళ్ళ మొహాలే చెబుతున్నాయి!

తను పోయేలోగా ముఖ్యమయిన ఈ బాధ్యత తీర్చుకోవాలి!

అపుడే తనకి తృప్తి!

ఆయన అంతటితో ఊర్కోలేదు! వారానికొకసారి కృష్ణమూర్తికి ‘శ్రీదేవి’ పెళ్ళి గురించి హెచ్చరిస్తూ ఉత్తరాలు రాస్తూనే ఉన్నారు!

నెలకొకసారి ఎవరో ఒకరి ఇంటికి సతీసమేతంగా వెళ్ళి వస్తూనే ఉన్నారు!

కూతురి పెళ్ళి బాధ్యతకంటే ఎక్కువ బాధ్యతగా భావిస్తున్నారాయన!

అందుకే ఎంతోమందిని కలిశారు!

సంబంధాలకోసం తిరుగుతున్నారు!

మధ్యమధ్యలో సత్యవతి అయిదారు

పేజీల ఉత్తరాలు ఏకబిగిన రాసిపడేస్తోంది!

రెండు మూడుసార్లు వచ్చి వెళ్ళింది కూడా!

ఈ రెండుమూడు నెలల్లోనే వేదమూర్తిగారిలో చెప్పలేని మార్పు వచ్చింది!

ఎక్కువగా సంబంధాలకోసం తిరగడం, అధిక శ్రమ, మనసులో దిగులు ఆయన ఆరోగ్యంమీద బాగా దెబ్బతీశాయి!

రెండు నెలలలోనే బాగా చిక్కినట్లుగా అయి కృశించిపోయారు!

ఆయన పరిస్థితి చూస్తుంటే కాత్యాయనికి మనసులోనే భయం వేస్తోంది!

పైకి చెబితే ఏమంటారోనని లోలోపలే ఆ బాధని దిగమింగుకుంటోంది!

మధ్యలో ఒకసారి గౌరీమనోహరి వచ్చి తండ్రి ఆరోగ్యం గురించి మరీమరీ హెచ్చరించిది!

రోజులు మామూలుగానే గడుస్తున్నా,

అక్కడక్కడా చిన్నచిన్న మార్పులు కూడా చోటుచేసుకుంటున్నాయి!

వినీల్ లో హఠాత్తుగా గొప్పమార్పు రాకపోయినా మరీ ఇదివరకులా కాక కాస్త పెందరాడే ఇంటికి వస్తున్నాడు!

అపుడపుడు తల్లితో మాట్లాడుతున్నాడు! చెల్లెలు చదువు గురించి ఎంక్వయిరీ చేస్తున్నాడు!

అన్నింటికంటే ఆ యింట్లో వచ్చిన ముఖ్యమయిన మార్పు,

హైదరాబాదు వెళ్ళగానే కృష్ణమూర్తి 'స్టార్ టి.వి. కనెక్షన్' తీసేశాడు! మొదటి వారం రోజులు ఏమీ తోచనట్లు, పిచ్చెక్కినట్లు అన్పించింది వికితకు!

తర్వాత నెమ్మదిగా అలవాటయిపోయింది.

కృష్ణమూర్తి బ్యాంకు పనిమీద ఖాజీపేటకి వెళ్ళినపుడు వరంగల్ లో తమ్ముడి ఇంటికి వెళ్ళి ఒకపూట ఉండివచ్చాడు!

సూర్యనారాయణ వరంగల్ కి వెళ్ళగానే చేసిన మొదటిపనులు,

లెండింగ్ లైబ్రరీలో మెంబర్‌షిప్ కట్ చేయడం,

చరితచేత ప్రయివేటుగా డిగ్రీకి అప్లయిచేయించడం!

విశాఖపట్టణంలో,

గౌరీ మనోహరి ఇంట్లో కూడా చిన్న మార్పు తొంగిచూసింది!

పనిమనిషిచేత వంట మాన్పించి ఆ బాధ్యత అర్పిత తీసుకుంది!

అప్పటినుండి ఆ యింట్లో వంట ఎంతో రుచిగా ఉండటమే కాదు, గౌరికి ఎంతో రిలీఫ్‌గా కూడా అన్పిస్తోంది!

భానుమూర్తి పెందరాడే ఇంటికి రావడం అలవాటు చేసుకున్నాడు! షేర్ బిజినెస్ కొంచెం తగ్గించాడు!

ఈ మధ్యలోనే,

చకితకి 'ఓణీల పేరంటం' చేసి అందరిని పిలిచింది సులోచన!

అందరికంటే ముందున్నారు వేదమూర్తి దంపతులు!

"ఇంత అనారోగ్యంతో అంతదూరం ప్రయాణం చేయలేరు వద్దండీ" అంటూ కాత్యాయని చెప్పినా ఆయన వినలేదు!

"పిచ్చిదానా! అందరిలోనూ ఆ "మూవ్‌మెంట్" తెచ్చింది మనము! ఆ మార్పుకి కారకులం మనం! అటువంటి మనమే గైర్హాజరు అయితే మిగతావారికి స్ఫూర్తి ఎవరు? ఈ వయసులో కూడా ఉత్సాహంగా ఎటెండ్ అవుతున్న మనల్ని చూసి అందరూ నేర్చుకోవాలి! తెలిసిందా! అయినా ఇపుడు మనం ఇంటిదగ్గర చేసే పనులేమున్నాయని! ఆకృతికి పరీక్షలంటే శ్రీదేవి తోడు ఉండనే ఉందిగా!"

"ఏమోబాబూ! చెప్పినా వినరు! మీ ఆవేశంమీదే! మీ ఆరోగ్యం గురించి నా భయం నాది!"

"కాత్యాయనీ! నీ బాధ నాకు తెలుసు కాని ఇంత రెస్ట్‌లెస్‌గా ప్రయాణాలు చేస్తున్న నా ప్రయాణాల వెనక నా స్వార్థం కూడా ఉంది! ఎక్కడయినా మంచి సంబంధం కుదురుతుందేమోనని ఆశ అంతే" తేలికగా నవ్వుతూ చెప్పినా ఆ మాటల వెనకాల ఉన్న బాధ, దిగులు చూసి మనసులోనే కుంగిపోయింది కాత్యాయని!

"ఏమండీ! ఏమిటీ వయసులో మనకీ బాధ్యత!"

"హు! పిల్లల్ని కన్నప్పుడే వాళ్ళ పాపపుణ్యాలకి మనమే బాధ్యులవుతాము. ఇక బాధ్యతలనుండి ఎలా తప్పించుకుంటాము!"

"ఏమోనండీ, నాకేదో భయంగా ఉంది!"

"అందుకేగా అందరి మధ్యనా గడపమనేది!" భార్య వీపు తట్టారు!

అందరూ చకితకు లంగా, ఓణీలు చదివించారు!

ఫంక్షన్ అయిపోయిన మర్నాడు,

గౌరీ మనోహరి వెళుతూ అన్నది "చరిత ఎందుకో మరీ నీరసంగా ఉంటోంది! నాతోపాటు తీసుకెళ్ళి వారంరోజులు ఉంచుకుని ట్రీట్‌మెంట్ ఇచ్చిపంపిస్తాను!"

గౌరి ప్రపోజల్‌కి ఎవరూ అభ్యంతరపెట్టలేదు!

చరితకి కూడా అర్పితని చూడాలని ఉంది!

అనుకున్నట్లుగానే గౌరితో చరిత విశాఖపట్టణం వెళ్ళింది!

ఈ మధ్యలో,

రాజమండ్రిలో ఏదో సంబంధం ఉందని తెలిస్తే వేదమూర్తిగారు రాజమండ్రి వెళ్ళి తమ్ముడి ఇంట్లో ఒక రోజల్లా గడిపి వచ్చారు!

వేదమూర్తిగారి వత్తిడితో కృష్ణమూర్తి కూడా సంబంధాల గురించి అక్కడక్కడా ఎంక్వయిరీ చేయడం మొదలెట్టాడు!

మొదట్లో అతను చెప్పే వివరాలు, పెళ్ళి సంబంధాల విశేషాలు, ముభావంగా వినే జానకి క్రమంగా ఆసక్తి చూపడం మొదలెట్టింది!

చరిత విశాఖపట్టణంలో ఉన్న రోజుల్లో,

ఒకరోజు అందరూ కలిసి టాక్సీ తీసుకుని సింహాచలం వెళ్ళివచ్చారు!

సాయికృష్ణ నెలకొకసారి విజయవాడ వచ్చి మామయ్య ఆరోగ్యం కనుక్కొని వెళుతున్నాడు!

పనిమీద హైదరాబాదు వెళ్ళినపుడు కృష్ణమూర్తి ఇంటికి వెళ్ళి ఆరోజంతా ఉన్నాడు!

ఆ రాత్రి వినీల్, వికిత, సాయికృష్ణ కలిసి సినిమాకి వెళ్ళివచ్చారు!

సంక్రాంతికి,

అమెరికానుండి రాగచంద్రిక అందరికీ గ్రీటింగ్స్ పంపిస్తే,

అందరూ రాగచంద్రికకి గ్రీటింగ్స్ పంపించారు!

సంక్రాంతి సంబరాన్ని ఉత్తరాలద్వారా పంచుకుని, శుభాకాంక్షలందచేసుకున్నారు అందరూ!

ఈలోపల,

వేదమూర్తిగారు శ్రీదేవికి మూడు సంబంధాలు చూశారు!

వాళ్ళు వచ్చి చూసివెళ్ళారు!

కాని, ఒకటి మంచి ఉద్యోగం కాకపోవడంవలన, మరొకరికి మంచి అలవాట్లు లేకపోవడం వలన వేదమూర్తిగారు కాన్సిల్ చేస్తే,

కట్నం చాలలేదని మరొకరు తిరస్కరిం

చారు.

ప్రతి ఒక్కరి జీవితాలూ సాఫీగా,

కొద్దిపాటి మార్పులతో హాయిగా,

కొన్ని సమస్యలు తీరి ఇంతక్రితం కంటే మెరుగ్గా,

జరిగిపోతున్నాయని అందరూ, అన్ని కుటుంబాలవారు అనుకుంటున్న సమయంలో, పిడుగు పాటులా జరిగింది ఆ సంఘటన!

ఎవరూ ఊహించని, కలలో కూడా నమ్మని భయంకరమయిన సంఘటన అది!

వినీల్ ఆత్మహత్య!!!

ఆ వార్త వింటూనే వేదమూర్తిగారు చిగురుటాకులా కంపించి పోయారు!

ఆ వార్త వినగానే గుమ్మం దగ్గరే కూలబడి బావురుమంటున్న కాత్యాయనిని ఓదారుస్తూ దగ్గరకు తీసుకుంది శ్రీదేవి!

బిక్కమొహం వేసుకుని నిలబడింది ఆకృతి!

వెంటనే లేచింది శ్రీదేవి! క్షణం కూడా ఆలశ్యం చేయకుండా చేతికందిన బట్టలు సూట్ కేస్‌లో సర్ది, ఇల్లు తాళంవేసి టాక్సీ మాట్లాడింది!

ఉదయం పది గంటలకు బయలుదేరిన టాక్సీ సాయంత్రం నాలుగింటికల్లా ఆ అపార్ట్‌మెంట్ ముందు ఆగింది!

కింది గ్రౌండ్‌ఫ్లోర్‌లో, జనం మూగి ఉన్నారు!

వాళ్ళని తప్పించుకుంటూ ముందుకు నడిచిన వేదమూర్తిగారు గుండె ఆగిపోయినట్లుగా నోటికి చేయి అడ్డంపెట్టుకుని బ్రాన్పడిపోయి నిలబడిపోయారు!

ఎదురుగా,

గట్టుమీద పడుకోబెట్టి ఉంది వినీల్ శవం!

తండ్రిని చూస్తూనే కృష్ణమూర్తి పసిపిల్లవాడిలా తండ్రిని చుట్టేసుకుపోయి ఒక్కసారిగా రోదించాడు "నాన్నా, నాన్నా! వినీల్ మన వినీల్!"

ఆ షాక్‌కి జానకి స్పృహ తప్పిపోయింది ఇంకా తేరుకోలేదు! అలాగే కోమాలో ఉండిపోయింది!

వెక్కివెక్కి ఏడుస్తున్న వికితని సులోచన దగ్గరకి తీసుకుని ఓదారుస్తోంది!

ఒక్కొక్కరే రాసాగారు!

భానుమూర్తి దంపతులు,

సత్యవతి ఫ్యామ్లీ,

గౌరీమనోహరి ఫ్యామ్లీ,

అందరికీ వినీల్ శవాన్ని చూడగానే- ఒక్కసారిగా గుండెలాగిపోయినట్లయినాయి. నిద్రపోతున్నట్లుగా ప్రశాంతంగా ఉంది వినీల్ ముఖం!

సాయికృష్ణ ఆ నిజాన్ని నమ్మలేకపోతున్నాడు.

నెలరోజుల క్రితమేగా- తనూ, వినీల్, వికిత పక్కపక్కన కూర్చుని సినిమా చూసింది. సినిమా మధ్యలో వినీల్ కబుర్లు, జోక్స్

ఆ సంఘటనలు తలుచుకుంటూ ఉంటేనే- కడుపులోనుండి ఏడుపు తన్నుకు వస్తోంది.

వినీల్- ఏం కష్టం వచ్చిందని ఇంతపని చేశావయ్యా?

నిన్ను- ఎవరేమన్నారని ఇంత అఘాయిత్యానికి పూనుకున్నావు?

కృష్ణమూర్తినయితే పట్టశక్యం కాకున్నది.

కొడుకు శవాన్నే ఒడిలో పెట్టుకుని పొరిలి పొరిలి ఏడుస్తుంటే- వికిత తండ్రి భుజంమీద వాలిపోయి వెక్కి వెక్కి ఏడుస్తోంది.

ఆ దృశ్యం చూస్తున్న అందరి

హృదయాలు బరువెక్కాయి.

అందరి కనులముందర వినీల్ 'బ్రేక్ డాన్స్' దృశ్యమే కన్పిస్తోంది.

పాములా మెలికలు తిరుగుతూ, స్ప్రింగ్‌లా ఎగిరెగిరి డాన్స్ చేసిన శరీర మేనా ఇలా అచేతనంగా పడివుంది.

వేదమూర్తిగారు అక్కడే కుప్పకూలిపో యారు.

శ్రీదేవి వచ్చి వికితని బలవంతంగా పక్క కులాగింది. వికిత వెంటనే శ్రీదేవిని కరుచు కుపోయింది.

ఏడుపుల మధ్యన చెప్పింది సులోచన!

"ఎప్పటిలాగే- రాత్రి భోజనంచేసి గది లోకి వెళ్ళి తలుపేసుకుని పడుకున్నాడట. అంతే! ఈరోజు ఉదయం పన్నెండయినా తలుపులు తెరుచుకోపోయేసరికి జానకి అక్కయ్యకి అనుమానం వచ్చి తలుపులు బాదినా ప్రయోజనం లేకపోతే- వెంటనే కంగారుపడి బ్యాంక్‌కి ఫోన్ చేసిందిట. అందరూ వచ్చి తలుపులు విరగకొడితే ఇదిగో ఇదీ పరిస్థితి! పక్కనే స్లీపింగ్ పిల్స్ పడిఉన్నాయట"

"భగవంతుడా!" నుదురు కొట్టుకున్నారు.

అంత బలవంతంగా ప్రాణాలు తీసుకోవా ల్సిన ఖర్మ ఏం పట్టిందిరా తండ్రీ అని రోదించారు.

ఇంతలో- పక్క పోర్షన్‌లో ఆయన వచ్చి నెమ్మదిగా చెప్పారు.

"మీ వాళ్ళందరూ వచ్చారంటున్నారు కాబట్టి ముందు శవాన్ని కదిలించే ఏర్పాటు చేయండి. ఈ న్యూస్ కాంపౌండ్ దాటక ముందే త్వరపడండి. లేదంటే అనవసరంగా పోలీసు కేసు, న్యూసెన్సు! పోయిన మనిషి ఎలాగూ తిరిగిరాడు. మనకి అనవసరమ యిన టార్చర్ మిగులుతుంది"

అక్కడున్నవారికీ అదే నిజమనిపించింది.

శవాన్ని కదిలిస్తుంటే- కృష్ణమూర్తి భోరు భోరున ఏడ్చాడు.

అతని ఆఫీసు కొలీగ్స్ కాబోల్ను. "కృష్ణా! ఒరేయ్! ఊర్కోరా" అంటూ వెనక్కి లాగారు.

కొడుకుని తలచుకుని, తలచుకుని, పొదిలి పొదిలి ఏడుస్తున్నాడు కృష్ణమూర్తి.

ఆఖరుకి వేదమూర్తిగారే గుండె రాయి చేసుకుని - కృష్ణమూర్తిని ఇవతలకి లాగి తన గుండెల్లో దాచుకుంటే-

మిగతావారు అశ్రునయనాలతో శవాన్ని కదిలించారు.

జానకి- కోమాలోనుండి స్పృహలోకి వచ్చే సరికే అంతా అయిపోయింది.

ఇల్లే శ్మశానంలా ఉంది.

ఎక్కడి వారక్కడ- వడలిపోయిన ముఖా లతో పడివున్నారు.

ఎందుకు- వినీల్ ఆత్మహత్య చేసుకున్నా డనే శేషప్రశ్న ప్రతి ఒక్కరినీ తొలుస్తోంది.

"ఇప్పుడు తెలుసుకుని ప్రయోజనం ఏముంది? నా వినీల్ తిరిగిరాడుగా" విర క్తిగా అన్నాడు కృష్ణమూర్తి.

సూర్యనారాయణ, మోహన్, సాయికృష్ణ కలిసి వినీల్ గది అంతా వెతికారు. అతని డైరీలోకాని, ఎక్కడా అనుమానించదగిన వస్తువులు ఏమీ కన్పించలేదు.

ఎంక్వయిరీ చేద్దామంటే-

అసలు అతని స్నేహితులెవరో ఎక్కడ ఉంటారో కూడా తెలియదు.

కాలేజీకి వెళ్ళి ఎంక్వయిరీ చేసినా ఎవరూ సరియైన కారణం చెప్పలేకపోయారు.

సాయికృష్ణ మళ్ళీ అనుమానంతో- వినీల్ గది అంతా వెతికాడు.

ప్రతి పుస్తకంలోని పేజిపేజి తిరగేశాడు.

పుస్తకాల దొంతరల మధ్య తమ వాళ్ళం

దరూ పంపిన సంక్రాంతి గ్రీటింగ్స్ పెట్టి ఉన్నాయి.

వాటినన్నింటిని తిప్పుతూ ఉంటే-

తమ అందరివీ కాక మరో వ్యక్తి అడ్రెస్‌తో ఉన్న గ్రీటింగ్ కన్పించింది.

అడ్రస్ చూశాడు సాయికృష్ణ!

మలక్‌పేట! గ్రీటింగ్ పంపిన వ్యక్తి పేరు అమానుల్లా.

క్షణం ఆలస్యం చేయలేదు సాయికృష్ణ.

పరుగులాంటి నడకతో కిందకి వచ్చి ఆటో ఎక్కాడు.

దాదాపు ఇరవయి నిముషాల తర్వాత-

అమానుల్లా గదిలో ఉన్నాడు సాయికృష్ణ!

వినీల్ గుర్తుకురాగానే అమానుల్లా కళ్ల తడి అయ్యాయి. చాలాసేపు ఆలోచిస్తూ ఉండిపోయి- తర్వాత చెప్పాడు. ఒక్కొక్క నిజం బయటపెడుతూ.

"నిజానికి వినీల్ చాలా మంచి కుర్రాడు! నాకు మంచి దోస్త్! వినీల్‌కి ఎంతో దగ్గరయితే తప్ప అతనిలోని మంచితనం గుర్తించలేం. కాని ఎలా పరిచయమయ్యారో తెలియదుకాని- చెడుస్నేహాలు అలవాటు చేసుకున్నాడు. దానితో కాలేజి ఎగ్గొట్టి సినిమాలు, షికార్లు తిరగడం అలవాటు చేసుకున్నాడు. క్రమేపి డ్రింక్స్‌కి కూడా అలవాటుపడి స్నేహితులతో తరచు బార్‌లలో గడుపుతూ పచ్చాడు. దానితో అమ్మాయిలతో స్నేహాలు కూడా ముదిరాయి. గర్ల్‌ఫ్రెండ్స్‌ని వెంట వేసుకుని గండిపేట వెళ్ళిరావడం నాకు తెలుసును. ఎందుకో- తాతయ్యగారింట్లో ఏదో ఫంక్షన్ ఉందని ఆమధ్య విజయవాడ వెళ్లివచ్చాడు. అప్పటినుండి వినీల్ అలవాట్లలో చాలా మంచి మార్పు వచ్చింది. కాని అతని దురదృష్టం మృత్యువు రూపంలో పొంచి ఉన్నట్లుంది. వినీల్ గర్ల్‌ఫ్రెండ్‌కి- అతని మూలంగా నెల తప్పింది. కాని ఆ అమ్మాయి సాధారణమయిన పిల్ల కాదు, పెళ్లిచేసుకోకపోతే అల్లరి పెడతానన్నది. గొడవ చేస్తానని బెదిరించింది. ఆఖరుకి అతనితో తనకి పెళ్లి ఏర్పాటు చేసేలా గూండాలని కూడా ఆశ్రయించింది.

ఈ వారం రోజులూ వినీల్ అన్నం నీళ్లు మానేసి ఎంత నరకయాతన అనుభవించాడో నాకు తెలుసు!

ఎందుకంటే భయంతో నా రూమ్‌లోనే తలుపులు వేసుకుని ఎటువైపునుండి ఎవరు వస్తారోనని అనుక్షణం భయంతో గడిపాడు.

ఇంతటితో తీరిపోలేదు వినీల్ కష్టాలు.

తాగుడికి అలవాటుపడిన రోజులలో రోజూ పెట్టే విపరీతపు, విలాసపు ఖర్చులకి విపరీతంగా బయట అప్పులు చేశాడు. ఆ అప్పులు వడ్డీలతో తడిసి మోపెడయ్యాయి.

వారంలో- అప్పులన్నీ తీర్చకపోతే ఖతం చేస్తామని అప్పులు ఇచ్చినవాళ్లు ప్రతిరోజూ ఫోన్‌కాల్స్, బెదిరింపులు!

అంతేకాదు- వాళ్ళు కూడా వాళ్ళ చేతులలోని రౌడీలని ప్రయోగించారు.

అంతే-

ఒకవైపు గర్ల్‌ఫ్రెండ్ నియమించిన గూండాల భయంతో-

మరోవైపు అప్పులవాళ్ళ బెదిరింపులతో-

ప్రతిక్షణం మానసిక క్షోభని అనుభవించాడు.

ఇంట్లో చెప్పలేక బయటికి చెప్పలేక నరకయాతనకి గురిఅయ్యాడు.

చివరికి విపరీతమయిన డిప్రెషన్‌కి గురి అయి ఈ మెంటల్ టార్చర్‌ని భరించలేక ఈ పనిచేసినట్లున్నాడు వినీల్.

వినీల్ మంచి ధైర్యవంతుడు.

కాని- ఇంత తేలికగా ప్రాణాలు తీసుకుంటాడని కలలో కూడా అనుకోలేదు.

నాకు ఏమాత్రం అనుమానం కలిగినా- నా గదిలోనుండి బయటపడనిచ్చేవాడినే కాదు"

గొంతు గద్గదిక మవుతుంటే పూర్తిచేశాడు అమానుల్లా.

నిశ్చేష్టుడిలా వింటూ ఉండిపోయాడు సాయికృష్ణ!

గంటతర్వాత-

కృష్ణమూర్తి ఇంటిలో-

ఈ కారణం వింటూనే- గొల్లుమన్నది జానకి!

కుప్పకూలిపోయాడు కృష్ణమూర్తి!

చెప్పకూడదనుకుంటూనే బయట పెట్టేశాడు సాయికృష్ణ.

సాయికృష్ణ చెబుతున్నంతసేపు పడక్కుర్చీలో కళ్లు మూసుకుని పడుకున్న వేదమూర్తి- చెప్పటం ఆపగానే కళ్లు తెరిచారు.

వేదమూర్తిగారు రెండు రోజులు ఉండి బయలుదేరపోతుంటే శ్రీదేవి అంది.

"తాతయ్యా!"

"ఏమ్మా"

"నేను ఇప్పుడు మీతో రావడంలేదు. ఇప్పుడు ఈ ఇంట్లో నా అవసరం ఎంతో ఉంది"

డీలా పడిపోయిన కృష్ణమూర్తిని, మంచ మెక్కిన జానకిని, దిగులుపడిపోయిన వికితని చూస్తుంటే- ఆయనకు అదే నిజమనిపించింది.

శ్రీదేవిని అక్కడే వదిలి మిగతా ముగ్గురు భారమయిన హృదయాలతో విజయవాడ బయలుదేరారు.

★ ★ ★

వారం రోజుల తర్వాత శ్రీదేవి వ్రాసిన ఉత్తరంతో కాస్త తేలికగా ఊపిరి పీల్చుకున్నారు వేదమూర్తి.

శ్రీదేవి సాహచర్యంతో- ఆ కుటుంబసభ్యులు కాస్త కోలుకుని, మామూలు ప్రపంచంలో పడుతున్నారని వ్రాసింది.

ఎలాగయినా ఈ షాక్‌నుండి కృష్ణమూర్తి బయటపడ్డాడు. వేదమూర్తిగారు బయటపడలేదు. అదే తేడా!

కాని- ఆ దిగులు, మనసుపడే టెన్షన్- ప్రతిక్షణం గుర్తుచేసే బాధ్యతా ఆయన ఆరోగ్యాన్ని క్రమేపీ క్షీణింపజేస్తోంది.

ఆ తేడా ఆయనకే తెలుస్తోంది.

ఏ క్షణాన్నయినా దాటిపోతానేమోననే భయం పట్టుకుంది ఆయనకి!

డాక్టర్ గట్టిగా హెచ్చరించాడు. ఈ వయసులో మనసు ప్రశాంతంగా ఉంచుకుని, రెస్ట్ తీసుకోకపోతే- హార్ట్ ఎటాక్ వచ్చే సూచనలు బాగా కన్పిస్తున్నాయని- ఎంతగానో చెప్పాడు.

మనసులోనే విరక్తిగా నవ్వుకున్నారు!

మౌనంగా- డాక్టరు వ్రాసి ఇచ్చిన మందులు మింగుతున్నారు. అంతేకాని, కాత్యాయిని దగ్గర ఆరోగ్యప్రస్తావన మాత్రం తేవడం లేదు.

ఆయన ప్రవర్తన చూస్తుంటే ఎందుకో అనుమానం కలుగుతోంది కాత్యాయనికి! వేదమూర్తి తిరుగుతున్నారు. ఎన్నో సంబంధాలు ఎంక్వయిరీ చేస్తున్నారు.

ఒక్కొక్కరి సమాధానం వింటూవుంటే మనసుతోపాటు మనిషి కూడా డీలాపడిపోతున్నారు.

భోజనాల దగ్గర ఇదివరకటి సరదా లేదు, కబుర్లు లేవు.

ఎప్పుడూ గదిలో పడుకుని ఏవో ఆలోచనలు!

భార్య కల్పించుకుని అడిగినా ముక్తసరిగా సమాధానాలిస్తున్నారు.

ఆయనకు శ్రీదేవి పెళ్లి ఒకవైపు, మరో వైపు తన ఆరోగ్య పరిస్థితి- విపరీతంగా కుంగదీస్తున్నాయి.

హైదరాబాదునుండి వచ్చిన రాత్రి అయితే గుండెల్లో వచ్చిన నొప్పితో ఊపిరి కూడా పీల్చుకోలేక విలవిల్లాడిపోయారాయన.

ఆయనకి అప్పుడు అర్థమయిపోయింది. మృత్యువు ఎంతో దూరంలో లేదని!

రెండు రోజుల అనంతరం.

కారుమబ్బులో కాంతి కిరణంలా.

గుడివాడలో చూసిన సంబంధం తాలూకు మధ్యవర్తి వచ్చాడు.

వాళ్లకి శ్రీదేవి నచ్చిందిట. మిగతా విషయాలు మాట్లాడుకోడానికి రమ్మని కబురు చేశారు.

నిజానికి వేదమూర్తి కూడా ఆ సంబంధం మీద ఎన్నో ఆశలు పెట్టుకున్నారు.

పిల్లవాడికి ఎల్.ఐ.సి.లో ఉద్యోగం. ఏ దురలవాట్లు లేని బుద్ధిమంతుడు! పైగా బాగా తెలిసిన కుటుంబం!

శ్రీదేవిని చూసి వెళ్ళిన నెలరోజుల తర్వాత ఇప్పుడు కబురు చేశారు.

వేదమూర్తిగారిలో ఒక్కసారిగా వెయ్యి ఏనుగుల బలం వచ్చింది. ఉత్సాహంగా లేచి, వెంటనే రమ్మని కృష్ణమూర్తికి ఫోన్ చేశారు.

ఆ రాత్రి ఎనిమిదింటికల్లా కృష్ణమూర్తి ఆ ఇంట్లో ఉన్నాడు.

ఆ సంబంధం గురించి అన్ని వివరాలు విపులంగా చెప్పారు వేదమూర్తి.

తండ్రికి, శ్రీదేవికి నచ్చితే తన అభ్యంతరం ఏమీ లేదన్నాడు కృష్ణమూర్తి.

వాళ్లు అడగబోయే కట్నం విషయంలో కూడా వేదమూర్తిగారు ముందరగానే సిద్ధం అయ్యారు.

శ్రీదేవి తల్లి శారద ముందరనుండి శ్రీదేవి పేరున బాంకులో వేసిన డబ్బు వడ్డీతో కలిసి యాభయివేలువరకూ ఉంది.

కృష్ణమూర్తి ముప్పయివరకూ ఇస్తానన్నాడు.

వేదమూర్తిగారు తన ప్రావిడెంట్ ఫండ్ తాలూకు ఎమౌంట్ నుండి పాతికవేలు తన పెద్ద మనవరాలు 'శ్రీదేవి' పేరున సిద్ధం చేశారు.

మర్నాడు ఉదయమే తండ్రీ కొడుకులు గుడివాడ వెళ్ళి అన్ని విషయాలు మాట్లాడుకున్నారు.

పెళ్లికొడుకు తల్లిదండ్రులు కట్నం విషయంలో పెద్దగా పట్టు పట్టలేదు.

కృష్ణమూర్తి మొదటినుండి అన్నిచోట్ల శ్రీదేవి తన మొదటి భార్య కూతురని చెబుతూ వస్తూ ఉండటంతో ఎక్కడా ఎలాంటి ఇబ్బంది ఎదురవలేదు.

వారు అనుకున్న రేంజ్ లోనే కట్నకానుకలు నిర్ణయించుకుని భారం దిగిన మనసులతో తిరుగుప్రయాణమయ్యారు.

పెళ్లివారు పెళ్లి విజయవాడలో జరిపించాలనీ, అదీ నెలరోజుల లోపల అయితే బాగుంటుందని సూచించారు.

వేదమూర్తిగారు వారి సూచనమేరకు పురోహితుడిని పిలిపించి నెలరోజుల లోపలే మంచి ముహూర్తం నిర్ణయించారు.

డేట్ ఫిక్స్ కాగానే వెంటనే కల్యాణ మండపం బుక్ చేసేశారు.

ఇక ఆగలేదు ఆయన!

ముహూర్తం మూడువారాల్లోకి వచ్చింది.

రోజంతా కూర్చుని అందరికీ ఉత్తరాలు రాసిపడేశారు.

శుభలేఖలు ప్రింటింగ్ కి ఇచ్చారు.

పురోహితుడిని, వంట మనిషిని మాట్లా

డారు.

సన్నాయి వారిని సంప్రదించారు.

ఇల్లంతా సున్నాలు కొట్టించారు.

కాత్యాయని హెచ్చరిస్తూనే ఉంది. "వద్దండీ హైరాన వద్దండీ! నా మాట వినండి"

"చాలారోజుల తర్వాత మన ఇంట్లో జరుగుతున్న వివాహమే ఇది" అంటూ భార్య మాటను కొట్టిపారేశారు.

ఆయనకు తెలుసు-

ఈ సంతోషాన్ని అనుభవించేది కొద్దిరోజులేనని!

ఈ ఆనందం మిగిలేది చాలా తక్కువ సమయమేనని.

అందుకే-

నీరసాన్ని ఆయాసాన్ని బలవంతాన అదిమిపెట్టి ఉత్సాహాన్ని ప్రదర్శిస్తున్నారు.

చూస్తుండగనే-

పెళ్లివారం రోజుల్లోకి వచ్చింది.

వారంరోజుల ముందరే కృష్ణమూర్తి, జానకి, వికిత, శ్రీదేవి వచ్చారు.

జానకి ఇంట్లో అడుగుపెడుతూనే "అత్తయ్యా" అంటూ కాత్యాయనిని అల్లుకుని పోయి ఏడ్చేసింది.

"ఊర్కో తల్లీ! ఊర్కో" అంటూ కాత్యాయని కోడలి భుజం తడుతూ ఓదార్చింది.

ఒక్కొక్కరే రాసాగారు.

ఒక్కొక్కరోజు ఒక్కో కుటుంబం దిగసాగింది.

అందరినీ చూస్తూ ఉంటే పట్టరాని ఆనందంగా ఉంది వేదమూర్తిగారికి.

పసిపిల్లవాడి సంబరంలా ఉంది ఆయన పరిస్థితి.

పెళ్లిరూపేణా అందరినీ ఆఖరుసారిగా కలుసుకుంటున్నాను అనే భావం మరీమరీ తలెత్తుతోంది.

ఆ ఆనందంతోనే ఆయన గుండె ఉప్పొంగిపోతోంది.

ఆ ఉద్విగ్నతతోనే ఆయన హృదయం పెరిగిపోతోంది.

అందరినీ ఒక్కసారి తనివితీరా కౌగలించుకోవాలని-

తనివితీరా స్పృశించాలని- అన్పిస్తోంది.

ఎవరేం చెప్పినా- ఈ ప్రపంచాన్నే ధిక్కరించాలనే వెర్రి ఆనందం కలుగుతోంది ఆయనకు.

బయట పనులన్నీ సాయికృష్ణ, సూర్యనారాయణ చూశారు.

ఇల్లంతా సందడి సందడిగా హడావిడిగా ఉంది.

జానకికి బాత్‌రూమ్‌ని చూడగానే వినీల్ తలంటి దృశ్యం గుర్తుకువచ్చి కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

కృష్ణమూర్తికి పొగడచెట్టు గట్టు చూడగనే వినీల్ బ్రేక్‌డాన్స్ గుర్తుకొచ్చి మనసు వికలమయిపోయింది.

పెళ్లి రేపనగా-

ముందరిరోజు- అందరి తరపు బంధువులూ రావడం మొదలెట్టారు. వాళ్ళ అందరి ఆలోచనా ఒకటే-

కృష్ణమూర్తి మొదటి భార్య కూతురు అనే "అక్రమ సంతానం" శ్రీదేవి- పెళ్ళి చూడాలని- ఎక్కడెక్కడివాళ్లు పిలిచిందే తడవుగా ప్రవాహంలా వచ్చారు.

అందరి కళ్లూ- పెళ్లికూతురు శ్రీదేవిమీదనే!

అందరి కబుర్లూ- ఆ అమ్మాయి పుట్టుక గురించే-

వింతగా, విచిత్రంగా, ఆశ్చర్యంగా, అద్భుతంగా కథలు కథలుగా చెప్పుకుంటూ ఆ

రాత్రి గడిపారు- బయటి బంధువులందరూ.

★ ★ ★

ఆరోజే శ్రీదేవి పెళ్లిరోజు...

ముహూర్తం ఉదయం పదకొండు గంటలకు. తెల్లవారు ఝామునే లేచారు అందరూ! తలంటి స్నానాలు చేశారు.

పొగడచెట్టు గట్టుమీద కూర్చున్న భజంత్రీలు 'ఎందరో మహానుభావులు' ఆలపిస్తున్నారు హృద్యంగా.

ఎనిమిదింటికల్లా రెడీ అయి ముందరగా పెళ్లికూతురు, జానకి, కృష్ణమూర్తి, సత్యవతి, గౌరి ఒక టాక్సీలో వెళ్లిపోయారు కల్యాణ మండపానికి.

తర్వాత.. ఒకరి తర్వాత ఒకరు అన్నట్లుగా బ్యాచెస్, బ్యాచెస్‌గా ఆటోలలో, రిక్షాలలో బయలుదేరారు.

అందరూ వెళ్లిపోయేసరికి పది అవుతోంది. భజంత్రీలు తొమ్మిదింటికే వెళ్లిపోయారు.

అపుడు... ఆ ఇంట్లో వేదమూర్తిగారు, కాత్యాయని ఇద్దరే మిగిలారు. ఎర్రపట్టుచీర కట్టుకుని ముడి నిండుగా మల్లెమాలతో మెడనిండుగా నగలతో పార్వతీదేవిలా కళకళలాడుతున్న కాత్యాయని వేదమూర్తిగారి దగ్గరకు వచ్చి అంది "అదేమిటీ మీరు రెడీ కారూ! అవతల ముహూర్తం దగ్గిరపడుతోందండి"

హాలు మధ్యలో పడక్కుర్చీలో పడుకున్న ఆయన ముందుకు లేచి చెప్పారు.

"వస్తున్నాను కాత్యా! ముందర నువ్వు పద! నాకు చిన్న పని ఉంది. అది పూర్తిచేసుకుని ఇంటికి తాళాలు వేసుకుని నీ వెనకే వస్తాను"

"సరే మీ ఇష్టం త్వరగా రండిమరి" అంటూ హడావిడిగా నడిచి వెళ్లిపోతుంటే ఒకసారి పిలిచారు వేదమూర్తిగారు.

"కాత్యా..." ఆర్ద్రతగా పలికింది ఆయన గొంతు. విచలిత అయినట్లుగా చూసింది కాత్యాయని ఆయన పిలుపుకి.

వెళ్లబోతున్నదల్లా ఆగి మళ్లీ వెనక్కు వచ్చి ఎదురుగా నిలబడి అడిగింది... "ఏమిటండీ"

ఇన్నాళ్లూ తనకు తోడునీడగా నిలిచి, ప్రతి క్షణం తన క్షేమమే కోరుకుంటూ, తన కష్ట సుఖాలలో సమానంగా పాలుపంచుకుంటూ, నిండుగా పండు ముత్తయిదువలా పార్వతీదేవిలా నిల్చున్న తన జీవిత సహచరిణిని కనుల నిండుగా చూసుకున్నారు.

ఇదే ఆఖరి చూపన్నట్లుగా తనివిదీరా, మనసుదీరా చూసుకున్నారు.

"ఏమిటండీ మీరు? ఏమయింది మీకు?" కంగారుగా అడిగింది.

చిరునవ్వు నవ్వారు. "ఏమీకాలేదు. జాగ్రత్త, ఒంటరిగా వెళుతున్నావు!"

"నాకేం భయమండీ!" అని ముందుకు అడుగేసింది.

గేటు తెరుచుకుని భార్య వెళ్లిపోయేటంత వరకూ రెప్పవేయకుండా అలాగే చూస్తుండిపోయారు.

ఒక్కసారిగా... ఇల్లంతా బావురుమన్నట్లుగా నిశ్శబ్దంగా అయిపోయింది. కుర్చీలో నుండి ముందుకి లేవడానికి ఆయత్తమవుతున్న వేదమూర్తిగారు అదిరిపడ్డారు.

ఆయన ఊహే నిజమవుతున్నట్లుగా మెదడుకి రకరకాల సిగ్నల్స్ అందుతున్నాయి.

★ ★ ★

పెళ్లిమండపంలో... వరుని పక్కన కూర్చుని ఉన్న శ్రీదేవి కళ్లు తాతయ్యకోసం వెతుకుతున్నాయి.

నాన్నా, జానకి పిన్ని, వినీత

కాత్యాయని అమ్మమ్మ, అందరూ తన

వారందరూ నవ్వు ముఖాలతో తమవైపే చూస్తున్నారు.

కానీ... ఆయనేరి? తాతయ్య ఎక్కడా? సత్యవతి అదే అడిగింది కాత్యాయనిని "వదినా అన్నయ్యేడి!"

"పని ఉంధని ఉన్నారు. ఈపాటికి బయలుదేరే ఉంటారు. ముహూర్తం టైము అవుతోంది కదా!"

★ ★ ★

ముహూర్తం టైము అవుతోంది. ఆయనకు అర్థం అయిపోయింది తనకు సమయం ఆసన్నమయింది.

రాత్రినుండి బిగపట్టి ఉంచిన బాధతో ఇపుడు గుండె నిండిపోయి మోయలేనంత బరువుగా ఉంది.

తాను ఏకాస్త బయటపడ్డా ఈ వాతావరణం, ఈ నవ్వులు, ఈ సంతోషం, అన్నీ విరిగిపోతాయి. పెళ్లే ఆగిపోతుంది. ముఖ్యంగా శ్రీదేవి తనను విడిచి పెళ్లిపీటల మీద కూర్చోదు. ఆ సంగతి తెలుసు వేద మూర్తిగారికి.

ముందుకు లేవాలంటే ఆయనకి శక్తికి మించిన పనిలా ఉంది. గుండెలో బరువయిన రాయిపడి ఊపిరికి అడ్డం వస్తున్నట్లుగా ఉంది.

శరీరం ఒక్కసారిగా తూలి ముందరి టేబుల్ మీదకి పడ్డారు.

క్షణంసేపు కళ్లు మూసుకుని అలాగే ఉండిపోయారు. శరీరమంతా చెమటతో తడిసిపోయి స్నానం చేసినట్లుగా అయిపోయింది. ఆయనకు ఎదురుగా ఉన్నది గ్రూప్ ఫొటో. అది ఆయన రిటైర్ అయేటపుడు, మాస్టర్లు, స్కూలు పిల్లలతో కలిసి తీయించుకుంది.

తన జీవితంలో అతి ముఖ్యమయిన ఘట్టాలు తన స్కూలు జీవితం.

మాస్టారుగా, హెడ్ మాస్టారుగా... మాస్టారూ అంటూ పిల్లలందరూ వీడ్కోలు చెబుతున్నట్లుగా అన్పిస్తోంది ఆయనకు.. అందరి కళ్లల్లోనూ కన్నీళ్లు.

ఇంటి బెల్లుకొట్టే టైమయింది.

"ఒరేయ్ పిల్లలూ! ఎందుకురా ఏడుస్తారు! నవ్వుతూ ఉండండి. హాయిగా ఉండండి"

ఆయన మనసు రకరకాలుగా పలవరిస్తోంది.

ఏవో సంఘటనలు ఏవో ఆలోచనలు... ఆయనను కుదిపి, కుదిపి పెడుతుంటే ఆయన దృష్టికి ఆపైనే తమ కుటుంబ సభ్యులు అందరూ కలిసి ఆరు నెలల క్రితం తీయించుకున్న గ్రూప్ ఫొటో కన్పించింది.

ఆయన ఆనందానికి, పట్టపగ్గాలు లేకుండాపోయింది.

అందరినీ కలపాలని అందరి మధ్యనా అనుబంధానికి వారధి కట్టాలని ఎంతగా తపించిపోయాడు.

ఆ కల నిజమయినట్లుగా మనసు తృప్తిగా నిట్టూరుస్తుంటే ఆ ఫొటో చేతిలోకి తీసుకున్నారు.

ఆ ఫొటో బరువే మోయలేనట్లుగా చేతులు గజగజా వణికాయి. నెమ్మదిగా చేతివేళ్లతో తడుముతూ ప్రతి ఒక్కరినీ పేరుపేరునా తలుచుకుంటూ ఆఖరున శ్రీదేవి దగ్గర ఆగిపోయారు.

"శ్రీదేవి! నా బాధ్యత తీరిపోయింది తల్లీ" తన వెనకే నించున్న కాత్యాయనిని తడిమారు.

"కాత్యా! అయిపోయింది. ఋణం తీరిపోయింది. మళ్లీ జన్మ అంటూ ఉంటే నీ జీవితాన్ని మరల పంచుకునే వరం ప్రసాదించు"

ఆయన కళ్లు జలజలా వర్షిస్తున్నాయి.

టప్‌టప్‌మని వానచినుకుల్లా ఫొటోమీద పడుతున్నాయి.

"ఛ ఇదేమిటి ఈ కన్నీళ్లతో కళ్లు మసకేస్తున్నాయి" అనుకుంటూ కన్నీళ్లు తుడుచుకుని చూశారు.

కానీ... నిజంగానే ఆయన కళ్లు మసకేశాయి. చేతిలోని ఫొటో వంక వెర్రిగా చూశారు. అస్పష్టమయిన పరిసరాలవైపు అయోమయంగా చూశారు.

★ ★ ★

తాళికట్టడం కూడా అయిపోయింది. కాత్యాయని ముఖంలో క్రమంగా నవ్వు, సంతోషం, మాయమయిపోసాగాయి.

ఆ స్థానంలో భయం, కంగారు మొదలయినాయి.

"నా వెనకే వస్తానన్నారు ఏరీ? "

దడదడలాడే గుండెలతో అందరి మధ్య నుండీ లేచి దూరంగా కూర్చుని తమ్ముడితో కబుర్లు చెబుతున్న కృష్ణమూర్తి దగ్గరకు పరిగెత్తింది.

"కృష్ణా మీ నాన్నగారు కన్పించారా? "

ఆందోళనగా కన్పిస్తున్న తల్లిని చూసి అడిగాడు "లేదమ్మా! ఏరి? ఏమయింది? " అతని మాట విన్పించుకోలేదు. చేతిలో వైరుబుట్టతో కల్యాణమండపంలో హడావిడిగా తిరుగుతున్న సాయికృష్ణ భుజంపట్టి ఆపి అడిగింది.

"సాయీ! మీ మామయ్య వచ్చారా? "

"వచ్చే ఉంటారని అనుకున్నాను అత్తయ్యా" అయోమయంగా చెప్పాడు.

అప్పటికే కాత్యాయనికి కాళ్లల్లో వణుకు ప్రారంభమయింది.

చరిత దగ్గరకు పరిగెత్తి అడిగింది "మీ తాతయ్య కనిపించారా? "

ప్రతి ఒక్కరినీ అడిగింది. పేరుపేరునా పిలిచి ఎంక్వయిరీ చేసింది.

అప్పటికే.... కాత్యాయనికి ఏదో అర్థమయీ అర్థమవనట్లుగా తోస్తోంది.

మనసులో ఏమూలో పొంచి ఉన్న భయం, అనుమానం, నెమ్మదిగా రాజుకోసాగాయి.

అంతే... ఒక్కసారిగా ముందుకు పరిగెత్తింది.

"నేను వెళ్లాలి. వెంటనే ఇంటికి వెళ్లాలి. త్వరగా ఎవరయినా నన్ను ఇంటికి తీసుకువెళ్లండి" గొంతు పూడుకుపోతుంటే పెద్దగా అరిచింది.

★ ★ ★

గాలి విసురుకి, ఒక్కసారిగా కిటికీ. రెక్కలు తెరుచుకుని, హాలు అంతా పొగడపూల వాసన వ్యాపించింది.

ఆ వాసనను గుండెల నిండుగా పీల్చారు ఆయన.

ఆ గాలి ఏదో సందేశాన్ని మోసుకొచ్చింది. బయటకు ఆహ్వానిస్తున్నట్లుగా ఆయన వెన్ను అంతా తడిమింది.

గజగజా వణికిపోయారు వేదమూర్తి గారు.

మసకేసిన కళ్లతో అయోమయంగా తడుముకుంటూ ముందుకు అడుగువేసి కాలి గుమ్మం తగిలి ముందుకి తూలిపడబోయి, అతికష్టంమీద ఆపుకున్నారు. పంచె జారిపోయి కాళ్లకి బంధాలు పడుతోంది.

చెవుల్లోనుండి హోరు! గడియారం గంటలు కొడుతున్న శబ్దానికి ఆయన చెవులు బద్ధలయిపోతాయేమోనని అన్పించి చెవులు గట్టిగా మూసుకున్నారు.

అదే ఆఖరుగా ఆయన విన్న శబ్దం... దూరంగా, పొగడచెట్టు అస్పష్టంగా కన్పిస్తోంది. రారమ్మని ఆహ్వానిస్తున్నట్లుగా కొమ్మలు చేతులు జాపుతున్నాయి.

నాలుగు తరాల కష్టసుఖాలకు ప్రత్యక్ష సాక్షి ఆ పొగడచెట్టు.

గాలికి కొట్టుకు పోతున్నట్లుగా ముందుకు తూలుతూ వెనకనుండి ఎవరో బలవంతంగా నెడుతున్నట్లుగా విసురుగా ఒక్క ఊపులో వచ్చి పొగడచెట్టు దగ్గరకి వచ్చిపడ్డారు. కాలు ఎత్తి, గట్టుమీదకి వేయడం, ఆయనకి బ్రహ్మప్రళయంలా ఉంది. ముందుకు వంగి, కాలు వెనక్కిపెట్టి నేల మీద దేకినట్లుగా అతికష్టంమీద గట్టు మీదకి శరీరాన్ని చేర్చారు.

అప్పటికే... ఆయన నడుము నిలిపి కూర్చునే శక్తిని కోల్పోయారు. పక్కనే పడి ఉన్న పొగడ పూలని అతి కష్టం మీద ఏరి, గుప్పిటలోకి తీసుకుని ముక్కు దగ్గిర పెట్టుకుని ఆఘ్రాణించడానికి ప్రయత్నించారు.

కానీ... ఆయనకి ఎలాంటి వాసనా రాలేదు. అసలు గాలి పీల్చడానికి ఊపిరే అందడంలేదు.

పొగడచెట్టు గట్టుమీద వెల్లికిలా పడుకున్న ఆయన గుప్పిట రెండు క్షణాలకి తెరుచుకుంది. అందులో ఉన్న పొగడపూలు గాలికి ఎగిరి కిందపడ్డాయి.

బయటగేటు విసురుగా తెరిచి, ఎదురుగా తలుపులు బార్లా తెరిచి ఉంచిన ఇంటిని చూడగానే కాత్యాయనికి గుండెజారిపోయింది.

వెంటనే.. తలతిప్పి పొగడచెట్టువైపు చూసింది.

ఆమె వెనకే... రోడ్డుమీద టాక్సీ, ఆటోలు, రిక్షాలు వరసగా క్యూకట్టినట్లుగా ఆగాయి.

అందరూ ఒక్కసారిగా లోపలికి పరిగెత్తుకొచ్చారు.

ఎదురుగా దృశ్యం చూస్తూనే ఆకృతి "అమ్మమ్మా!" అంటూ కాత్యాయనిని చుట్టేసుకుపోయింది.

"నాన్నా" అంటూ గౌరీ మనోహరి అక్కడే కుప్పకూలిపోయింది.

కృష్ణమూర్తి, సూర్యనారాయణ, తూలిపడబోతున్న తల్లిని గబుక్కున తమచేతుల్లో పొదివిపట్టుకున్నారు.

అయిదు నిముషాల తర్వాత కళ్లు తెరిచింది కాత్యాయని.

కొడుకులు, కూతురు, అల్లుడు, కోడళ్లు, మనవలు, మనవరాళ్లు అందరూ తన వారందరూ ఆమె చుట్టూ గుమిగూడి ఆమె వైపే ఆందోళనగా చూస్తున్నారు.

అపుడు... ధైర్యవచనాలు చెబుతున్న కొడుకుల ముఖాల్లో, మేమున్నాము నీకేమీ భయంలేదని వెన్నుతడుతున్న కోడళ్లు, కూతురు మాటల్లో నిన్ను విడిచి ఎక్కడికీ వెళ్లమని మనవలు, మనవరాళ్లు ఇస్తున్న భరోసాలో దిగులు, భయం వద్దని ఓదారుస్తున్న అందరిలో ఆమెకు... వేదమూర్తిగారే కన్పించారు. అందరినీ కలిపి వెళ్లిపోయిన ఆయన చిరునవ్వే కనిపిస్తోంది.

"కాత్యా! నేను లేకపోతే ఏం? నిన్ను కంటికి రెప్పలా చూసుకునే నీవాళ్లు ఇంత మంది ఉండగా! ఏలోకాన ఉన్నా ఇక నాకు నీ గురించి బెంగలేదు సుమా" చెవుల్లో వేదమూర్తిగారే గుసగుసగా చెప్పినట్లుగా అన్పిస్తోంది.

అపుడు... కన్నీళ్లు తుడుచుకుని పెదవుల మీద ముత్యంలా మెరిసిన చిరునవ్వుతో, అందరి మధ్యనుండి తలతిప్పి అటువైపు చూసింది.

గట్టుమీద అచేతనంగా పడి ఉన్న వేదమూర్తిగారి శరీరం మీద నక్షత్రాల్లా జల్లుగా రాలుతున్నాయి పొగడపూలు. ★

# 'వేదన భూమి' పై సమీక్షలు

నవలల పోటీలో ప్రథమ బహుమతి పొంది జూన్ చతురలో ప్రచురితమైన కామరాజు బ్రహ్మానందరావు రచన 'వేదనభూమి'పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## పరిష్కారమేది?

*(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

**తె**లుగు సాహిత్యంలో కల్పనకు కొదువలేదు. కానీ నిత్యజీవితానికున్న అనేక పార్శ్వాలను సుతిమెత్తగా స్పృశించిన కామరాజు బ్రహ్మానందరావుగారి 'వేదనభూమి' ఆలోచింపచేసేదిగా ఉంది.

"నే సతవుకుంటా, బడికెళ్తా గొడ్లకాయనుపో' అనే బాలకిష్టడి ఆపేక్ష, బాలకిష్టడికి చదువు చెప్పించలేని తండ్రి సీతన్న అసమర్థత, కాసుకి మొహంవాచి నీతి తప్పిన చెంచమ్మ, ఆ నిర్భాగ్యురాలి అసహాయతను అవకాశంగా మలచుకున్న జోసఫ్, అతని మిత్రులు, చెంచమ్మకు న్యాయం చేకూర్చాలనే ప్రకాశం ఆవేదన, రక్షించాల్సిన పోలీసుల వికృత వికటాట్టహాసం, తాగొచ్చి నానా హంగామా చేసే రామస్వామి చౌకబారు ప్రవర్తన, భర్త రాక్షస ప్రవృత్తి నుంచి విముక్తి కోరుకున్న మంగమ్మ సారా వ్యతిరేక ఉద్యమానికి నడుంబిగించడం, ఒళ్ళు అమ్ముకుని జీవించే చుక్కమ్మ దర్పం, తాగొచ్చి భార్యను మానసికంగా, శారీరకంగా హింసించే బోసుబాబు పురుషాహంకారం, భర్త అమానుషవైఖరినుంచి విముక్తి కోరి విహంగినై వెళ్ళిపోయిన అరుణ, తండ్రి అన్నగార్ల ప్రవర్తన రోజూ చూస్తూ పెళ్ళి అంటే భయపడుతున్న భారతి, కొడుకు పతనానికి దిగులుచెందే తిలక్, కూతుళ్ళను సినీస్టార్లను చేయాలనే జానకమ్మ పగటి కలలు, ఆ కోరికల గుర్రాలపై రెక్కలు కట్టుకుని ఎగిరిపోయే సుమిత్ర, కళ్యాణిలు, వారి అమాయకత్వాన్ని అలుసుగా తీసుకుని ఆటలాడుకునే బెనర్జిలాంటి వాళ్ళు... ఇలా ఎన్నో పాత్రలు. ఇవన్నీ విభిన్న తరగతుల జీవితాల్లోంచి మధించి తీసిన పాత్రలలాగున్నాయి తప్ప ఊహించి సృష్టించినవిగా లేవు.

కానీ కేవలం ఈ సహజత్వంవల్ల ఏ నవలా గొప్పది కాలేదు. ఎన్నో విభిన్న తరగతుల కథలను ఎన్నుకొని, ఆ కథలకు సరిఅయిన న్యాయం చేకూర్చలేకపోయారు రచయిత. పాటకు పల్లవి, కథకు శిల్పం ఎంత ముఖ్యమో, నవలకు ముగింపు కూడా అంతే ముఖ్యం. ఎంతసేపూ రచయిత పాత్రల వెంట, జీవితాల వెంట తమ కలాన్ని పరిగెత్తించి ఉన్న వేదనంతా బయటికి కక్కించి 'వేదనభూమి' అన్న నవల పేరుకు న్యాయం చేకూర్చారేమో కానీ, ఆ కథలను చిత్రకారుని అసంపూర్తి చిత్రాల్లాగా వదిలేశారు.

ఏమైనా, నిత్యజీవితంలోని పాత్రలకు చక్కటి వీడియో చిత్రంలా నిలిచిన ఈ నవల ప్రథమ బహుమతికి ఎన్నికకావడం న్యాయమే! కాని 'కావ్యరచన కేవలం కవి యశస్సుకే కాదు. ఉపదేశాత్మకంగా కూడా ఉండాలి' అనే పూర్వోక్తికి ఈ నవల సరిపోదు.

జీవన స్రవంతిలో ఎదురయ్యే ప్రాపంచిక సమస్యలకు తాజా ఉదాహరణ అయిన ఈ నవల చదివిన పాఠకులకు ఎంతసేపు వేదనలూ, రోదనలే వినిపించాయి తప్ప పరిష్కారం మాత్రం కనిపించలేదు. ఇది మా

త్రం నిజం!

-జనుంపల్లి సుకన్యారెడ్డి,
కొత్తపల్లి.

## నవల?-స్కెచ్?

*(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

**జూన్** నెల నవల 'వేదనభూమి' ఒక కొత్తవర్గాన్ని మన ముందుంచుతుంది. ఇంత వరకూ వచ్చిన రచనలలో రోడ్డు పక్కన పేవ్‌మెంట్‌మీద బతికే బిచ్చగాళ్ళను, చీకటి మాటున ఒళ్ళమ్ముకునే వేశ్యలనే ఎక్కువగా చిత్రించటం జరిగింది. అది కూడా కథా కథనానికి ఉపయోగపడే మేరకే. ప్రస్తుత నవలలో రచయిత పొద్దుటినుండీ, సాయంత్రం దాకా రెక్కలు ముక్కలు చేసుకుని పిల్లల కింత తిండి పెట్టాలని తాపత్రయ పడే తల్లులని, ఎంత కష్టపడ్డా తాగుబోతులైన భర్తలు, కొడుకుల మూలంగా శ్రమ వృధా అయిపోయే అసహాయురాండ్రైన స్త్రీల వ్యధలను చక్కగా చిత్రించారు. తోపుడు బండ్లవాళ్లను, పాలుపోసేవాళ్ళను కూరలమ్మేవాళ్ళను మనం రోజూ చూస్తూనే ఉంటాం. మన పరిధిమేరకు మామూలుగా పలకరించటమే కానీ వాళ్ళ జీవితాలలోకి ప్రవేశించం. రచయిత ఈ వర్గం వాళ్ల జీవిత విధానాన్ని ఎంత వాస్తవికంగా చిత్రించారంటే, అది వాళ్ళతో కలసి జీవించిన వాళ్ళకే సాధ్యం. సర్వస్వం ధారపోసి వేసుకున్న గుడిసెలు కాలిపోయి నిరాశా, నిస్పృహలతో కృంగిపోయిన వాళ్ల అవస్థను కళ్లకు కట్టినట్లుగా వర్ణించారు.

కుటుంబాలను ఏవిధంగానైనా బాగుపరచుకోవాలనే చెంచమ్మ, మంగమ్మ లాంటి స్త్రీల తపన, ఏదైనా చేయటానికి సిద్ధపడే నిస్సహాయత ఎంత చేసినా బాగుపడనివ్వని భర్తలు, ఎప్పుడు వీళ్లకి విముక్తి? కథలో అంతర్లీనంగా తాగుడువల్లనే ఈ వర్గం కష్టనష్టాల పాలవుతున్నారన్న విషయాన్ని రచయిత చెప్పకుండానే చెప్పారు. చెంచమ్మ, మంగమ్మ వీళ్ళంతా తమ ప్రమేయం లేకుండానే మద్యపాన నిషేధ బావుటాను తమ చేతిలోకి తీసుకున్నారని చెప్పిన తీరు ప్రశంశనీయం. కథలో అనేక పాత్రలు, అనేక కుటుంబాలు, అనేక వృత్తులు, ఆ వృత్తులలో వాళ్ళు పడే బాధలు సహజంగా రాయటం జరిగింది.

అయితే మొత్తం నవల ఒక స్కెచ్ లాగా మాత్రమే కన్పిస్తుంది తప్ప సంపూర్ణ చిత్రంగా రూపొందలేదేమోననిపిస్తుంది. రచయిత ఈ నవల ద్వారా ఏం చెప్పాలనుకుంటున్నారో స్పష్టం కాదు. నవల ఆసక్తికరంగా నే ఉన్నా చదవటం పూర్తయినాక ఏదో అసంతృప్తిగా అనిపిస్తుంది. సరైన ముగింపు లేక పోవటమే దీనికి కారణమనుకుంటాను. ఏమయినా రచయిత తన నవలలో ఒక కొత్త తరహాను చూపించటం మెచ్చుకోతగిన విషయం.

-టి. కమల
ఖమ్మం-507002

## సహజత్వ సన్నిధిలో...!

*(తృతీయ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

**క**థలు, నవలలు జీవితంలోంచే వస్తాయి అన్న భావనకు ప్రతిరూపంగా పాఠకుల కళ్ళముందు ప్రత్యక్షమైన 'వేదనభూమి' నవల అందర్నీ అలరించే నందనవనంగా రచయిత బ్రహ్మానందరావుగారు భాసింపజేశారని నిస్సందేహంగా చెప్పొచ్చు.

నిరుపేదల కన్నీటికి ఈ నవల అక్షర రూపం. "మనదీ ఒక బ్రతుకేనా సందులలో పందులవలె" అన్న మహాకవి మాటలకు ప్రతీకలుగా యిందులో వర్ణింపబడిన అధోజ

గత్సహోదరుల కష్టాలు, కన్నీళ్ళు, నిరాశా నిస్పృహలు, ఎడారిలో ఒయాసిస్సుల్లా అప్పుడప్పుడు కనిపించే అల్పసంతోష ప్రలోభాలు పాఠకులను మరో వేదనాలోకంలోకి పయనింపజేస్తాయి.

అట్టడుగు బడుగువర్గాలు, దిగువ, ఎగువ మధ్య తరగతి వర్గాల నిరంతర జీవన పోరాటంలో వారెదుర్కొనే ఆటుపోట్లు అత్యంత సహజంగా చిత్రీకరింపబడ్డాయి. సీతన్న, చెంచమ్మ, కిష్టప్పల కథతో ప్రారంభమైన కథనం దళితగాథల బాధలతో విరాట్స్వరూపంపొందుతుంది. అలాంటివాళ్ళకు చేయూతనిచ్చే ప్రకాశం వంటి వైద్యయువకుని కథనం వారి భవితకు ఆశాచిహ్నమైన మలుపుగా భావించి అలాంటి ప్రకాశాలు భావి సమాజంలో లభిస్తాయని ప్రగతి కాముకులు భావించవచ్చును.

దళితుల ధనమానప్రాణాలకు రక్షణ లేదని చెంచమ్మపై జరిగిన పాశవిక మానభంగకాండ, బాపయ్యచే గావించబడ్డ స్థలాల గెంటివేత నిరూపిస్తాయి. ఈ సన్నివేశాలు రాచపుండులా ఎదుగుతున్న నేటి బస్తీవిషనాగరికతలో ప్రతిచోటా నిత్యం కనిపించే సత్యాలు.

సినిమా వ్యామోహంలో కూతుళ్ళను బలి పెట్టటానికి సైతం సిద్ధమయ్యే జానకమ్మ లాంటి తల్లులు, తాగుబోతు భర్తల ధాష్టికం భరించలేక చస్తే బాగుండుననుకునే మంగమ్మ లాంటి కన్నీటి కుండలూ, పొట్టకూటికి వ్యభిచరించే ఖతీజాలాంటి షోకిల్లాలూ, వారిని వాడుకుంటూ బాధ్యతల్ని విస్మరించే గోపిలాంటి ప్రబుద్ధులూ మన చుట్టూ వున్న సామాజికరంగంలో మనకు అనుక్షణం కనబడ్తూనే వుంటారు.

సహజత్వానికి పెద్దపీటవేసిన ఈ నవలలో పాత్రలు, సన్నివేశాలు మరీ ఎక్కువయేటప్పటికి పాఠకుడి జ్ఞాపకశక్తికి పరీక్షగా మారుతుంది. చెంచమ్మ పాశవిక బలాత్కారం సహజత్వం పేరుతో చిత్రీకరించబడటం కొంత బాధాకరంగా వుంటుంది. ఈ ఒకటి రెండు లోపాలు మినహా వేదనభూమి నవల వర్తమాన సమాజాన్ని సాక్షాత్కరింపజేయడంలో పూర్తిగా విజయవంతమైందని భావించవచ్చును. ఎన్ని ఇజాలు వచ్చినా పేదల బతుకులింతేనన్న నిజాన్ని నిఖార్సుగా నిరూపించిన ఈ నవల నిజంగా అభినందించ తగ్గది.

-సుచంద్ర
ఖమ్మం-507003.

# నిజం కాదు ఊహ!

*(నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

'వేదనభూమి' చదువుతుంటే, కొన్ని పదుల సంవత్సరాల క్రితం రావలసిన నవల అనిపిస్తుంది. రచయిత ఉద్దేశ్యాలు మంచివేగానీ, విషయం పాతదే. ఒకప్పుడు పొరపాటునగానీ కోపంతోగాని, అసహ్యంతోగాని, ఏమీ చేయలేని నిస్సహాయతతోగాని పరుషంగా 'ఒరే మాదిగ వెధవా' అని తిడ్తే నోరుమూసుకుని పోయే కాలం కాదు ఇది. ఈనాడు తమతమ పేర్ల చివర్న ఆ కులాన్నే సూచిస్తూ రాసుకొంటున్నారు. గర్వంగా తిరుగుతున్నారు. రిజర్వేషన్లు దండు కొంటున్నారు. మంత్రి పదవులు కొట్టేస్తున్నారు. అలా అన్న వాడిని, నిలువునా చీరేయకపోయినా అంత పరిస్థితి కలుగచేస్తున్నారు. అలాంటి ఈ రోజుల్లో ఎవరో అగ్రకులాలవాళ్లు వాళ్ళని బానిసలుగా చూస్తున్నారని, తమతో సమంగా చూడటంలేదని తలపోసేవారు నిజమైన నిమ్నజాతులవాళ్ళు కారు. వారి పేరుతో ఓట్లు గండుకొంటున్న రాజకీయ నాయకులు, ఏదోవిధంగా వారి పేరుతో లబ్ధి పొందే జనాభా మాత్రమే.

ఈరోజు చదువుల విషయంలోగాని, ఉద్యోగాల విషయంలోగాని, ఉద్యోగం ప్రో

మోషన్ల విషయంలోగాని, వివాహాలలోగాని చివరకు చావుల విషయంలోగాని నిమ్నజాతులకు కల అవకాశాలు, గొప్పగా చెప్పుకొని తిరిగే అగ్రకులాలవారికి లేవు. ఈ విషయం రచయిత గుర్తించాలి.

"కాసుకు కక్కుర్తిపడి పదుగురిచేత సామూహిక మానభంగం, అత్యాచారం" అన్న అభిప్రాయం రచయితల్లో ఉండవలసిన ఉద్దేశ్యం కాదు. ఇలాంటి కాసుకు కాళ్ళెత్తే నైజాన్ని, పద్ధతిని ఏ సభ్యసమాజం గౌరవించదు. అనవసరంగా దీన్ని హైలైట్ చేసి రచయిత తన బలహీనతను ప్రదర్శించారు.

చివరగా, లక్షలకు, ఆపై లక్షలనుండి కోట్లకు పరుగులు తీస్తున్న రాజకీయ నాయకుల గురించి కూడా రచయిత దృక్పథం తప్పు అని నా అభిప్రాయం. ఈనాడు రాజకీయ రంగంలో పోటీపడే అవకాశం, హంగు ఎవరి చేతుల్లో ఉందో రచయిత గ్రహించాలి?

ఏవిధంగా చూసినా, రచన ఎంత సరళంగా సాగినా, తనకు తెలిసిన చిన్నతనపు విషయాలను హైలైట్ చేసి, దానికి కొంత ఊహ జోడించి, మరికొంత ఊహించి ప్రథమ బహుమతి కొట్టేశారు రచయిత.

-ఎస్. హరనాథబాబు
హైదరాబాద్-500044

# వాస్తవికతకు దగ్గరగా...!

*(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

"వేదనభూమి" నవల భిన్న జీవితాల, భిన్న మనస్తత్వాల సామూహిక వేదిక. రచయిత కామరాజు బహ్మానందరావుగారు పేదలతోపాటు మధ్యతరగతివారి జీవితాలలోని వేదననూ విభిన్న పాత్రల్లో చిత్రీకరించారు. పేదలు కలవారి స్వార్థాలకు ఎలా బలయ్యేదీ, పెంపకంలో లోపంవల్ల ఈ తరం యువత ఏవిధంగా పెడదారి పట్టేదీ, ఆయా పాత్రల ద్వారా చూపించారు. ప్రకాశంలాంటి యువకుడు నిస్వార్థంగా పేద ప్రజలకు సేవ చేయటాన్ని చక్కగా చెప్పారు. మల్లేశ్వరరావు పాత్రద్వారా అవకాశవాదులు ఎలా ప్రభుత్వాన్ని, ఆఫీసర్లని ఏయే స్కీముల ద్వారా ఎలా వాడుకొని ఎలా ధనవంతుల య్యారో తెలుస్తుంది. వాస్తవానికి సమాజంలో నిరుపేదలకు ప్రభుత్వాలు భూములు పంపిణీ చేసినా వారు ధనం లేకనో మరో కారణంతోనో కాంట్రాక్టర్లలకు కాని భూస్వాములకు కాని ఎంతో కొంత ధనానికి అమ్మివేస్తూ వారి స్వార్థానికి బలౌతున్నారు. అక్షరజ్ఞానం లేని వ్యక్తి రామస్వామి నుండి లెక్చరర్ బోస్‌బాబు, తండ్రి తిలక్‌వరకూ తాగుడుకు బానిసలై తమ వ్యక్తిత్వాలను ఏవిధంగా కోల్పోతారో సహజంగా వర్ణించారు. భారతి వ్యక్తిత్వం, ఆత్మవిశ్వాసం వాళ్ళ కళ్ళు తెరిపించేలావుంది. చెంచమ్మ అష్టకష్టాలుపడి తనకుటుంబాన్ని నిలుపుకోవడాన్ని రచయిత హృద్యంగా చిత్రీకరించారు. భర్త పెట్టే చిత్రహింసలు తాళలేక మంగమ్మ తన భర్త చావునే కోరుకోవడం ఆ పాత్రపట్ల పాఠకులకు సానుభూతి కల్గించేదిగానే వుంది. అణగారిన జీవితాలలో దౌర్జన్యాలు, మద్యపాన సమస్య, ఇలా అనేక విషయాలను రచయిత హృద్యంగా చిత్రీకరించారు.

మేడా నాగలక్ష్మి
గుత్తి 515401.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad Tel: 290328 Office Address: CHATURA Monthly, Eenadu Compound, Somajiguda. Tel. Hyderabad: 3318181, 3398787; Madras: 8270134, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75291; Anantapur: 33777: Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942; Nellore: 331080

